సీ. తనగురూత్తముపేర • జనకునిపేరను
 దనయన్నపేరను • దనదుపేర
దమ్ముల పేరను • దనయుపేరిట దల్లి
 పేరను సోదరి • పేర భాగ్య
పేర మరంపలి • పేరను లింగాపు
 రంబును గాచాపు • రంబు జంగ
మారెడ్డిపురము కామారెడ్డి యును నెల్ల
 రెడ్డిపేటయు మల్లరెడ్డి కామి

గీ॥ రడ్డిపేటలు తిప్పాపు • రంబు సిరుల
బాదలు లింగాపురంబును • పోతసాని
పల్లెయును నించఁగట్టించె • భవ్యకీర్తి
ప్రబలు మాయన్న శ్రీకామి • రడ్డిఘనుఁడు

అని శివధర్మోత్తరావతరణిక పద్యములవలన కామారెడ్డి ధరాధీశుండు లింగాపురము కాచాపురము జంగమరెడ్డిపురము కామారెడ్డిపేట యెల్లారెడ్డిపేట, మల్లారెడ్డిపేట, కామిరెడ్డిపేట తిప్పాపురము పోతసానిపల్లెయను గ్రామములను నిర్మించినట్లు దెలియుచున్నది. చెరువులు కుంటలు వాటికి కాలువలు బావులు చలేంద్రంబులను చిక్కనవోలు శ్రీసిద్ధరామేశ్వరస్వామికినొక దేవాలయంబును నిర్మించినట్లు పైతటాకాదులను నిర్మించుటకు రు ౧౦౩౦౦౦లు వ్రయమయినట్లు అపర్ మినన్ అలఫ్ అనగా ౧౧౦౦ హిజిరినాటి శాసనపత్రము సంస్థానాధీశుల చెంతగలదు. ఈహిజిరికి బట్టి చూచినను రాజభూపాలుఁడు ౧౨౨ సంవత్సరములకు పూర్వముండినవాఁడని స్పష్టమగుచున్నది.

రాజన్నచౌదరి భూపాలుండు కృతినొందిన శ్రీకృష్ణవిలాసము [illegible] భద్రాద్రాయు రభ్యుదయమును మఱియు నిజవంశ భూషణుండగు రాజా మల్లారెడ్డికవి రచించిన షట్చక్రవర్తి చరిత్రము శివధర్మోత్తరము పద్మపురాణము మొదలగు గ్రంథముల ముద్రింపఁజేసి యాంధ్రలోకమునకు మహోపకారంబొనరించిన వర్తమాన దోమకొండ సంస్థానాధీశ వరేణ్యులగు శ్రీమంతు రాజా రాజేశ్వర రావు బహద్దరు వర్మ గారిని శ్రీ వారి పుత్రపౌత్రులను జగదీశ్వరుడు రక్షించుగాత.

ఉమాబాద్
[illegible]పల్లి స్టేషన్ రోడ్
హైద్రాబాద్ దక్కన్

ఇట్లు
పెద్ద మందడి వేంకట కృష్ణకవి
సంస్థాన్ దోమకొండ



శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము.



## ప్రథమోల్లాసము.





శ్రీవర్ధిష్ణులిదం సమస్త చిదచి, జ్జేగీయమానప్రపం
చావిర్భావతిరోవిధానకరుల, న్యోన్యా వినాభావవే
షావిష్కారులు పూర్వదంపతులు న, త్యానందులైనట్టియా
శ్రీవర్ధిష్ణుల బార్వతీశ్వరుల నే - సేవింతునేతత్కృతిన్. - ౧

శా. శ్రీమద్ద్వాదశ ముఖ్యవర్ణ ముఖమి, శ్రీభూత నానాజను
స్వామిత్వాంచితమై ప్రతాపకరమై, స్వర్ధేనువై స్వప్రభా
యామామేయ చిదంబరాకృతియునై, హార్దస్తుతింజెందునా
శ్రీమాతన్బరిశుద్ధ మానసమునన్, సేవింతునే తత్కృతిన్.

శా. శ్రీసంకాశ దనూపమానగుణ సీతాం, బ్రఖ్యానమేళజ్జగ ౨
ద్భాసాధాన కరంబుగాంగ నిజప్రా, భావోపపన్నంబులై

వాసింజెందిన వారిజాసనముఖ • న్యాపాగముల్ స్వప్రభా
రాసంయుక్తత నొందుచోఁ దగు మహా • దాజ్ఞన్ దలంతున్మతిన్.

మ. విలసత్సాత్త్విక వింశదక్షరసమా • విర్భూత మన్వంతరో
జ్వలదాత్మ ప్రతిభన్ సభక్తినమయా • చారంబులో నిల్చువా
రలకిష్టార్థ మొసంగి లోకముల సం • రక్షించుచున్నట్టి శ్రీ
లలితాంబా కళయైన దేవిఁ దలఁతున్ • లక్షించి యేతత్కృతిన్ ౪

శా. ప్రాకాశాభ నిజాననాంతరమునన్ • భాస్వత్ప్రకాశంబుఁడా
లోకించన్ దదుదారభావమును మున్ • లోఁగొంచు నానాప్రకా
రాకారంబుల గల్గు లోకములనె • య్యంబొప్పఁ గల్పించి తా
నేకాకారతనొందు నాస్ఫురణనే • నేతత్కృతిన్ దల్చెదన్. ౫

చ. విలసితమైన యమ్మిహిర • బింబువు ముద్దుమొగంబుగాఁగనా
జ్వలన సుధాంశుబిందువులు • చక్కనిసిబ్బెపు గబ్బిగుబ్బలై
యలరఁ బరార్థమెన్నరశనాస్పదమై విలసిల్లుచుండ వ
ర్తిలు తదభేదమైన పర • దేవిఁ దలంచెద నీమహత్కృతిన్. ౬

మ. అమితాలంకరణాభిశోభితయు మా • యాపాయ దుర్మంత్రచం
క్రమణప్రక్రమ మార్గదుర్గజయవి • ఘ్నప్రాజ్య యంత్రాద్యుప
క్రమనిర్వక్ర పరాక్రమ స్థితివిశే • షప్రాణ హృచ్ఛాపశౌ
ర్యమునన్ మించి నమంచితాత్మయగు వా • రాహిన్ మదిన్ దల్చెదన్. ౭

మ. కరమొప్పన్ముసుతాళభేదనియతుల్ • కాలక్రియామానముల్
పరివిస్ఫూర్జిత మూర్ఛనాంతరములు , త్పాదించి వీణావినో
దరతిన్ సొంపుజనింపుపెంపుగల మా • తంగాంగనల్ బాడను
స్థిరసింహాసన వాసయై దనరు ల • క్ష్మిన్ నెమ్మదిన్ గొల్చెదన్. ౮

శా. కాదంబాళి చకోరికాపికశుక, క్రౌంచాదిపక్షి స్ఫుర
త్కాదంబ ప్రసవ ప్రభూత మధుసం • ఘాతాపుతాకారమై
కాదంబర్యగన ప్రమోదననట • త్కాంతా సనాదార్భటీ
కాదంబస్థితి గల్గుదేవినిఁ బురః • స్ఫూరింతు నేతత్కృతిన్.

శా. ఆదిన్ దివ్య విమర్శరూపిణియునై • యా శ్రీ ప్రకాశాత్మతా
వైతాదంబేర్పడ నీచరాచర జగ • న్మూలంబు తానయ్యు త

ప్రాదుర్భూత పరాదివైఖరులచే • భాసిల్లుచో ముందహం
తేదంతైక్యము నాపరాకళనునే • నేతత్కృతింగొల్చెదన్ .

మ. సకలస్థావర జంగమాత్మకజగ • జ్జాలంబు నిర్మించి త
త్ప్రకటీభూతములైన కార్యములనె • ల్లాదించి బ్రహ్మాండక
ల్పకుఁడై నిక్కపునాదునన్ వెలయు నా • భారత్యధీశుండు ది
వ్యకవిత్వాంచితమైన మత్కృతిని ని • త్యానంద మొందించుతన్, ౧౧

మ. సమసూత్రైస్త్రైక దశాసమేత చిదచి • జ్జ్ఞానస్వరూపంబు జెం
దు మహా స్థూలదశాసమేత చిదచి • త్కార్య స్వరూపంబునన్
బ్రసుదంజేర్పడ నొక్కడై జగమును • త్పాదించు లక్ష్మీశ్వరుం
డమితస్తోత్ర కృతాస్మదీయకృతినా • హ్లాదంబు నొందించుతన్. ౧౨

శా. శ్రీకాంతా రుచిరత్వ మెల్లపుడు వీ • క్షించన్మదిన్దల్చి యు
త్సోకంబైన నిమేషమొందునని వి • స్ఫూర్జత్కటాక్షాలయ
ప్రాకట్యస్థితి నొందఁజేసి సకల • ప్రాణ్యుత్సవంబెంచు నా
శ్రీకాంతుండగు వేంకటేశ్వరుఁడు ర • క్షించున్మదంచత్కృతిన్. ౧౩

శా. శ్రీవర్ణావయవాత్మసంభవచిద • జ్జీవాఖిలస్వామి స్వ
భావప్రస్ఫుట జ్ఞానకీరమణి సం • భావింపఁ దత్త్రిక్రియా
ప్రావీణ్యంబు వహించు తారకమును • ప్రావీణ్యము న్జెందునా
శ్రీవర్ణుండగు రాముఁడీకృతిని ర • క్షించు న్జిరస్థాయిగా. ౧౪

మ. వనజాక్షుండు పురందరోపలము నై • వర్తింప దానాజపా
కనదచ్ఛప్రసవంబునై దనరి త • త్కాయంబు లోవెల్వలన్
దనకాంతిన్ బ్రసరింపఁజేయుచును మున్దత్త్వావినాభూతయై
మనుగన్పట్టిన లక్ష్మి మత్కృతిని స • మ్మోదంబునొందించుతన్. ౧౫

మ. యతులొక్కప్పుడు భక్తిచే నిజసహ • స్రారంబులన్ శ్రీశ్రియః
పతిబూజింపఁగటంచెంత నే సతతము • ప్పదాబ్జుఁ నంతర్బహి
స్థితునింజేసి తదాజ్ఞచే నసురయో • షిత్కంఠసూత్రైకవ్యాసం
యతప్పత్తిన్ జరియింతునంచను సహ • స్రారంబు దల్చున్ మదిన్. ౧౬

సీ. ధుర్యయోగ్రాదనో • త్పుకత వచ్చునటంచు । నిసుఁడనూర్పు ప్రేమ • ననువరింప
కార్ముకజ్యాజిఘ్రు • క్షునుజను దెంచునో । యనిశంకరుఁడు శంకఁ • గొనివదింప
దల్పగ్రసనబుద్ధి • దలపోయునోయని । హరిపాదరంబున • ననునయింప
యజ్ఞోపవీతసం • హరణార్థ మేతెంచునోయని విఘ్నేశు • డూహసేయ

గీ. నిజగరున్మరుదుద్ధూత • నిఖిలభూమి । ధరుఁడు ఫణిభృత్తయూపతిప • త్రపహరణుఁ
డైన శ్రీవైనతేయుండు • నస్మదీయ । కలుషచయ మడంచుఁగావుతఁ • గరుణతోడ.

మ. మునుగృష్ణార్జున పక్షవిస్ఫురణతన్ • మోదంబుగల్పించి సాం
పునఁ గృష్ణార్జునపక్షవిస్ఫురణనీ • భూతప్రపంచంబునే
ర్పునఁ గన్పట్టఁగఁ జేయుచో నిజపదాం • భోజాశ్రముల్ గొల్చువా
రిని రక్షించు శివుండు మత్కృతినిసు • శ్రీనొందగాఁజేయుతన్. ౧౮

శా. శ్రీవాణీశము ఖ్యామరాధిపులిదం • సృష్ట్యాదిలో నాత్మలం
దేవాసన్ భజియించి హృద్యఫల సా • హిత్యంబు ముంజెందిర
ద్దేవున్ దజ్జయ యంత్రపఘ్నహరణున్ • దీక్షానసున్ సిద్ధల
క్ష్మీవిఘ్నేశు నిరంతరాయమునకై • జింతింతు నేతత్కృతిన్. ౧౯

శా. శ్రీరామాయణ భారతాఖ్య రచనా • జేగీయమానప్రథా
ధౌరంధర్య సమేత వాస్తవకథా • ధన్యాత్మ వల్మీకభూ
పారాశర్యులఁ గొల్చి ఛందములసం • పాదించి వృత్తప్రభే
దాహూతస్థితులెంచు పింగళభుజం • గాధీశ్వరున్ గొల్చెదన్. ౨౦

గీ. కావ్యనాటకసంగ్రహ • కాళిదాసు దండి భవభూతిశంకర • డిండిమాంక
రామకవిచోర మాఘభా • రవిమయూర బాణబిల్హణముఖులమున్ • బ్రస్తుతింతు

ఉ. ప్రాకృత సంస్కృతాంధ్రపర • భాగము లుల్లసిలంగ వైకృత
వ్యాకరణంబు జేసి బుధ • వత్సలతన్ సకలార్థవత్పురా
ణాకలితేతిహాసముఁ • నన్నివచించిన నన్నయాఖ్యను
శ్లోకుని దక్కయజ్వనువ • చోనియతిన్ వినుతింతు మత్కృతిన్. ౨౧

గీ. తెలివిలేక ప్రదోషైక • దృష్టియూఢి । విధునవబోధితావృత్తి • వెలయుచుండ
సంతతారుంతదోక్తులు • సల్పుచుండు । కాకవులుకాకవులుగాక • కలితనుతుతె

కం. కృతులుగల • కృతులొనర్చని। కృతులదలంచియు దలంచ • కెంతేనినిరా
కృతులంచు • గృతులొనర్చన । గృతుల దలంపంగ నేల•పృథ్వీస్థలిపై. ౨౪

వ. అని యిష్టదేవతా, గురు, సుకవి, కుకవి, నమస్కరణ, పురస్కరణ తిరస్కరణంబు లొనరించి యొక్క పారమేశ్వర పవర్యాచర్య ధుర్యుండగు మహీశ్వరు దర్శింపు తలంపున నుండునెడ. ౨౫

సీ. నవరత్న మాళిసం • భవమహః పుంజంబు
మ్రుందు జ్యోతిశ్చక్ర•మును హసింపఁ
గరుణా రసస్యంది • సరసనేత్రంబులు
సితకరార్కుల శ్రేణి • సేయుచుండ
చారుముక్తాఫలో • దారహారద్యుతుల్
గురుభార్గవులకు సం • కోచ మొసఁగ
సకల వాణీమయ • చ్ఛన్న వీరప్రసిల్
రత్నసా నుచ్ఛవి • రహిఁనడంప
గీ. సామితన్మూర్తి భృఙ్గగ • జనని పేమ। దెలియఁగఁ బరాపరప్రకృ• తిత్వ మొందు
భవ్యసమయస్వరూపప్ర•భావమహిమ।నలది యొక దేవ దేవుండు•పొలిచె మదిని.

వ. ఇట్లు స్ఫురించిన విశేషఫలంబు నగునని తలంచి. ౨౬

మ. పరవిద్యా నుపమానమీనానయనా • ప్రాకాశ నీకాశసుం
దర పాదద్వితయోల్ల సన్నఖముఖాం • తర్బింబి తప్రత్యగాం
తరదృక్తారక నామయోగి గురుపాదద్వంద్వమున్నెమ్మదిన్
స్థిరతన్ జెందఁగఁజేసి ప్రత్యగయనా • ప్తిన్బొందఁగా నొక్కచో. ౨౭

కం. శ్రీరామేశ్వర వరకరు • ణారూఢికటాక్షహితు • నాగతలక్ష్మీ
పూరిత ధనధాన్యాది • శ్రీరామారెడ్డిసేటు • చెలఁగుక భువిలో. ౨౮

సీ. హరిహరిద్గిరిచర • ద్గురుమరుద్వరసరి
త్సరిదహత్కృతకాద్రి • పరిసరములు
శ్లిథదళత్పలగళ • న్మధుల లన్మదలగ
ద్దళచలత్పికశ్రుకో • ద్యానములును
నవభవత్ప్రవసము • ద్భవసముత్సవయుతో
పవనాంతరితయజ్ఞ • భవనములును

ఘనకంజ వనసంజ । వనసంజ వనగుంజ
దళిరంజిత సమంజ • సాంబుజసలు
గీ. దొరయ మెరసె నిరంతర • సరదసమకు। సుమసుమరసరజోఘుమ • ఘుమితగంధ
వాసితాంతర్గృహారామ • రామరాము।నృపసిపురమఖిలశ్రీల • నెగ్గుచుండె. ౩౦

సీ. దీపితా శ్రావయే • తిప్రయోగశ్రుతి
జాగదక్షరభృతి • సంచయములు
సుఖత కామాజికా • స్త్రీశ్రౌషడితి సదా
వావ దచ్చారికా • వారములును
శ్రోతృశ్రవణసౌఖ్య • దాత్రయ జేత్య
రారట ద్రుచిరపా • కావతములు
హితయేయు జామహా • ఇతిభవ్యభాషి
లాలపద్భర్త్రిక • లాపములును
గీ. సరసవౌషడితిప్రభా • వచ్ఛుకములు। బరగ జెలువొందె రామభూ • పాలనగరి
మానసీయోల్ల సత్కామి • నేనివంశ।జనసరాజన్న భూపాలు • శాసనమున. ౩౦

సీ. సింజాన సుమనః ప్ర • యుంజాన మకరంద
భుంజాన మధుకరీ రంజితంబు
కంజాత కింజల్క • పుంజాత తపరాగ
సంజాత నదపరి • ష్వంజితంబు
ఖంజరీట విహార • మంజరీ పరివార
పింజరీ కృతభూజ • మంజులంబు
గుంజాధిగమ్యసా • మంజస్య సమ్యజ్ఞ
గుంజాతి రమ్యభూ • మంజిమంబు
గీ. నగుచుఁ దొగరగు జిగిడగి • నిగుడు మొగడ।లగణితములగు పొగడల • తెగలసొగసు
గలవలపుగుమగుమయని • చెలువుఁజూప।బ్రమదవన మొప్పుచుండున • ప్పట్టణమున

సీ. సముదాతిశోయమయః • ప్రమదాతతకరాగ్ర
సముదాతతపలాశ • కుముదములును
స్యందమానమరంద • బృందపానమిళింద
నందదాన మహార • విందములును

ప్రథమోల్లాసము

నానావినీతప్ర • సూనావృతాంతరీ
పానీత హీరసో • పానములును
ల్లోలాను వేలాను • కులానువేలక
ల్లోలాను సరకోక • జాలములును

గీ. దనరనాంతర తలపాతి • తప్రవమాక్తి। రగ్రహాణనైగ నిద్యోద • రప్రకార
పూరితోదర దీర్ఘికా • వారములరె। రామభూపాలు పేటలో• రమ్యముగను.

కం. అపరాగములై • తనరిన। నపరాగంబులను దోహ • దార్ధక్రియచే
నపరాగగముల• జేయుదు। రుపవనమునఁ దత్పురీవ• రోయుక్తసతుల్. 38

సీ. పాటీర వాటీర ! కోటీర నికటాగ
· కందంబులైన మా • కందములును
యుక్తాతి ముక్తాతి • రిక్తాప్రసవకాంతి
పాటలాకృతినొందు • పాటలములు
నీపాను రూపస్వ • రూపద్యుతుల్ గల్గు
కేసరంబులఁ జెందు • కేసరములు
సాలావృతైలాప • మాలోల కిన్నరీ
మోదినులైన • ప్రమోదినులును

గీ॥ మల్లికలలోనఁ దగు దీవ • మల్లికలును
జీవకములై వెలయు బంధు • జీవకములు
కాంచనంబు లనఁగ నొప్పు • కాంచనములు
గలిగి విలసిల్లుఁ దత్పురో • త్కంఠవనము. 39

సీ. తతదరీ చ్యుతఝరీ • హితకరీ స్తుతతరీ
గతచరీ తతపరీ • వృతధరములు
నతివేల ఘతిశీల • గతిలోల రతిపాల
హితఖేల దతిసీల • ధృతిమదలలు
సారదుర్వారదో • స్సారవన్మారనా
సీరసంచారయు • క్సారికలును
ప్రకట కోరకఫలా • దికమధూదకభూజ
శుకసముత్సుకపిక ప్రకరములును

గీ. తరణికిరణవిహారణ నిగ • రణతరువు| వరుణ వరణాంతరిత సరో • వరనివసద
వక్ర చక్రాంగ చక్రప • వర్తనములు| దనర దన్నగరోద్యాన • వనములలరె.

సీ. ఏలావనీజాత - హింతాలాఘు నిభూత
చాలా నిలాధూత • జాలకంబు
హేలీకృతారాళ • పాళీలతాజాల
కేళీరతోద్వేల • బాలికంబు
నానాలతాస్పంద • సూనాయత మరంద
పానాగ తమిళింద • తానకంబు
సారసోదారకా • సారసోదారసా
సార సంసారయు • క్సారికంబు

గీ|| లుంగతరుసంగ రింగత్తు • రంగమ్ములును| బ్రియకసాలలసద్వన • ప్రియకములును
కోరకనికుంజ గుంజచ్ఛ • కోరకములు| గలిగి తత్ప్రమదవనంబు • పొలిచియుండె.

సీ. ధూపముల్ కర్పూర • దీపముల్ మధురసా
పూపముల్ దర్పణ • స్థాపనములు
ఖాద్యముల్ దివ్యనై • వేద్యముల్ విమలాంబు
పాద్యముల్ నిస్వన • వాద్యములును
పూగముల్ పీటికా • భోగముల్ దక్షిణా
భాగముల్ గంధసం • యోగములును
ఫలములు మాలూర • దళములు సారసో
త్పలములు శుద్ధతం • డులములలర

గీ. శంఖకాహళఘంటికా • ఝల్లరులును| మ్రోయ ముత్యాలముగ్గులింపుగ ఘటింప
దివ్యమందిరముల మహా • దేవు భక్తి| బూజసేయుదు రెప్పుడు • పౌరజనులు. ౩౮

కం. ఆనకములు విమతజనభ| యానకములు మ్రోయు నామ • దధ్వవిచారా
దానసదానదాకములు| మానవపతులలర శివుని • మంటపములపై. ౩౯

కం. దరములు సతతసుధాసా| దరములు షడ్విధివిచార • తాత్పర్యసమా
దరములు సంసృతిదరతో| దరతోదరములయి మెలగు • దత్పురిలోనన్. ౪౦

కం. నయమానయమా నయనో| దయములై దత్పురి వసించు • జనతతులు సదా
నయతోదయతోదములై| ప్రియమగు శివభక్తి మదిని • బెంపెసలారన్. ౪౧

కం. నవకుసుమాసమనాగో| పవనోదర సద్విహంగ • భవరవభరనీ
పవనోదర పవనోదర| భవనాదము లగుచు నుంద్రు • ప్రజలప్పురిలోన్. ౪౨

సీ. మదనాశుగ వికాస • కృదనారత విలాస
సదనాహతావాస • సదనదులును
కేళీ విహిత సంత • కేళీ విహిత నారి
కేళీ విహిత సుప్ర • తోళికలును
నాళీకనిర్యన్మ • ధూళీక చర్య ప్ర
ణాళీకదర్యన్మ • రాళికలును
పాళీ లతాంతరిం • ఛోళీ నితాంతయు,
క్రాళీ హితాంత ద్రుమ • మాళికలును
గీ. దోఁగయు మెఱసె నిరంతరాం • బుగ, తపల్ల
వితత, సుమిత ఫలోద్యాన • వితతు లెపుడు
రాజితాడ్లారి సీమాభి • రామ గ్రామ
రడ్డిపేటను జనులెల్ల • గంజిలంగ. ౪౩

మ. బలనత్స్వర్ణ మయూగ్ర విగ్రహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం • తర్పింబితంబై తగుఁ
దలరాదంచు వచింప ఖేదమున నెం • తఁ విన్న నయ్యెంగదా
బలిసాలంబిక దీనిఁ దేర్తు నని • సంభావింపఁగా నోయనన్. ౪౪

పాఠాంతరము.

బలభిద్రత్న ఘృణీసమావహ బహిః • ప్రాకార ముద్యద్రసా
తలజారుంతద ఖన్యమాన పరిఖాం • తర్పింబితంబౌచు, సొం
పలరెన్, దీనిజలంబున్నపుడి, మనః • ప్యాద్దృశ్యమైయుండె, నా
బలిసద్మంబట దీనిఁ దేర్తుననిసం • భావింపఁగా నోయనన్, ౪౫

మ. అమలాగాధ పయఃప్రపూర జల స • త్వానేక తీర్థోరుఖే
యము, దోఁచున్ నిజభక్త పాలనమునం • దాసక్తుఁడై సన్నుతా
గమ రాజేశ్వరుఁడుండినన్ పదభిషే • కస్వస్తిహేత్వర్థమై
యమరాధీశ్వరుఁడంప, సంభ్రమముతో • నందుండు మిన్నేరనన్. ౪[illegible]

మ. సరసాభ్రంకష చంద్రికోపల చతు • స్తంభంబు లొప్పంగఁ ద
త్సంమధ్యంబున మధ్యశాల దనరున్ • పుంజీభవత్పుణ్యమాఁ

ర్గ రతుల్ ధర్మము నాల్గు పాదములచేఁ • గన్పట్టఁ జేయంజతుః
పురుషార్థంబులుగూడి నిల్చెనన సం • పూర్ణేంది రావాసమై. ౪౭

మ. అలరున్ స్వర్ణమయం పుటోడలునురు • వ్యాఘ్రాధ వాద్యత్తరో
జ్జ్వల దచ్ఛోదక కూపముల్ దనరుత • స్థానీయ లక్ష్మి శుభా
చల నారంభమునన్ జనుల్ నిలుపు, మో • చాస్తంభ సంభారమ
ధ్యల సత్పూర్ణ సువర్ణ కుంభముల చం • దంబొప్ప నా ప్రోలునన్. ౪౮

మ. వియదుల్లంఘన జాంఘికా జిరతలా • విర్భూత వానస్పతుల్
శ్రియ సంప్రాప్య ఫలప్రసూన కలికా • సంపత్తి బొల్చెన్ శివా
దయితారాధ్య విధిజ్ఞులై చెలంగి పురుషా • త ప్రేషితంబైనయ
వ్యయ కల్పద్రుమ మన్నగా కృతులచే • నందుండెనా నప్పురిన్. ౪౯

చ. లలితరసాలసాలకిస • లంబుల నింపగు పచ్చ తోరణం
బులుగల చైత్య వృక్షములు • పొల్చెను, నిర్విష వర్తనంబుల
న్గలసిన గారుడాశ్మముల • గంటుల నొందిన మేలుకట్టులన్
నలువ సృజించెనోయన జ • నంబులు సంతసమంద నప్పురిన్. ౫౦

చ. కలువల తేనిగాలపయి • కప్పుల పుత్తడి యొంటికంబ పుం
బలితపు మేడల ప్పటిని • భాసిలు, తత్పుర లక్ష్మికింపుగాఁ
బలరిపు, దక్షిణాధిపతి, • పాశి కుబేరకులాంగనామణుల్
కలిత సితాతపత్రములఁ • గౌతుక మొప్పఁగఁ బట్టిరో యనన్. ౫౧

శా. అంతర్వ్యాసవ నీలతారకలు బా • హ్యస్థారుణ గ్రావనే
త్రాంతంబుల్ రుచిరార్జునారద సుప • క్ష్మౌఘంబు లింపొందగా
నంతర్ద్వార విలోకనంబుల సుప • ర్వావాస భూలక్ష్మి శు
ద్ధాంత స్త్రీలఁ గనుంగొనన్ నిలుచు చం • దంబేర్పడన్ బ్రోలునన్. ౫౨

మ. పొలుచుం జిత్రపచితి త్రపతిమలా • స్ఫూర్జత్ప్రతీహారని
ర్మలపాండుద్యుతిదీప్త షడ్జములువా • క్ప్రస్తుగాంధారకా
కలితగ్రామ విపంచికా శ్రవణసౌ • ఖ్యోదయ వ్యస్తృతిన్
గలయన్ నిల్చిన వేల్పువీటిచెలులో • నాఁదత్పురిన్ నిచ్చల్. ౫౩

మ. నెలరాలన్ విలసిల్లు స్తంభములపై • నెక్కొన్న రాత్రిందివో
జ్జ్వలదాజ్యాంచన ఖండదీపకళికా • స్వద్యోతనుంత ర్బహి
స్థలులన్నిండగ మించె, నచ్చటిమహీ • శ ప్రార్థ నాప్తిం గరసా
తలనిర్యత్ఫణి రాట్ఫణాఘటితర • త్నశ్రేణిలో నాపురిన్. ౫౪

సీ. కురువింద సంచయా • కుంఠిత పటలముల్
కమనీయ రక్తరాం • కవములుగను
పుష్యరాగవ్రజ • స్ఫురితవలీకముల్
భద్రాంక రాంకవ • ప్రస్త్రములుగాఁగ
రుచిరగోమేధిక • రచితసోపానముల్
రమణీయ దీర్ఘతుం • దములుగాఁగ
హరిహయో పలవిశా • లాంచిత కుడ్యముల్
రమ్యబంధురకరీ • రములుగాఁగ

గీ. బద్మరాయుగతో పరి • భాగములును
కళలఁ జెన్నొందు చౌడోలి • కలునుగాఁగ
సౌధములు యూధపస్థితి • చంద మొంది
వెలయుచుండును బురిభూప • తులవహించి. ౫౫

సీ. గమనవేగ సముత్థ • ఘర్ఘరస్వననేమి
చక్రసంధానిత • స్యందనములు
సప్తధా మదభర • స్రావివాసిత చతు
ర్దంత దుర్దాంతదం • తావళములు
రింఖావి శృంఖలా • రింఖణా సంఖ్యాక
కంఖాణ ఘుంఖాను • ఫుంఖములును
నసమాన చరణాయు • ధాంక శస్త్రాస్త్రవి
ద్యారూఢ ధౌరేయ • వీరభటులు

గీ. నడువ కడువేడ్క నడరంగ • నెడనెడలను
తడఁబడక వడివడి జను • పుడమిజనుల
నుడులచే ఘుమఘుమితమై • నడరునిక్క
ధన్యమైనట్టి భద్రాజ • ధాని భువిని. ౫౬

చ. వెలఁదుకలప్పురోపవని • వెన్నెలకుప్పల నొప్పుక్రీడలన్
గలువలజేని రాలయిసు • కన్ గ్రహియించి వధూపదిష్టభూ
తలమున నుంచి తొల్త టిప • దంబునఁ జేరి• తిరంగిచూడ, గఁ
ల్వలచెలిచే తులంగరఁగ • లజ్జవహింతురు రేలనిచ్చలున్. ౫౭

సీ. పలుదెరంగుల మోవు • లలరిదే చెలియేలః
తావులు లేమిచె • తనుదొరకవు
గోరంటలకుఁ గోర్కె • లూరెముద్దులగుమ్మ
వేగుజాము నకాని • విరియ వవియు
సజ్జాతు లమగ,వే • సారెదంబుజముఖీ;
యామని యెఱిఁగినీ • వడుగరాదు,
ప్రొద్దుదిరుగు పల్కె • పొసఁగించు వెలఁదుక
తొలికాంచనంబుల్ను • విలువదాని
గీ. కనుచు సర్మవచోజాత • హావభావ
గర్భితముగాఁగ ముచ్చటల్ • గరపి సరస
బటగి సరసులఁ గరగించి • విరుల వెలల
పలయుచుఁదురు పుష్పలా • వికలు పురిని. ౫౮

వ. మఱియును. ౫౯

సీ. వనిత నీకైదండఁ • గొనవచ్చితి నటన్న
కైదండ నొక్కఁడు • పాదుకొని రెమ్మె
నింపుతోఁ జనగుత్తు • లెట్టివో జూపవే
చనుగుత్తులును మఱుం • గునవసించు
నీయెత్తుఁ గొనటకై • నేవచ్చితి నటన్న
నాయెత్తుఁ గొనెనొక్క • యనువుకాదు
పడతిరో: కురువేర • పరిపిసకోపమా
కరువేరుపరుపసీ • తరముగాదు
గీ. పరిమళముజెందు మరువము • వ్వటికినైన
నమ్మగలనా యనంగని • న్నమ్మగలను
కలియికల సర్మగర్భోక్తు • లలర సంజ
విరుల నమ్మెదు రవ్వీట • వెలబోలఁది ౬౦

సీ. మణ్యాంతరోపాంత పణ్యస్థలాగణ్య
పుణ్యగంధంబులఁ • బొరలి పొరలి
నానావిధోపదం • శానీత పాత్రభృ
త్స్నాన గోష్ఠీశాల • లానియాని
పుంభావనారంభ • శుంభద్వధూఘర్మ
జాలితాంభః కేళిఁ • దేలి తేలి
పరిపక్వశాలికా • పాలికాబాలికా
గానానువృత్తులఁ • గదలి కదలి

గీ. సిరత ఘుమఘుమితామోద • భరకువలయఁ
జలజవలయిత పరిసర • సరిదుదరజ
లఘుజల కణవహన గతి • లక్షణముల
దిరుఁగుఁ దెమ్మెరలక్కూరి • వరమునందు. ౬౧

మ. సరసాలాప గతాగతాంబుఘటయు • క్చంద్రాననామానసాం
తరసుప్తాంగ బోధకంబులగు యం • త్రశ్రేణి భాష్పారుపా
పరుషోద్గీతము లైన గేయములు స్వ • చ్ఛక్ష్మాలి గోపీనిరా
దరపత్త్యానయనక్రమంబునఁ దగున్ • దద్బాహ్య దేశంబులన్. ౬౨

మ. చతురాస్యుల్ రసనాంచలప్రకటభా • షామూర్తుల, భ్యంచిత
శ్రుతుల, త్యూర్జిత సత్యలోకమతిద • త్తుల్, సర్వకాలోల్లస
ద్వ్రతులై పద్మనివాసులై తగినవి • ప్రశ్రేణు, లప్పట్టణ
స్థితులై బ్రహ్మను ధిక్కరింతురు మహా • దేవున్ బరిశంసింపుమన్. ౬౩

సీ. కువలయస్థితికి సం • కుచితభావమొనర్చి
పంకజామోద ప్ర • పంచమొంది
ద్విజరాజ తేజంబు • నిజదీప్తి నడగించి
సద్విహారముదూర • సరణిఁ జెనచి
పగలు రజోవతు • లగు పద్మినులఁగూడి
యొకవేళ సుతలోలి • యోగమొంది
సకలలోకముల్లక • సహ్యాతాపము జూపి
రాజకాంతోల్లస • ద్రక్తిమాని

గీ. మఱియు నిఁకఁ డెంత వాఁడని • కెరలి కలహ
తలపరబలబలాహక • విలయపవన
జవన శరసికరావక్ర • చక్రముఖము
లమర నప్పురి నివసింతు • రవనిపతులు. ౬౮

ఉ. ఆపణ వీథికాప్రథిత • హాటకకూటచిరత్నరత్నముల్
వాపుచు రాసిబోసికొన • వచ్చుబెహారుల కిచ్చితీర్పలై
దోపినవానినెల్ల కడఁ • ద్రోచిన తద్భరమాని, రత్నగ
ర్భాపరమాభిధన్ బుడమి • రంజిలెఁ దద్వణిజాళినెన్నుచున్. ౬౯

గీ. మిన్నొరయుధాన్యరాసుల మించలేక • జలజబాంధవుఁ డీవల్లా, వలజనంగ
దనరె భువినుత్తరాయణ• దక్షిణాయ, నములు, తత్పురిసచ్ఛూద్ర•సమితివలన.

సు. కలువలఱేనిరాల యుప•కారికలన్ నవలాలు కేళికా
కలనమునొంద ముందరిలి • గన్పడుముత్యము లంచుఁ జోఁగం
బులఁ గుఱియింప నాటబలె • ముత్తియముల్ గుఱియించు నంబుదం
బులనెడివార్త లోకములఁ•బుట్టె ముదంబుల నొప్పునప్పురిన్. ౭౦

గీ. కుంకుమాగరుఘనసారసంకుమదమృగమదగ్నహాములనుదయాస్తసమయములను
దొరగుకసవానుచోమించి•తోయదములుబహుళవర్ణత్వ మొందును•పట్టణమున

వ. మఱియు నప్పురంబున రమ్యసౌమ్యప్రతివిధి విధిమంత్రప్రథిత మేధావ్యధాపితో దీర్ణ వర్ణనిర్ణయ వర్ణక్రమాంత స్వాధ్యాయధ్యాన మేదురదురధిగమ నిగమశిరః ప్రముఖ మర్మపార.గాసంఖ్య సంఖ్యావన్ముఖ్య ముఖర ముఖరిత భువనంబులగు విప్రభవనంబులు,నిరంతరాభ్యస్త శస్త్రసమస్త శస్త్రశాస్త్ర విశారదోద్యద్దర్వాఖర్వశౌర్యధర విద్యాప్రదరప్రదర సంధానాద్య వధానాభ్యాసమానసంధానోల్లంఘన తత్పరస సమర్థాభ్యామర్ద తమాతల సర్వవిపక్షనిర్దయమర్దన క్షమాక్షీణ బలవద్భద్ర నిర్నిద్ర తేజోవిజిత దినరాజ లోకంబులగు రాజలోకంబులును,సతతాగారాతి రైపతి ప్రభృతి దిక్పతి విచిత్ర ప్రచురతరమిరత్నరత్న ధనధాన్యాది ప్రచయక్రయావిక్రయనిపుణపరకృత వంచనాసంధానగంధానభిజ్ఞజ్ఞాతనయాయన పోషితార్య జనంబులగు నార్యజనంబులును, సమంచిత వర్ణనిర్ణయాశ్రమ మర్యాదాభిజ్ఞ ప్రజ్ఞాప్రాజ్ఞ ప్రభుసంతత దురంత

శాసనధర్మ నియమనితాంత శాంతాంతఃకరణమాన ఘనులగు శూద్రఘను
లును. సాపకారగవారముఖ్య ప్రఖ్యాతాభినయాభావసూచన చణరణన్మంజు
మంజీర చరణతల నూత్నరత్న క్రేంకారనాదమేదురకంకణ కరవిన్యాసాభిన
యప్రదీప్త స్వైరప్రపంచ విపంచికా వికస్వరవినోదవిశదమానసమానసభవవా
హనాకాంతవిటపుంభావసంభావనారంభసుభగంభావుకలగు రూపజీవికలును
దుర్వారోహానోకహనివహమనోరమ మహోత్సవద్యోతితోద్యాన వననవో
న్మీలనమాలతీమాధవీ విచికిలవకుల ముకుళకులానుకూల నిష్యందమాన మ
రందబిందు సందోహానంద దిందిరా నవరతరుత సంతానతాన హేతుభూతా
భ్యాస ప్రదేశా విరళసంజాతపచేళిమ నారికేళతృణరాజాది సాలరాజరాజిశా
ఖానమాలింగి తైలాడోలాలాలితోత్సుకశుకపిక నికరగాన మాధురీరసాతివే
లాస్వాదన సద్యోమాద్యత్సంగ భృంగా నవాశృంగార రసలాల ససారసర
థాంగ క్రీడత్సారంగ ముఖసుఖారావ. పూరిత దిగంతరాళ వర్ధమానో
త్సాహ సంకల్పనార్థసార్థ త్రికోటితీర్థస్నాన ఫలేప్సితసహిత సముజ్జకో
న్మజ్జనమజ్జనాన వరతానసంప్రదానలోల లోలానువేలవేలాభిముఖోల్ల
సత్కల్లోల జాలకోలాహలనినాదమేదుర నదీతటాకదీర్ఘికా ప్రదేశంబులును,
హీరపంజరసంరంజిత విహారశారికా కీరకలరవాదివివిధ పక్షిరామోదక
రవిమ్వ గ్వాక్షీర్ణోదీర్ణ సువర్ణదుర్వర్ణ సుఖభవ్య ద్రవ్యసవ్యానవ్యవైభవ ని
పుణ విపణిస్థలీ తేతిస్తత స్థాపితాంశుమత్పలానుగళ ద్రసపూరానుసర
శిశిరకరకాంత కుట్టిమతలానుకూల నీలనాళి ప్రణాళీ కాంతి సంక్రాంత ఛా
యాత్రివేణీ సందర్శన కుతూహల బృందారక సుందరీ నేత్రాంతోత్పల తోర
ణంబులగు తోరణంబులును, సంతతనాయక పరిరక్షిత దుర్గమదుర్గప్రాకా
ర గోపురాట్టాలక పృథురథగజవాజి శస్త్రశాలాది రాజద్రాజ మార్గంబులు
గలిగి చెలువొందుచుండు.

కం. ఆపురమున రాజన్నమ । హీపాలాగ్రణియు నిజబలేతరధ్వజినీ
ధూపాయితపాపాయిత । భూపాయుతుండగుచు సిరులఁ బొలుపొందెఁదగన్. ౨౦

సీ. ఒకనాఁ [illegible] మత ప్రోక్త ప్రసంగంబు
లాగమ [illegible] క తర్కాన్ ప్రోదితంబు
[illegible] సూత్రశైలీ ప్రోక్తతానులాపనము
లాక్షమున్సిద్ధ రతిరహ స్యోక్తియుక్తు
లాకపట్టునను నాట కోరుచాతుర్యంబు

లోకమెంకి వ్యాకర • ణకథనంబు
లోకప్రకేవ నుపనిష • త్ప్రకట సల్లాపంబు
లోకయుక్తి సంగీత • సుకరభణితు
గీ. లోకదిక్కున సామర • స్యోత్థసౌఖ్య
కరణ సమ్యగనుత్తర • గ్రంథగోష్ఠు
లలరు గొలువునఁ జెన్నొంది • యఖిలశాస్త్ర
సరసుఁడై పొల్చె రాజన్న • జనవిభుండు.

వ. అతండొక్కనాఁడు హితపురోహితామాత్య సామంతసేనాధిప దండనాయకో
ప ప్రధాన రాయబార సంధివిగ్రహ విచారచార దౌవారిక గణక పౌరాణిక
జ్యోతిషిక, కవీశ్వర, తార్కిక, శాబ్దిక, నయశాస్త్రి మంత్రశాస్త్ర ధర్మశాస్త్ర
భరతశాస్త్ర శకునశాస్త్ర సాముద్రికశాస్త్ర శిల్పశాస్త్రజ్ఞులును, దానాధి
కారి భాండాగారాధికారి గోష్ఠాధికారి వస్త్రాధికారి శస్త్రాధికారులుఁ
గస్తూరి ముఖపరిమళ కరండాధికారులును, ఫణిహార లాంఛన విదే
శగ విదూషకులును, అంగరక్షక రావధానకారులును, దాస దాసీజనాందో
ళికా-ధ్వజాల వట్టచ్ఛత్రచామర వ్యజనతాంబూల పేటికా పాదుకా మాల్లికా
దిధారులును, వాద్య వాదక గాయక నర్తకీ నర్తకమార్దంగిక పాణవిక, వైణ
విక, వైతాళిక చాక్రిక ఘాంటిక శాంభిక శౌక్తిక నైస్త్రింశిక యాష్టిక పా
రశ్వధిక కౌంతిక ప్రాసిక వైజయంతిక వైవధికాదులు చెన్నొంద సింహాసం
హానన సింహాసనాసీనుండయియుండి పేరోలగంబున.

మ. వను,శబ్దార్థపరిష్క్రియా కలితవా•ఙ్నైపుణ్య గణ్యప్రదా
జనితానంద కవిత్వ తత్వరచనా • సౌజన్యజన్యాత్మ మో
దనవర్ధేశిక పాదుకానియమశ చి • త్త ప్రస్ఫురన్మార్గ ఖే
లను నైదిఘంటిక యుక్తి యుక్తమతి బి • ల్వన్బంచి పల్కెం దయన్. ౨౩

సీ. అద్వితీయవ్యాపరో • క్షానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయమాం • భ్రాంచితముగ
ఘనజగజ్జన్మాది • కారణ శ్రీమదు
వ్యాఖ్యానము దెనుంగు • నై దలిర్చ
లలిత పదార్థాద్య • లంకార సహితనీ
శాలివాహము సము • ల్లాసమలర

కృతులు మెచ్చంగ శ్రీ • కృష్ణవిలాసంబు
జనమనోహారముగా • మునురచించి

గీ. మించియున్నట్టి నిన్ను వ • ర్ణించ దరమె
ప్రబల రావాకవంశ సం • భవనవీన
జవన కవన ప్రభవనభా • షావిశేష
లక్ష్మణప్రతిభాధుర్య • లక్ష్మణార్య. ౭౧

గీ. నీవు శబ్దార్థ చిత్రసన్నిహితమైన • కవన మొనరించు ప్రౌఢవు • గాన నొక్క-
ద్వైవిశావ్యక్త సూక్తసం • ధానమహిమ • గలిగిన ప్రబంధము రచింపు • కౌశలమున

వ. అది యెట్టిదనిన.

క. అపమానము, భయ భాషా రసమానము • వృత్తి రీతి • రసశయ్యాస
ల్లసమానము చిచ్చైత్య. • స్వసమానముగా రచింప • జర్పింపదగున్. ౭౨

వ. మఱియు గుణదోష విభావజ్ఞుండగు వివేకియు, ననుప్రాస సమాబద్ధపదబంధురుండగు వాచకుండును ప్రసాద మధురాయత్త వచనుండగు శాబ్దికుండును, అర్థసంగ్రహ చాతుర్య ధురంధరుండగు ఆర్థికుండును, యమకాన్విత విత్వాదక్షుండగు శిల్పకుండును సాలంకార తత్పరుండగు భూషణార్థియు రసతత్పరుండగు మార్దవికుండును, దన్నియంబు లిట్టి రీతులు త్రివిధంబులు వైదర్భిగౌడి పాంచాలి యనందనరు బంధపారుష్య రహితంబు, శబ్దకాఠిన్య వర్జితంబు నాతిదీర్ఘ సమాసంబునగు వైదర్భియు సమాసభూయిష్ఠంబైన యోజస్థితియు, నుద్భటబంధతా విశేషంబుగల కాంతియు, దనర గౌడీరీతి యనందగు వైదర్భి గౌడీరీతి మిశ్రితంబై పాంచాలిరీతి యనందగు శబ్దార్థంబులు మూర్తి వ్యంగ్యవైభవంబు జీవితంబు అలంకారంబులు హారంబులు శ్లేషాదులు గుణంబులు రీతులు స్వభావంబులు కైశిక్యాదివృత్తులు వృత్తులుపదానుగుణ్యాది శాంతిగలశయ్యలుశయ్యాబు. రసాస్వాద ప్రభేదంబులగు పాకంబులు పాకంబులు కావ్యసామగ్రికి నుండవలయు వాచకలక్షక వ్యంజకత్వంబున త్రివిధంబు శబ్దజాతంబు వాచ్యలక్ష్యవ్యంగ్యత్వంబున నర్థజాతంబు త్రివిధంబు తాత్పర్యార్థము వ్యంగ్యార్థగతంబైయుండు అభిధాలక్షణ వ్యంజనాఖ్యల శబ్దవృత్తులు త్రివిధంబులు సంబంధానుపపత్తి మూలంబగుటచేసి గౌణవృత్తి లక్షణాభేదంబైయుండు గావున నొక్క ప్రబంధంబు రచించి శ్రీ

ర్పితం బొనర్పుమని జాంబూనదాంబర తాంబూలాదికంబుల బహూకరించి న సంతుష్టాంతరంగుండనై తద్వాక్యంబులు ప్రమాణీకరించియమ్మహాత్మునికిల వేలుపైన రాజేశ్వరు దర్శింపఁదలఁచి

సీ. సరసనానారత్న • భరశృంగ సంగత
దివ్యసాలాంతర • స్థిరతఁ జెంది
మహిసహస్రస్తంభ • మంటపం బలరారు
నదిమణి ఖచితమై • పొదలుచుండు
వరుస చతుర్దిశా • వధిసహస్రస్తంభ
ములు పంక్తి పంక్తికి • మ్ముగ వెలుఁగ
రమణీయ మణిసహ • స్రస్తంభములు మించి
తిర్యక్ప్రవర్తనో • ద్దీప్తినెనయ

గీ. తాదృశస్తంభ పంక్తులు • తఱుచుగలిఁగి
తదుపరిచ్ఛన్న పటలంబు • తద్విధావి
రత్న మయమై దలిర్చివి • భ్రాజమాన
మైచెలంగిన యమ్మంట • పాంతరమున. ౭౮

కం. నవమణిగణ ఖచితంబగు। భవనాభ్యంతరమునందుఁ • బార్వతితోను
త్సవమున శ్రీరాజేశ్వరుఁ। డవనిజనులఁ బ్రోచుచుండు•నతిముదమలరన్. ౭౯

వ. మఱియు నమ్మహాదేవుండు వికస్వర పుండరీకనిభ కోమలామల శరీరుండును, తరుణారుణకిసలయ విలసిత చరణాధోభాగతలుండును, చారుతరహీర విశదశకల సదృశంబులగు పదపృష్ఠప్రదేశంబులును, ప్రత్యగ్రన ముదగ్రజాగ్రత్శింజాన మంజుమంజీర రంజితంబులగు చరణంబులును, రుచిరశశి మణి గణనీయకాహళ యుగళ సంకాశంబుగులగుజంఘికలును, మహోద్దండ శుండాలశుండాదండ సన్నిభంబగు నూరుయుగళంబుకలధౌతపూత దుకూలాంబర • చిరత్నరత్నరశనాయుక్తంబులగు పులినసదృశనితంబంబులు స్ఫాటికకవాటపాటవంబుగలవక్షస్థలంబును, సకలాభీష్ట ప్రదానేక మణిగణఖచితపటు కటక కేయూరాంగుళీయకాది భూషణ భూషితంబులగు చతుర్భుజంబులు, శారదేందవ బింబసంకాశ సముల్లాస భాసురంబగు వదనంబు. కోటిసూర్య ప్రకాశానంత రత్నకీలిత కిరీటంబుగల మస్తకంబును గలిఁగి సర్వజ్ఞత్వాద్యనంతకల్యాణ గుణపరిపూర్ణుండు• పూర్ణిమాశశాంకకోటి వి రాజమాన విగ్రహుండును, నిత్యనిరవద్య

నిరతిశయ తేజస్సంయుత స్వసమాన రుద్రగణ ప్రమథగణ పరివృతమణిమయ సింహాసనాసీనుండును కుండలి కుండలాలంకృత దేదీప్యమానుండును, నిత్యశుద్ధ బుద్ధముక్త కేవలాఖండ సచ్చిదానంద స్వరూపుండును, రామణీయకతను ప్రభాభాసితానంత కోటిబ్రహ్మాండ పరాణుగవాక్షీభూతానేక రోమవివరదేహుండును, కామసేని రాజన్న భూపాలశేఖర కులదైవతంబగు రాజరాజేశ్వరునిగాంచి బహుప్రణామంబు లాచరించి.

## అనులోమ విలోమ శ్లోకము

శ్లో. రదసారస గోసారస మానానఘకాశికా
కాశికా ఘననామా సరసాగోసర సాదరా. ౧౯

గీ. శరవృషవనాబ్జ పుష్కర • హారిరసాభ
శుచిశరీర ప్రవర్ధిత • సుమశరాంగ
శరవృషవనాబ్జ పుష్కర • హారిరసాభ
శుచిశరీర ప్రవర్ధిత • సుమశరాంగ. ౨౨

వ. అని యివ్విధంబున నమ్మహేశ్వరు వినుతించి దక్షిణాశావిశాల మందిరంబున సీతాసమేతుండైన శ్రీరాముల సేవింపఁదలంచి. ౨౩

సీ. సుమతిరేకాకీన • రసుతేయని వచించు
రాజితరాజకీ • రవ్రజంబు
ధీయుక్తిచే నద్వై • తీయమైచ్ఛత్త్వని
వచియించు శారికా • వారములును
నుచితోక్తి నధపురు • షోహావైనారాయ
ణోకామయతయను • కేకికులము
స్థిరవచస్థితి నద్వి • తీయోస్మి కశ్చిత్త
నుచుఁబల్కు పారావ • తచయములును
గీ. మహితభావల యన్యచా • త్మశరీర
మనుచు సూచించు పికసమూ • హములుగల్గి
వెలయు శుకపుష్పమంటపా • వృతమహీరు
హంబుల వసించిభక్తి • మోదంబుదనర. ౨౪

వ. మఱియు ౨౫

సీ. వెలయు నారాయణ్ణై • వేదగుం సర్వంబ
నుచుఁ బల్కు కిన్నరీ • నిచయములును
హితముమీరంగ, త • మీశ్వరాణాంపర
మం మహేశ్వరమను • షధుపగిణ్ణము
తెలివిమీరంగ,తం , దేవతానాంపర
మంచ దైవతమను • నంచకోలము
నలువొంద, నారాయ • ణం మహాజ్ఞేయంబ
ని పఠించు ఖంజరీ • టపతగములు
గీ. నవ్యయః పురుషఃస్సాక్షీ • యనుకుఘుంగ
తతులు జెన్నొందు దత్పవి • ధ్రదుమముల
నిష్కళంక నిరంజన • నిర్వికల్ప
నిర్గుణబ్రహ్మ మచట రా • ణించుకతన ౮౬

గీ. అదియు నిశ్శ్రేయసామృత • పదియునిత్య
వాస్తవస్థానమదియు ని • ర్వాణపదము
దూరవర్జిత సుఖదుఃఖ • కారణమునఁ
దనరఁ దత్పద మెన్నంగఁ • దరమఁ నగునె. ౮౭

వ. అచ్చోట. ౮౮

గీ. దేదిసద్వేదితా విప్ర•ధీరవార। పఠ్యమాన స్మృతిశ్రుతి • ప్రకటితేతి
హాసఘుమఘుమితారావ•భాసమాన భర్మహర్మ్యంబులో రామభద్రుఁడలరు.

వ. అద్దేవుండు స్వాభిమత స్వసంకల్పానుకూల్య పరమపద స్థానీయ భోక్తృ భోగ్య భోగోపకరణ భోగస్థాన స్వరూపుండును నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైకతానస్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైకస్వరూప స్వాభావికానవధికాతిశయజ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజోవిరాజమాన దివ్యమంగళ విగ్రహా చింత్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయ సౌందర్యౌజ్జ్వల్య సౌగంధ్యసౌశీల్య వాత్సల్య యౌవనాద్యనవద్యానంత కల్యాణగుణపరిపూర్ణుండును నిఖిల జగదుదయ విభవలయలీలాపరబ్రహ్మ పురుషోత్తమ నారాయణాది శబ్దవాచ్యుండును, బ్రహ్మాది దేవర్షిమనుష్యధ్యానారాధనాది గోచరుండును, తత్తద్భేద స్వరూపావస్థితుండును, శ్లో. ఉపాస్యోపాసకత్వేన గురుశిష్యక్రమేణ చ స్వామి భృత్యాది రూపేణ క్రీడతే స్వేచ్ఛయేశ్వరః" అన్న న్యాయంబు

సమ్మోహాత్ముండును రవికరనికరవికసిత ప్రభామండల మండిత పుండరీక దళస్ఫాయదాయతేక్షణుండును, భ్రూలలాటసునాసాపుటసుస్మితాధర సురుచిరమణిమకుర సుకపోల యుగళుండును కంబుగ్రీవుండును, దనుతర మధ్యభాగుండును విశాల వక్షస్థలుండును, సువిభక్త సర్వాంగ నిర్దేశ్యవిశ్వరూప సింహాసంహననుండును, స్నిగ్ధవర్ణుండును, శోణసారస సుకుమార చరణయుగళుండును, నీలనీరదాంతర నటత్క్షణప్రభా కార్త స్వరప్రభాధగద్ధగిత పీతకౌశేయాంబరధరుండును సకలభువనోదయ హేతుభూత పితామహవిహారణంబుగల నాభీకమలకుహరుండును, జ్వలద్విశాలోరస్థలనూత్నరత్న వేదికా సమారోహణ కౌతుకితమతి నంద దిందిరానుందరీసుందర పురందరోపల కలితసోపాన విరాజితంబగు రోమరాజియు, విరాజమానమై జయంతీ వనమాలికా కౌస్తుభ మణిఘృణిఘృణి తోగణీతమణి సమంచిత కాంచన కవాట తుల్యంబగు వక్షస్థలంబును, చతుర్విధపురుషార్థ ప్రదంబులగు చతుర్భుజంబులు వర్ణనీయ సువర్ణ దివ్యరత్న సమ దీర్ఘకర్ణయుగళభాసమానమకర కుండలమండితంబులగు గండ స్థలంబులును, మణిమయ భ్రాజమాన కిరీటంబుగల మస్తకంబును, గలిగి యనాలోచిత శేషాశేషలోక శరణ్యుండును, శంఖచక్ర గదాశార్ఙ్గ నందక శ్రీవత్సపద్మవనమాలాలంకృతుండును, అనవధికాతిశయ సౌందర్యహ్రతవిశ్వ మనోదృష్టివృత్తి లావణ్యామృతపూరపూరితాశేషచరాచర భూతజాతాత్యద్భుతా చింత్యనిత్య యౌవనుండును, పుష్పరసవిసరసరదగణ్యపుణ్య గంధవాసితానంత దిగంతరాళ త్రైలోక్యాక్రమణ ప్రవృత్తగంభీరకరుణాకటాక్ష వీక్షితాపరిమితాశ్రితసమూహుండును సజాతీయ విజాతీయ స్వగతభేదస్వరూపుండును, తత్త్వలక్షణుండును నగు శ్రీమన్నారాయణుని సంపూర్ణాంశంబువహించిన శ్రీసీతారాముల సేవించి తదీయ దివ్యశ్రీపాదతులసీతీర్థ దివ్యమంగళవిగ్రహ శ్రీపాదాంకిత శఠగోప దివ్యనామ సంకీర్తనకల్యాణగుణానుభూణ పానసందర్శన శిరోవహనా కర్ణనధన్యనై శాయన భాగధేయుండనై. ౨౦

కం. శతమఖముఖులను దినమును। గతకల్మషులైరి నిన్ను • గనుగొని శరపాతితవాలీ హితకేలీ। శ్రితపాళీ కల్పధామ • సీతారామా ౨౧

కం. నావంటి యాచకౌఘము। నీవంటి వదాన్యవరుల • నేనమ్మదగున్
సేవాపర భావాచల। జీవాదరణాభిరామ • సీతారామా. ౨౨

కం. క్రతుశతము లుజేసినసి • న్నాశభక్తిని దలపవలయు • ననుదినము నుమా
పతి క్షైరీ హితకారీ। సితవారిజనేత్ర భాను • సీతారామా. ౨౩

వ. అని యివ్విధంబున శ్రీరామచంద్రుని వినుతించి శ్రీమద్రాజన్న భూపాలమౌళి లక్ష్మీవిలాసనివాస మహాలక్ష్మిని సేవింపదలంచి తన్మహారాజాజ్ఞ గాని చని.

చూర్ణిక. శ్రీమత్కలశ జలనిధి విలసదంతరనిరంతర సురవిటపివిటపవలయిత ఖలధిదుపల విపుల విపులాతల ద్వీపనీపోపవనభవన కాంతచింతామణి ఘృణిధగద్ధగితమృగరాజవిరాజమానాసనసమాసీనాం హృద్యానవద్యగద్యపద్యవైశారద్యోద్యద్విద్యాధరీలోచనచకోరానందకరసాంద్రచంద్రాతపవద్దరహాసాభిరామాం నితాంతలతాంతబాణ బాణశాణాయమానాసమాన మణిగణ ప్రభామండల విచండిలకుండల కషణనిశిత సాయకవీక్షాకదంబాం, సౌరవరవర్ణినీవర్ణనీయసువర్ణవర్ణ నిటలతట ఘటితాకలంక కుంకుమ సంకలిత సుఖసంపాదనభ్రము భ్రూల్లసంతీం తరుణతరణికిరణ జాంబునదాంబుజహారి తాళవినీలనీరదాంతర నటత్తటిత్ఫుల్లహల్లకజపాకర్ణికార కోరక ప్రకారతను ప్రభా భాసమానాం, కామాలికాబద్ధ సకలస్నిగ్ధ కేశపాశ విభ్రాజమానాం సమానాధికనూతన కేతకీజాతి చంపకాశోక పున్నాగమల్లీ బంధురబంధూక స్తబకకుచ కుంభగుంభిత గంధసార ఘనసార మృగమదసంకుమద మసృణఘుసృణ ముఖామోదవిరాజమానాం, నవరత్నగీలితాంచిత కాంచనకిరీట తారహార కేయూరచ్ఛన్నవీర ఝుణంఝుణాయమానకంకణాంగుళీయక ఘంటికోడ్డాణ కాంచీదామ శింజాన మంజీరాద్యలంకారవిద్యోతమానాం నిరంతర సుమకదంబక దంబవన సంచరన్ముద్రిణీ ప్రదాపితోర్ధ్వకీలకుండల మండితప్రభాకర పాత్రశోభిత సుధాకర కిరణ పరావృతోపహారప్రియాం, శ్రీకామేశ్వరాంక పర్యంకనివాసినీం, సువాసినీ పూజావిధానావధాన రాచుళ్లగోత్రపాత్ర కామినేని రాజభూమీశ్వరేశ్వర లక్ష్మీవిలాస మాణిక్యసింహాసన స్థిరమహాలక్ష్మీం సదాకలయామి.

వ. అని వినుతించి బ్రహ్మోత్తర ఖండంబునంగల భద్రాయురభ్యుదయంబు దనింగించి శ్రీరాజేశ్వరునకు నర్పితంబు జేయువలయునని యాజ్ఞయొసంగు కామినేని రాజన్న నృపాలు వంశావతారం బభివర్ణించెద. ౧

సీ. సతతఘూళంఘుళ • స్వనదచ్ఛజీవన
కమనీయ నదనదీ • కవ్రజంబు
ఏకచాంబు జోత్స్న • ప్రకర్షనవస్మరం
దాసార కాసార • భాసురంబు

కలకంఠ శుకనీల • కంఠపారావత
నినదముఖరితోప • వనచయంబు
హాటక కటకర • త్నావాస బహుళశృంగ
సంగత కృతకాద్రి • సముదయంబు
గీ. తారకాపథకమణాబ్జ • ధవకుముద్వ
తీరమణకాంత కాంతను • స్థితవిశాల
సాలశిఖరోరుకేయ ప్ర • శస్తవస్తు
పుణ్య నివహంబు దీక్కానోల్ • పురవరంబు. ౧౬

మ. చిదచిన్మూర్తి పరాపరప్రకృతిమ • చ్ఛ్రీసిద్ధరామేశ్వరా
స్పదపద్మాకర దివ్యవారహారహ • స్నానాగతానేక మా
నిదివాశ్ర ప్రభుభక్తి సంస్తుతిమిషో • న్మీలద్ద్విజవ్యస్తివా
క్పదయుఃప్రాభవమై తలిర్చునదిమక్ • సర్వంసహామండలిన్. ౧౭

కం వర్ణితమణిగణకనకో। దీర్ణరుచిరుచిరవిపణ్య • ధీనానుపమా
భ్యర్ణప్రదేశగచతు। ర్వర్ణంబులవారుదనర • వహిం కెక్కుఁదగున్. ౧౮

మ. బలభిన్నీల విశాలకుట్టిమపరీ • వాహప్రభాహార్నిశా
జ్వలదభ్రంకష శృంగసంగతములై • సౌధంబులోనన్ మహా
చలసంకాశ గజేంద్రబృందములతో • నయ్యాటలాడన్ రసా
తల సర్వస్మద ధారవారణఘటల్ • దారోఁగన్న చందంబునన్.

సీ. స్ఫాటికస్ఫుటకోటి • హాటకకుట్టిమా
ట్టాలకంబులజాల • మతిశయిల్ల
సాంద్రచంద్రోపల • స్థాపనాంచచ్చంద్ర
శాలాపరంపరల్ • సందడింప
వర సుధాలేపన • స్ఫురదంబు దాయన
స్పృగ్గోపురములు రం • జిల్లుచుండ
ప్రతిమార్గనిర్మిత • ప్రచురకాంత్యాథర
రాజితగేహమ్ముల్ • తేజరిల్లనయ
గీ. లలితజీవన దంతివి • లాసవాస
కేళికేలిత గేహముల్ • వన్నెవాప

మందరాద్రిని గైలాన • మహితగిరిని
గేలిఁ గొనఁజాలు నప్పటి మేలిమలర. ౧౦౦

కం. అపురవరము నరంశో। ద్దీపకుఁడై కామినేఁడు • దృఢతరబలనం
భావిత పరభూపాలకుఁ • డై బాలిచెన సమస్తలోక • నుతినిసేయఁగ. ౧౦౧

గీ. అతఁడు తద్బిక్కనోలు పురాధిరాజ। పూజ్యసామ్రాజ్యలక్ష్మిచేఁ బోలిచియుండ
గుతుపసాహదియవనర్యాట్కుతుకదత్త। ఘనతరాందోళికా దివ్యఖ్యాతిఁగాంచి.

సీ. ప్రాగ్భవోత్కటమద • ప్రవణ గంభీరవే
దులు పాయసంబులై • వెలయుచుండ
పటుపరోదగూర్జర • బాహ్లీక కాంభోజ
తురగంబులు పదలై • బరగుచుండ
ప్రత్యగ్భవోదీర్ణ • వర్ణసౌవర్ణము
ద్రికలుపహారనం • స్థితివెలుంగఁ
దక్షిణ దిగ్భవో • దాత్త ముక్తాఫల
వ్యూహముల్ కాన్కలై యొప్పుచుండ
గీ. సరస కర్ణాటరాజ్యప్ర • శస్తుఁడగుచు
భాగ్యనగరాది రాజ్యసం • భావ్యలక్ష్మి
నొందఁ దలపోసి శ్రీబిక్క • నోలుపురవ
రంబు నిర్మించె శ్రీకామి • రడ్డినృపతి ౧౦౩

సీ. దివ్యత్క వేరజా • తీరంబున వసించు
పాలెగాండ్రను బహు • ల్పడన డంచి
ఘన సువర్ణముఖి యొ • డ్డున వసించుచు నందు
పరి పంథులను బట్టి • భంగ పెట్టి
నవ్యక్షి నాకభృ • జ్జా కూలమున నుండు
ప్రత్యర్థులను ఒయ్యల్పడనొనర్చి
రూఢ కృష్ణా నదీ • రోధంబు నందుండు
ప్రతి వాదులను గట్టి • పాలు జేసి
గీ. తనరి నైజ ప్రతాపదీ • ప్త ప్రభావి
ఘటిత దుర్వార గర్వాంధ • కార పటల

రాయ వేశ్యా భుజంగాభి • రామ బిరుద
సహితుఁడై కామినేడు ప్ర • శస్తుఁడయ్యె. ౧౦౪

క. ఆకామినేడు నిజనా • మాంకము గాఁగ కులము • సలరించినఁ దా
శ్రీకామి నేనివంశం • బాకల్పస్థాయి గాఁగ • నవనిఁ బరఁగెన్. ౧౦౫

వ. తదీయ పుత్రపౌత్ర సంతాన పరంపరానుక్రమంబున. ౧౦౬

గీ. అవనిఁ దత్కామినేనన్వ • యంబునకల
గోత్రపర్వతమైన రా • గోత్రమునను
దనరుచుండంగ దత్కుల • మున నుకాచి
రెడ్డిభూపతి జనియించెఁ • బ్రథితుఁడగుచు.

క. ఆకాచిరెడ్డికిని సు । శ్లోకుఁడు రెడ్డియను నాత్మ • జుండుదయించెన్
భూకాంతా సంఘటిత ము । హాకౌతుక హస్తకమలుఁడై జనమెన్నన్. ౧౦౭

సీ. ఆరెడ్డి నృపతికి • నార్యారత్నమైన దే
చాంబికయందు వి • ఖ్యాతులైన
నదము కాచారెడ్డి • నగన మల్లారెడ్డి
• భూరి బలోపేత • బొమ్మిరెడ్డి
నాదగు సుతుల నా • నందంబు నన్గాంచె
నందుఁ గాచారెడ్డి • యను నృపుఁడు
కులకాంతయైమూర్తి • కలితయా మాచాంబ
యందు నెల్లారెడ్డి • యనెడుపుత్రుఁ

గీ. గనియె నా యెల్ల రెడ్డీంద్రుఁ • డనుపమాన
రూపలావణ్య విక్రమా • రూఢిఁ జెంది
భవ్య గుణాన్వితుఁ మల్లమాం • బను వరించి
యిష్టవర్తనమున రాజ్య • మేలుచుండె. ౧౦౮

కం. అతిముదమున నెల్లనమహీ । పతిమల్లాంబికనుగూడి • బలవత్కన్న
క్షితినాథుఁ గాచవిభుది । క్పతిరెడ్డియు ననుతనూజ • నర్యులఁ గనియెన్. ౧౦౯

వ. అందు. ౧౧౦

కం. గాచారెడ్డినృపతిస। త్యాచారనిదానదాన • హాటదళ్వసుతుం
డై చతురస్రాదయులో కా। సేచనకతనూకళా వి• శేషుండగుచున్. ౧౧౧

గీ. సకల సాధ్వీమతల్లియై•సంభ్రమించి। యెప్పుడొప్పులకుప్పయై యొప్పవచ్చు
తిప్పమాంబను పెండ్లాడి• ధీరుడైన। సుతులగాంచెను నల్వుర • సత్కులజులు.

కం. ధీరుడు జంగమరెడ్డియు। దారుండగు గాదిరెడ్డి • ధన్యుండగు నె
ల్లారెడ్డి శాస్త్రఖనిమల్లారెడ్డి యనంగదగిరి•లకాజను లెన్నన్, ౧౧౩

వ. అందు.

కం. శ్రీకరజంగమ నరపతి। కాకామారెడ్డి కనుజు•డై సంతతసు
శ్లోకుండెల్లారెడ్డిమ। హీకాంతుడు వృద్ధినొందె•హితవర్తనుడై.

సీ. అపరవర్ణులె కాని • అపరవర్ణులు కారు
సరివాగ్రహప్రాప్తి • సంభృతులను
నలతమానుదు లెకా • నలతమానుదు లెగా
రెనళుచితాకాంతి • ఘనరుచులను
గోత్రాధిపులె కాని • గోత్రాధిపులు గారు
తరము ధర్మఖ్యాతి • ధైర్యసులను
హరినామకులె గాని • హరినామకులు గారు
బలసత్య పాలన • ప్రాభవముల

గీ. పరహరి హరాగ్ని చంద్రభా • స్కరవృషగురు
శైలమారుతసమవర్తి • చక్రముఖుల
సాటిగొనుచు నెల్లర • సావిభుండు
ధరణి బాలించె ధార్మిక • త్వంబు మెరయ. ౧౧౪

సీ. మొదలు దాతృత్వంబు • తుదియాచకత్వంబు
నిచ్చతో నుండు వా • డెంతవేల్పు

ప్రార్థించి యొకవేళ • యప్పులిచ్చుటకాని
యెప్పుడీ కున్నవాఁ • డెంతవాఁడు
ఆహవమున యాచకద్వ • యంబిచ్చుచువ్వల
నీవిలేదన్నవాఁ • డెంతదాత
యడగినంతనె యర్థ • మిసక వెన్నాళ్ళకము
నొప్పించువాఁడేబ • హుప్రదుండు

గీ. ఇచ్చి మరలంగ గొనక తా • నిచ్చవచ్చి
నట్టులొసగుచు రేబగ • లనక బంచి
పెట్టుచును ముఖ్య వస్తువు • పేర్మినొసఁగు
నెల్లరెడ్డి మహీపతి • నెన్నదరమె. ౧౧౬

సీ. సప్తసంతానప్ర • శస్తకామారెడ్డి
దేశాయి దివ్యాజ్ఞ • దేజరిల్ల
సమ్మతోమహుఁడు ని • త్యమాచరించిన
ధర్మంబు నభివృద్ధి • దనరఁజేసి
రాజకార్యాకార్య • రచనలాలోచించి
యుక్తాయుక్తములుగా • నొప్పఁజేసి
బహుళ రత్నాకర • ప్రస్ఫీతదీర్ఘికా
• కుల్యాటికిఁ గదాను • కూల్యమొంది

గీ. యమ్మహీపతి కీర్తుఁడై • యనుదినంబు
సన్నలందును సమ్ముఖల • యందుఁజేసు
గలిగి విలసిల్లె నెల్లభూ • కాంతుఁ డవని
భారమాత్మీయ భుజమునఁ • బ్రబలుచుండ. ౧౧౭

౪౦. శ్రీరమణీరమణీయమణీ రుచిరాదగ్నమనఁగ నిపుణశ్రీమొ
ల్లారెడ్డిపేట దనరె మ। హీరామాస్యాబ్జ తిలకమహితమైసతమై. ౧౧౮

వ: అది యెట్టిదనిన. ౧౧౯

సీ. ధ్వజపటాగ్రజనిభ • స్వర్ధుతదోత్ధునీ
సాంద్ర శీకరపూత • సౌధతతులు

సౌవరద్వీపసాధ్వ • స్వపదసింహాత
లాటాంశు కోదీర్ణ • హర్మ్యములును
పురపుర శ్రీనమా • హ్వానార్థ కంపిత
చేలాలపట్టి కా • ట్టాలకములు ,
సురపూరహాస్మృతి , నిరసనోత్పతదుద్ధి
తోపరి భాగ భా • గ్గోపురములు

గీ. స్వాత్త్ర నాట్యక్రమ విలోక • నాగతత్రి
దివయు వతి దేహ జస్వేద • నివహ సారణ
వీజిత పటత్పతాకాగ్ర • వేశగృహము
లలరు చుండంగ దత్పురం • బవని వెలసె. ౧౨౦

ఉ గాటపుకోటకొమ్మలు చొ • క్కాటపుహాటక కూటకోటులుౝ
దాటిలు గోపురంబులు న • పారము లై . తగు స్వస్తికంబులుౝ
దీటగు చంద్రశాలలు నుదీర్ణ విభూత్వము దెల్పనొప్పున
ప్పాటికిసాటియౌ స్పృపుల వీథులు వేల్పుల వీడు లెంచినౝ. ౧౨౧

గీ. పసనకురుళవింద సుందర • మరకతాది కములుగలజాళువాకోటగాననమ్యో
గగనలక్ష్మీ కర ధగద్ధ • గాయమాన కంకణచ్ఛటరవళించు • పొంకమలర. ౧౨౨

చ సురుచిరనూత్నరత్నమణుల • తోరణగండ్లధరించి కాంచన
స్ఫురదురు సౌధయూథములు • పూజిత రాజిత శాలి శాలల
ప్పురిమెరసెౝ సురావహన • శోభన తాభి నివేశ మేరు మం
దరవములు సర్వ సంపదల • దత్తదు పాధులం జెంపనోయనౝ. ౧౨౩

సీ దక్షిణాయన మరు • త్సహితులు భువసర
త్పాదతులు విపతు • నవ్వహాననులు
వితత రంభామోద • గతులుప కంఠస
త్క్షేత్రము లాప్రభా • సంభృతులును
స్ఫటిక శతాంసం • ఘటన శయ్యాస్వతుల్
కిన్నరీ తానసం • గీతవతులు
సురసాలదివ్య భూ • సరణి సుధాదాను
లిభ్రపాహాన శృంగు ? లచల వృత్తు

గీ. లద్భుత రస ప్రకటిత కాం • తాభిరామ
భామ లోకాభి రాములై • పొలచిన ఘన
భూచరత్న సునోవృద్ధి • బూని కేళి
పర్వతేంద్రములు వెలసి • రప్పట్టణమున. ౧౨౪

శా. రంగా భంగతరంగ సంగత విహం • గ వ్యూహ భీకృన్మహో
త్తుంగ ప్రాంగణ గోపురో పసదా • స్తోక ప్రభాభీల మా
తంగాది వ్యవహార సారబల సం • ధాన ధ్వజోపేతమై
శృంగారా స్పదమయ్యె నెల్ల నృపతి • శ్రీమత్పురంబెప్పుడున్. ౧౨౫

మ. సరసీజాప్తుఁడు లోకనాకమ్ములు తద్దై•శ్వర్యాది దృఢార్థత
త్పురుఁడై నిల్చిన సాలజాల శిఖర•స్థప్రోజ్జ్వల న్నూత్న ర
త్న రుచి వ్యూహము వక్ర చక్రగతి నొం•దన్నాట నుండివ్వ సుం
ధరలోనం బరివేష భూషిత ఘన•స్థానుండ సంగన్బడెన్. ౧౨౬

చ. అహరహ మప్పురీవస•నుంచిత కాంచన కూటకోటి సం
గ్రహణ విలాస వాసముల•ఖండ విభా విభవంబు దోపనా
గ్రహముల ధిక్కరించిన చి•రంతన కాంతమణీ గణాంతరా
వహగతిఁ జూచు హాటకి ది•వస్స్పృహ జేయుచు నుండు నెల్లెడన్. ౧౨౭

క. సన్మహిత స్వర్ణమణీ•సన్మండగు నెల్ల నృపతి•స్వనమాఖ్యఁ దగన్
పద్మాకర పద్మాకర•పద్మాకరముల నొనర్చెఁ•బ్రజలు నుతింపన్. ౧౨౮

సీ. ఒక విప్రు చుళుకంబు•నకు లోనుగాకున్న
లవణ సముద్రంబు • నవతి యగును
కేవల ఖండవి•కృతిఁ జెందకుండెనా
యైక్షవాంబుధి సమం•బగు దలంపఁ
బానంబుచేఁ దంద్ర•బట్టింపకుండెనా
మదిరా సరిత్పతి•మాఁ దియగును
ముక్కు వాసన లేక•చొక్కమై యుండెనా
యాజ్యాంబుధి జత•న్నగు వచింపఁ

గీ. వరవబడకున్న దధివార్ధి తరమునగును
ఖరణమించని క్షీరాబ్ధి పాటియగును
దేల లేకున్న శుద్ధాబ్ధి పోలికగును
ఘనత నెల్ల విభుని తటాకంబు తోడ. ౧౨౯

సీ. మౌని సంచిత కమండలూజ్జ్వలజలో
త్పన్న యా నలద్వీపవతిని విడచి
తాపస భుక్త సంత్యక్తమై విలసిల్లి
చరియించినట్టి నిర్ఝరణి వదలి
హరిభేద్య మానమై యవనీతలంబున
మొలగుచున్నట్టి శైవలిని గడచి
ముని శప్తమై గుప్తమూలంబునం దిరంగి
పొలుదగి యున్నట్టి యన్నదినిం దాటి

గీ. కలిత రాచుళ్ళ గోత్రత్రకాఖ్యని
వంశ్యుఁడెల్లన నృపమౌళి వరతటాక
గర్భమున శివనాథ ముఖ్య స్వమూర్తు
లగుచు హరిహరులై యుండు రనుదినంబు. ౧౩౦

సీ. కలధౌతనిలయ సంగ్రహణుండ సంగను
హిత సర్వ మంగళాన్వితుఁడనంగ
బుధ చమూపతి సద్విభూతి యుక్తుండన
సంతత ద్విజరాజసహితుఁడనఁగ
ననయంబు రాజ రాజాంచ త్సభా నీకుఁ
డనఁగ సత్య శ్రీనిదనరె ననఁగ
నహీశ దశావతాపహరణుండనగను
ఘనత దుర్గాధ్యక్షుఁడనఁగ వర్ణ

గీ. నీయుఁడై మించె శ్రీ కామినేని కులజుఁ
డైన శ్రీ యెల్లరెడ్డి దేశాయి మౌళి
యతి దయాసాంద్రుఁ డాత్మాన్వయాబ్ధి చంద్రుఁ
డలరు శ్రీ సాంబమూర్తి రాయనఁగ ధరణి. ౧౩౧

సీ. అద్భుత స్వాప్నతే • యమువ్యయంబొనరించి
బహు తటాకంబులే • ప్రభుఁడొనర్చె
నిమ్నోన్నత క్షోణి • నిమ్నగా తుల్యకా
కుల్యలనే ధార్మి • కుండు ద్రవ్వె
నిర్జన స్థలులపై ని • ఖిల ప్రజోల్లస
ద్గ్రామముల్ పేటలే • ఘనుఁడు గట్టె
దుర్గమార్గంబుల • దోఁగంబులైనట్టి
యూరామములనే మ • హాత్ముఁడుంచె

గీ. నప్పితామహు ధర్మంబు • ననుసరించి
యంతకన్నను మిక్కుటం • బై దలిర్చు
దాని పరిపాలనముఁ జేసి • వసుధనేలె
యెల్ల భూపాలు పోత భూ • శ్రీశ్వరుండు. ౧౩౯

క. శ్రీ పత్యంశ భవుండగు । నా పోతారెడ్డి మాచ • మాంబికయందున్
దీపిత పుత్రులఁ గనియె మ । హీ పాలన శీలన ప్ర • హేతులుగాఁగన్. ౧౪౦

మ. లలితాలంకరణాంచితా వయవుఁడై • ల్లారెడ్డి జోగావనీ
తిలకున్ వారలు దాన ధర్మముల ధా • త్రీ నిర్జర శ్రేణులన్
వెలయంజేయుచు రాజ కార్య ఘటనా • విఖ్యాత కౌతూహలం
బలరన్ వర్ధిలి రాహవ ప్రకటితా • హంభావ పుంభావులై. ౧౪౧

వ. అందు. ౧౪౨

శా. అంకారంభ విజృంభమాణ విజయో • ద్యద్భేరికా భాంక్రియా
లంకర్మీణ మహారవ శ్రవణ వే • ళా నిశ్చలాకాటవీ
కింకుర్వాణ వచోవిచార పరులై • గ్గించన్ దలిర్చన్ రణా
లంకారాసి భుజార్గళుండగుచు నె • ల్లారెడ్డి భూమండలిన్. ౧౪౩

సీ. ఒక వేళఁ బరిహాస • మొనరించె నేనియు
నుచితోక్తులే కాని • యొండు లేదు

శయనించి యుండియు • స్వప్నంబు నందైన
నన్యకాంతాగోష్ఠి • నరయ లేదు
సాహసోదగ్రుండై • శాత్రవునందైన
దుర్గుణారోపంబు • దొడరలేదు
మనసున నుడులనే • మరపాటు నైనను
దగనసత్యపు దల్పు • దలచ లేదు

గీ. కాన నీ రెడ్డి నృపతియా • కల్పమవధి
గను ప్రవర్తించ వలెనని • జనులు బొగడ
ప్రబలి వర్ధిల్లెనెల్ల భూ • పాల మౌళి
తన సముజ్జ్వలతలు కల్ప • తరువు బ్రాక. ౧౪౪

క. ఆ యెల్లనృపతికతి భా • గ్యాయత జగ్గమ్మ భార్య • యై దనరెన్ బ
ద్మాయతన ముఖకమల శో • భాయుతయై బుడమి జనులు • ప్రస్తుతి సేయన్. ౧౪౫

గీ. అమ్మహీపతి కనుజుండై • యవని వెలసె
జోగి రెడ్డీంద్రుం డత్యంత • సుగుణగణ్యుం
డ ప్రతీప ప్రతాప ప్ర • తాభిరాముం
డాశ్రిత కదంబ వార్షికా • బ్దాభుడగుచు. ౧౪౬

మ. గరిమన్ భూపరిపాలకుండయిన జో • గారెడ్డి తేజో విభా
స్వరతం డొప్పన్ మును చక్రవాళగిరి పా • ర్శ్వావృత్త ప్రదేశ స్థమ
స్తర జీవోల్లుఠ దంధకార చయభి • ద్దావద్విపత్కామినీ
వర ధమ్మిల్ల తమోనివారక కర • వ్రాతంబు సంధిల్లగాన్. ౧౪౭

చ. నిరతము భూజనమ్ములకు • నెమ్మది రంజిలం జేయుచున్ ధరా
సురలను బ్రోచు చోదనకు • జోగనృపాలుం డొనర్చు దానవి
స్ఫురణను జూచి కల్పతరు • పుంజము దుర్యశమున్ వహించె నౌ
కర మరయంగ మట్పద పిక • ప్రకరాదిక కైతవంబునన్. ౧౪౮

శా. కారుణ్యాకర మూర్తియై వెలయు జో • గారెడ్డి సత్కీర్తి హం
సీ రత్నంబు సమస్త విశ్వములని • క్షేపించు నండంబుల

త్వారూఢంబుజ సంభవాండ తతి • మధ్యస్థంబులై యుండ త
త్పారంపర్యము నొంది పిక్కటిలుచో • బంహిష్ఠ వృత్తిన్ దగన్. ౧౪౯

సీ. అంగవంగ కళింగ • బంగాళ వనితలు
లలిమించు వీచోపు • లను వహింప
లాట కర్ణాట ప • రాట భోటాంగనల్
విమలంబులగు ముకు • రములు బూన
మాళవ మళయాళ • చోళ నేపాళ బిం
బాధరల్ వేటు రు•మాళ్ళు వీవ
గొంకణ టెంకణ • కుకురు కాశిక యూశ
రమణులు వీటీ భ • రములు దాల్ప

గీ. సర్వ సర్వంసహాచక్ర • చక్రవర్తి
లక్షణోపేతుఁడై మహా • లక్ష్మీదనర
కామినేని కులాం • భోధి సోముఁడైన
జోగ భూపాలుఁడలరె య • శోధనుఁడయి. ౧౫౦

క. ఆ జోగారెడ్డి మహీ • రాజుకు దేవేరి యగుచు • రంజిలె సుగుణ
భ్రాజిత చొక్కవ్వ జయ-శ్రీ జగతీ సదృశయగుచు•జిర కీర్తి దగన్. ౧౫౧

గీ. సుదతి పుట్టిన యింటికి • జొచ్చినింటి । కలరు వన్నియఁ దెచ్చిన•తలిరుఁబోడి
చారుతరకిసలయపాణి•కీరవాణి।యైన చొక్కవ్వ నెన్నంగ•వలవియగునే ౧౫౨

క శమదమముల నెన్నఁగ నా । యమనమతోమగుచలీశ్వ • రార్పితమతియై
రమనను దినంబుపూజల।నమరఁగ జేయుచును చొక్క•మాంబదలిర్చెన్. ౧౫౩

గీ. అట్టి జోగనృపతి చొక్క • మాంబయందు
భూరి బలవంతుఁడైనట్టి • పోతిరెడ్డి
సుందరాకారుఁడై యుండు • జోగిరెడ్డి
యనఁగఁదగు బుత్రులను గాంచె • ననయులుగను. ౧౫౪

క. ఆ జోగిరెడ్డి మహా • భాగుండతి నీతిపరుఁడు • ప్రకటతరసమా
భ్యాగరిమనొనరి రాజ్య । శ్రీ గురు బుద్ధి ప్రసిద్ధిఁ • జెందుచునుండెన్. ౧౫౫

గీ. ఆమ్మహీపతి భార్యయై • యలరె లింగ
మాంబ, విల సద్గుణ గణావ • లంబ యగుచు
జోగిరెడ్డి మహీశుఁడర్క • సూన శరుని
కల రతీదేవి యనఁదగి • యలరె భువిని. ౧౫౬

క. ఆ జోగిరెడ్డి కగ్రజుఁడై జనములు బొగడ నెగడె • నాత్మీయయశ
స్తేజశ్చంద్ర దివాకరుఁ । డై జగతీ భారమూని • హర్షిత మతియై. ౧౫౭

శా. లలిన్ సవ్వులకైన బొంకడు బుధా • ళింబూజనొందించు, సు
శ్రీలన్ దా ధనమున్ నగున్ శివునిపైఁ • జిత్తంబు గీలించి ము
న్వాలాయంబు పసిండి పువ్వులను శే • వాయుక్తి నర్పించు ధీ
శీలుండై తగు పోతిరెడ్డి నృపతి • శ్రీ నాథుఁడత్యున్నతిన్. ౧౫౮

సీ. సతత విద్వత్కల్పి • శ్వర పారిజాతంబు
సార స్థైర్యంబున • మేరు నగము
ప్రతి దినాభ్యుదయాప్త • బంధు రక్షణ శాలి
పుంజీభవద్యశో • రంజితుండు
గణుతికెక్కుచు ధర్మ • గుణగణో జ్జ్వలుఁడెంత
పనికైన నాడి త • ప్పని ఘనుండు
సుర్వీశ్వర సమర్చి • తో పధా సంభృతి
యర్థి సందోహ క • ల్పాగమంబు

గీ. దాన కర్ణుండు రణ సమిం • ధాన పార్థుఁ
డాశ్రితావన శీలుఁడం • చఖిల జనులు
సన్నుతించంగ దగె సద్వి • చార పరుఁడు
పోతిరెడ్డి మహీపాల • పుంగవుండు. ౧౫౯

మ. నవ ఖండంబుల మోచుహారలు మహా • నాగంబులున్ ఘోణియున్
జవ నత్కూర్మము సర్వ మద్రులని హా • నం జెన్ని పోతావనీ
ధవదోర్వ్రజము యంపు పేశమున మో • దంబందు నా భారుణీ
యువతీరత్నము గాసిచో నదియ భో • గోద్యుక్తయై యుండునే ౧౬౦

క. ఆ పోతారెడ్డి మహీ • భూపాలుని భార్య యగుచుఁ • బొగడొందెఁ దయ
శ్రీపతిపూజా పరమ్మాద • యాపాదిత భక్తి సర్వ•మాంబ దలిర్చెన్. ౧౬౧

గీ. అర్థి జనములఁ గనుగొన్న • నాదరించి
పూజలొనరించి యన్న మిం • పుగ విధించి
యన్నపూర్ణ భవాని యో • యనఁగ మించి
సర్వమాంబిక దనరెయా • జగతిలోన. ౧౬౨

సీ. సమ్మదమొనరంగఁ • దమ్మిగద్దియనుంచు
కొమ్మఁ జిత్తమ్మునఁ • గుదురు కొలిపి
బలువైన చలువగు • బ్బలి రాచ కూతురు
నెలఁమి మానసమున • నిరవు కొలిపి
పటు బుద్ధి మగని పు • క్కిట నుండు పాలతుక
డెందంబులో మంచు • బొందు పరచి
సురరాజ రాణి చం • దురు కీరవాణి ము
న్నంత రంగంబున • నలరఁ దలఁచి

గీ. వారివారిని గురుకరి • వీర కర్ణి
కార చంపక నవమల్లి • కాజపాప్ర
కుంద కాంచనముల పూజ • లొందఁ జేసి
యింపు దళుకొత్తుచుండ రా • జిల్లుచుండె. ౧౬౩

శా. ధీయుక్తిన్ ధరణీసురాగ్రణుల భ • క్తిన్ బూజ్యులం జేయుచున్
శ్రీయోవంతుని పోతభూమి పతిన • ద్ధిం బ్రేమ వాటింపుచున్
న్యాయప్రూప విలాస వైఖరులచే • సర్వాంబ రంజిల్లె శ్రీ
న్యాయం బేర్పడ సజ్జనంబులకు నా • సందంబు సంధిల్లగన్. ౧౬౪

క. శ్రీ రాజేశ్వర కరుణా । సారూఢ కటాక్షలబ్ధ • సాగత రాజ్య
శ్రీ రక్షణ దక్షుఁడ పో । తారెడ్డి మహీపతికి ము • దంబలరారన్. ౧౬౫

గీ. మానవపతియైన యా • సర్వమాంబ గర్భ
మునను జన్మించి ప్రతి • దినాభ్యుదయ మొందె

సర్వ సర్వంసహా చక్ర • శక్రుఁడనఁగ
వెలసె రాజన్న నృపమౌళి • విశ్వమెన్న. ౧౩౬

సీ. తన సమాఖ్యామధీ • తతినిత్య దానాంబు
ధారలచే వృద్ధి • దనరుచుండఁ
దన సుగుణ సుమంబు • లనుపమ ధర్మ ధీ
కల్పలతాగ్రణిఁ • గలసి వెలయ
తన విశ్రుత శ్రుతో • దన్యతీశ్వరునకు
శమ సమాదులు తరం • గములు గాఁగఁ
దన కరుణామృతం • బునకు నేత్రాంతముల్
కలశయుగంబులై • కానుపింప

గీ. ధరణి వర్ధిల్లెనని సుధీ • తతులు పొగడఁ
గుశల చారిత్రు రాచుల్ల • గోత్ర పాత్రుఁ
డమిత జయసాంద్రు కామి • నేన్యన్వయేంద్రుఁ
డైన రాజన్న చౌదరి • యవని నేలె. ౧౩౭

సీ. విధులై మహాయజ్ఞ • విధులై శివార్చన
విధులైఁ దగిన వేద • వేత్త లలర
పదవులై సద్వనీ • పదవులై ఘనదవా
పదవులై ప్రతిపక్షు • లోనగుచుండ
కృతులై పరాసిరా • కృతులై సదుక్తిశా
కృతులై విచక్షణుల్ • నుతులొనర్ప
మాన్యులై రాజ న • న్మాన్యులై విజితారి
మాన్యులై సైనికుల్ • పూని కొలువ

గీ. ప్రకట పాషండ బౌద్ధ చా • ర్వాక జైన
విరస మతములు తన మహా • సరస వచన
రచనల హసింపుచును రాజ • రాజ సదృశుఁ
డై తగెను కామినేని రా • జన్న నృపతి ౧౩౮

శివభక్తగణముతోఁ • జెలిమి పాటింపుచు
శివకథాశ్రవణంబు • చేఁదలిర్చు
నవ్య వివాహోప • నయనార్థ మర్థించు
భూదేవతలఁ దృప్తి • బొందఁజేయు
గ్రతుని మిత్తాగత • శత సంఖ్య విప్రోత్త
ములు గోరు విత్తమి • మ్ముగనొసంగు

గీ. ఘన తటాకోప వనదీర్ఘి • కలను కూప
ములను నిర్మించి కారుణ్య • కలితుఁడగుచు
నిలను బాలించె శ్రీ కామి • నేని కులజుఁ
డైన రాజన్న చౌదరి • యనుదినంబు. ౧౯

మ. ప్రయుత శ్రీకర కామినేని కులుఁడౌ • రాజన్న భూమీశ్వరుం
డయితో దీర్ఘ సువర్ణ ముద్రికల ది • వ్యాచార్య నాదంబులన్
వ్యయ భాగంబొసరింపుచుండగను ని•త్యాంబర్చిత ప్రార్చిత
ప్రియ మేధా,యను వైదికోక్తి దనరున్ • రేయున్ బవల్ దత్సభన్. ౨౦

సీ. జవముచే భీకరా • హవముచే రాజ్యాను
భవముచే రామ ప్రభావ మొప్ప
భక్తిచేఁ దేజ ప్ర•యుక్తిచే కాంతి ప్ర
సక్తిచే ఖగరాజ•సరణు లెన్నఁ
బ్రాప్తిచే సకల వి•ద్యాప్తిచేఁ బావన
వ్యాప్తిచే శుచి వృత్తి•ననుసరించుఁ
గీర్తిచే సౌందర్య•మూర్తిచే జ్ఞాన వి
స్ఫూర్తిచేఁ గృష్ణ సం•శుద్ధులరయు

గీ. శరభ భృగురామ రాఘవ•గరుడసూర్య
చంద్ర శివ కవివహ్ని వి•జయగదాగ్ర
జన్మ సత్యవతీ సుత•సరణు లెసఁగ
వరస రాజన్న దేశాయి•చంద్రుఁడలరే. ౨౧

సీ. కింపచాన సదాఖిం•తింపచానేలు నిత్య
దివ్యాన్న భోక్తలై • తేజరిల్ల

గచ్ఛరోద్వేల్ల త్పటచ్ఛ•రుల్ సంతతో
దంచదంశుక ధారు•లై దలిర్చ
బ్రజ్ఞాన మార్గాన•భిజ్ఞాన భూసురుల్
వేదశాస్త్రజ్ఞులై • వెలయుచుండ
హల్యానుగత కర్మ•కల్యాపరజాలు స
ద్గ్రామాధికారులై•రంజిలంగ

గీ॥ చేసి వారల కిష్టార్థ•సిద్ధులొసఁగి
పుడమి రంజిల్లె భూభుజుల్•బొగడుచుండ
రమ్యతరమూర్తి చంద్రికా•సౌమ్య కీర్తి
నిపుణరాజన్న దేశాయి•నృపవరుండు. ౧౭౨

సీ. తెలిదమ్మి గద్దియ•చెలువొందు పైదలి
దలిరమ్మి దొరతండ్రి•గెలువు కొమ్మ
కొమ్మచే నిలకింపు•గూర్చునాతని మేను
మేను దాల్పుల నేలు•వాని వ్రాలు
వ్రాలు గట్టుల గొట్టు•వాఁడెక్కిన మెకమ్ము
కమ్మదీయక పాలు•గమ్మసొమ్ము
సొమ్ముగాఁ జెలువరా•నొమ్ము చేసినవాఁడు
వాడు జూపక తాళి•గూడినలరు

గీ నలరు నల్లని వలువచే•వెలయుసామి
సామి చెలితోడ జగడంపు (బు) నలుపు నవతి
నవతిగానేఁ గామినేని సద్వంశమాళి
సరస రాజన్న నృపతి య•శమ్ముతోడ. ౧౭౩

సీ. తన మూర్తి విధునకు•జననేత్ర పంక్తులు
కువలయ స్థలములై•కొమరు మిగుల
తన విత్తమునకర్థి•జనక రాజ్యంబులు
నిక్షేప సంస్థితి•నియతి జెంద

తనదు తేజోదీపకునకు స్వాన్వయులు
భవన జాలంబులై ప్రభవహింపఁ
దన కీరుంపలకు దిక్తటములు శాసన
స్తంభంబులై నిరంతరముగ వెలుఁగ

గీ. నలరె నని సజ్జనంబు లభినుతింపఁ
గామినేన్యన్వయాంభోధి హిమధామ
సన్నుత ... ప్రసన్న రాజన్న నృపతి
ధరణిఁ బాలించె ధనధాన్యసరణి దనరు. ౧౨౪

గీ. అమ్మహీనాథు భార్యయై యలరుచుండె
రామమాంబ సుశీలాభిరామమూంబ
నిత్యసత్య వ్రతాచారనియమ వృత్తి
సకల సాధ్వీమతల్లులు సన్నుతింప. ౧౨౫

సీ. రాజకార్య విశేషరచనల నిజభర్త
కానుకూల్య ప్రధానార్థ్య యగుచు
భర్తృశుశ్రూషాభిరతిఁ గర్తవ్యార్థ
మాచరించి దాసీత్వకలనఁ జెందు
వల్లభాభీష్టాన్నపంచ పచారించి
సద్రత మాతృభావంబు నొందు
పతిదేహ సౌఖ్య సంపాదన క్రియ నెంచి
రంభావిలాస సంరంభ మెనయ

గీ. ధవుఁడు ధర్మ ప్రవర్తనత్వంబు గలుగ
నానుకూల్యంబుగ మెలంగు నవనివంటి
బరవసము బూను ప్రాజ్ఞభవ్యమూర్తి
రామమాంబ దలిర్చె శ్రీరామ యగుచు. ౧౨౬

సీ. తనపేరు సేరిలఁ దనరు ధాన్యంబుల
నర్థంబు ప్రముపిల్చిన నర్థితతికిఁ

దన దివ్య సహకార • తరువులలోఁ గొన్ని
వృత్తముల్ విప్రుల • కెలమి నిచ్చె
తన సమార్జిత విత్త • మును వివాహోపన
యనముల కర్పించె • వినయ మెసఁగ
తన సమ్యగిత్థు సం • జనిత శర్క విప
కృత సమారాధనా • ర్పితము జేసె

గీ॥ సకల జనములకును దల్లి • యగుచు దేవ
భూమి సురలకు వృత్తులు • పూర్ణముగ నొ
సంగి తత్కారుణాశీర్వ • చనములంది
రామమాంబ దనర్చె సూ • త్రామ గరిమ. ౧౩

గీ. అమ్మహారాణి పిమ్మట • నలరెఁ జిన్న
రామమాంబిక స్వప్రియా • రామయగుచు
దానధర్మ ప్రసంగ త • త్పరతఁ దనరు
ప్రియుని కనుగుణ హృదయయై • పృథ్విలోన. ౧౪

గీ. చెలఁగివారల పదపడి • శ్రీ భవాని
దనరె సాధ్వీలలామయై • ధరణిలోన
ధన కనక వస్తువాహన • ధాన్య దాన
దాసికా గోగణాది సం • తతి దలిర్చ. ౧౫

గీ. అవని మన్వ్యత్తర శతత్రి • యంబులైన
సద్వ్రతము లాచరింపుచు • సంతతంబు
రాజ రాజేశ్వరాంఘ్రినీ • రేజ యుగము
నెమ్మనంబునఁ దలఁచుచు • నిగుడుచుండె. ౧౬

సీ. ఘృతసూపదధి యుక్త • కించి దున్నంబైన
యన్నంబె కాని శు • ష్కాన్న మిడదు
ఖాది శైలాదులు గల్గు • పీడ్యమె కాని
వట్టి తాంబూలమి • య్యంగ లేదు

రమణీయ సూత్రాంబ • రంబులనేకాని
జరదంశుకంబు లో • పంగ లేదు
సకల వస్తు విశేష • సదనంబులేకాని
శూన్య గేహంబులఁ • జూపలేదు

వసుధలో గల్గువార లౌ • వ్యార్తులైన
నర్థులైవచ్చి యాచించు • నంతలోన
తనయులను బ్రోచు తల్లి వి • ధంబు దోప
నెలమి రక్షించిన భవాని • నెన్న దరమె. ౧౮౧

సీ. స్వాధ్యాయ పరులను • సమ్మోదంబలరించి
దాన ప్రసంగంబు • దలఁపుచుండు
శాస్త్రి సంఘంబును • సంభ్రమంబొనరించి
యత్యంత మధురోక్తు • లాడుచుండు
సకల పురాణజ్ఞు • లకు ముదంబొనరించి
దేవతాంతరముల • దెలియ నడుగు
నితిహాస వేదుల • నీప్సితంబెనయించి
సద్వ్రత స్థితిగోష్ఠి • నలుపుచుండు
నిత్య సజ్జన సహవాస • నియమమునను
దేవగురువిప్ర విశ్వాస • భావమునను
విశ్వ సంపత్సమృద్ధియు • వెలయుచుండ
నా భవానమ్మ నెన్నంగ • నలవి యగునె. ౧౮౨

సీ. శ్రీరాజరాజేశ్వ • రీసపర్య యొనర్చు
పుణ్య సీమంతినుల • జొగడుచుండ
రాజేశ్వరామేయ • పూజా విధి వహించు
విప్రోత్తములు మెచ్చి • వినుతిసేయ
సకల సంపద్వృద్ధి • జప ముఖ్యము వహించు
స్నాతక వ్యూహంబు సన్నుతింప
నిరతాన్నదాన మ • నిశచే వర్తించు
నా బాలగోష్ఠియు • మభినుతింప

హితపురోహిత బాంధవ • హృదయ మంత్రి
మిత్ర భటదాస సఖులను • ఋక్షములనుచు
దలఁచి రక్షించుచున్నట్టి • ధర్మమూర్తి
యగు భవానమ్మ నెన్నంగ • నలవియగునే. ౧౫౩

సీ. అధ్యాత్మ విద్యామహో • పాధ్యాయులను నిల్పి
వేదవేదాంగముల్ • వెలయఁజేసె
శ్రుతి శిరఃపరిచయా • న్వితపండితుల నుంచి
స్థిర చతుస్తంత్రముల్ • దేటపరచె
నాత్మ నామాంకంబు • లైన పేటలలోన
వృత్తి మాన్యంబులు • వెలయఁజేసె
దనివొంద నన్నస • త్రంబులు విధియించి
బహుదేశ విద్యార్థి • పంక్తిఁ బ్రోచె

నగ్రజాతులు మొదలైన • యఖిల జాతు
లందు దయయుంచి యన్నవ • స్త్రాదులొసఁగి
శ్రీ భవానమ్మ విలసిల్లె • శ్రీ భవాని
యనఁగ రాజన్న నృపు భార్య • యవనియందు. ౧౫౪

సీ. ధన్యమాంగళ్య మా • త్ర ప్రసిద్ధి వహించి
జన మనోరమ వృత్తి • సంతరించి
సకల కళాభిజ్ఞ • చాతుర్యము నమించి
విదిత ప్రజావృద్ధి • విభవ మొంచి
ప్రకటీకృత ప్రభా • పద్ధతి [illegible]
[illegible] రఘురామసద్వృత్త ప్రశంసలు గాంచి
[illegible] • [illegible] విహరించి
[illegible] • [illegible]ంచి

గీ. సత్తి మహాలక్ష్మి [illegible] • [illegible], శక్ర జనని
ప్రభు జనక జాత దమయంతి • రతిఁదలంచి
కామి చేసి భవానమ్మ • [illegible]రిఁబోడ
సాటిసేయంగ వచ్చును • సరసకృతులఁ. ౧౫౫

మంబులఁ జేకొ్నంచి • సంబరంబున రాజ
రాజేశ్వరుని ప్రేమ • రంజిలంగఁ
ఋషి మీఱఁగ శత • రుద్రీయ ముఖ్య సం
స్తవములొనర్చిత • త్రివిధ సీమ

ఆ. నన్న పర్వతంబు • లాజ్యనదంబులు
విరివిగా విధించి • విప్ర ముఖ్యుఁ
దృప్తిఁ బొందఁజేసి • దివ్య షోడశ మహా
దానములఁ దదర్పి • తములఁజేసి. ౧౭౮

గీ. ఇవ్విధంబున నొనరించి • యేకవాస
రంబు నియమంబునను జాగ • రంబొనర్చ
నీశ్వరేశ్వరుఁడైన రా • జేశ్వరుండు
వర మొసంగిన తన్మహా • వరము కలిమి. ౧౭౯

గీ. భవ్య రాజేశ్వర వర ప్ర • భావమునను
సంతతా చరిత వ్రతా • చారమునను
తనదు నియత పతివ్రతా • ధర్మమునను
శ్రీ భవానమ్మ దాగె నర్ధి • సేవధియన. ౧౮౦

గీ. ఆ భవానమ్మకుదయించి • రమ్మహేశు
కరుణ నొకపుత్రుఁడొక • పుత్రికయు ప్రబుద్ధు
లగుచు రాజన్న రాజమ్మ • యనఁగ దనరి
చంద్రుడును లక్ష్మియు జనించు • చందమునను. ౧౮౧

గీ. నిత్యసత్య వ్రతాచార • నియతి వెలయు
రాజమాంబ ముఖోపమ • రాజ బింబ
ఆశ్రిత కదంబ విమల గు • ణావలంబ
భూనుత భ్రమరాంబాంశ • పూర్ణ బింబ. ౧౮౨

సీ. వైద్య శాస్త్రాభిజ్ఞ • వైద్య వర్యులచేత
బహుళౌషధంబులే • ప్రభుఁడొనర్చె

వ్యాధి పీడిత జనుల్ • వచ్చి వేడినయంత
సౌమ్యంబులనే మ • హాత్ముఁడొసఁగె
బహు తటాకంబు లే • ర్పడగ నిర్మించుచు
వృత్తి మాన్యంబులే • విభుఁడు జేసెఁ
తగవు కోరిన వారి • ధర్మ మార్గమ్మున
భావించి మించెనే • పార్థివుండుఁ

గీ. నట్టి చెవ్వేల మఖ్యాన్వ • యాబ్ధి చంద్రుఁ
డైన ధర్మ నృపాలుఁడు • వైద్యశుండు
రాజకార్య ధురంధర • ప్రాభవుండు
ధరణి పాలించె ధన ధాన్య • గరిమ మెరయ. ౧౩

గీ. అతని పుత్త్రుఁడు చొక్క భూ • పాగ్రగణ్యుఁ
డద్భుతైశ్వర్య ధుర్యుఁడ • హంయు శత్రు
హరణుఁడాశ్రిత రక్షణుం • డనుదినాగ్ర
జనకృత విశ్రుతా శీర్వ • చనము నొంది. ౧౪

క. శ్రీ చొక్కనాథుఁడనఁదగిఁ యా చొక్క నృపాలుడలరె • సంచితకరుణా
లోచనుఁడు రాజకార్యాలోచనుఁడు ప్రభాప్తిలోక • లోచనుఁడనఁగ. ౧౫

గీ. చెలఁగి రాజన్న భూపాలు • చెలియలైన
రాజమాంబను బెండ్లాడి • రాజకాంతి
పొలిచియున్నట్టి యొక్క స • త్పుత్త్రు గనియె
నతఁడు రాజన్న చౌదరి • యనదలిర్చు. ౧౬

సీ. కలశ పారావార • గర్భ వీచికలందు
జనియించు సంపూర్ణ • చంద్రుఁడనఁగ
శ్రీ మహాలక్ష్మి ప్ర • సిద్ధోదరంబున
సంభవించిన పంచ • శరుఁడనంగఁ
స్థిర తరైశ్వర్య శ • చీదేవి కుదయించి
సంతసించిన శ్రీ జ • యంతుఁడనఁగ

దివ్య ప్రభాపార్వ • తీ తనూజాతుఁడై
ధరణి వెల్గిన శక్తి • ధరుఁడనంగ
కామనేని భవాని ప్ర • కాశ గర్భ
శుక్తిముక్తా ఫలాయి • తస్ఫూర్తి దనరి
రాజరాజ మహారాజ • రాజ బిరుద
నదము రాజన్న నృపతి • యభ్యుదయ మొందె. ౧౯౭

క• ఆ బాల్యంబున నుండియుఁ బ్రాబల్య సమేత వంశ • పారంపర్యా
శ్రీ బంధుర ధర నైజము • హా బాహా పీఠిఁ బూంచి • యలరుచునుండెన్. ౧౯౮

సీ. సత్య సత్వ వచో • యశస్సంస్థితుల ధర్మ
బల గోపతి విహార • కలన నెంచి
త్యాగ జవానీక • యౌవన గరిమచే
బలి సింహ విజయాత్మ • భవుల మీరి
త్వద్బుద్ధి సహనత్వ • తేజస్సుఖంబుల
చంద్రిక గోత్రేశ • సరణి నొంచి
విద్యానవజ్ఞాన • హృద్యత్వ లక్ష్మిఁగా
వ్యఘున జనక హేమ • వసతిఁ గాంచి
గీ. తనరె విస్ఫూర్తి కీర్తి సం • తాన తరుఫ
లాయితాబ్జ భవాండ భాం • డాంతరస్థ
ధుర్యమాధుర్య గుణతోషి • తార్యకామి
నేని రాజన్న దేశాయి • నిపుణుఁ డలరె. ౧౯౯

సీ. ప్రాఘ్ఘురి విద్వత్స • భా శోభనామరీ
విజితా శాటికా • విలసనంబు
దక్షిణ దిక్పండి • త పరిషద్దేవతా
కర సమన్విత పీఠి • కా భరంబు
పశ్చిమాశోద్యద్వి • పశ్చిత్సమితి దివ్య
కాంతా ఘటిత పత • ద్గ్రాహకంబు
నుత్తరక కుబుద్వ్య • దురుధీర సందోహ
హైపీ ప్రదాపిత • దర్పణంబు

గీ. వెలుఁగి చెలువొందె నద్లూరి సీమధామ
రత్నమయ పేట శ్రీరామరడ్డి పేట
జన వినుత కామినేని రాజన్న నృపతి
సదన ఘుమఘుమి తార్భటి శారదాంబ. ౨౦౦

సీ. నాటక భారతీ పాటల గంధి కు
చాలోల హారమై యలర నార
ప్రకటితాలంక్రియా భాషా విలాసినీ
సీమంత రత్నమై చెలఁగె నార
సంతత కావ్య వాక్సారసాక్షి నాసి
కాంచిత ముత్యమై యలరె నార
సకల స్మృతీతి హాస సరస్వతీ కర
దర్పణ శ్రేష్ఠమై దనరె నార

నిఖిల జన సన్నుతంబైన నీదు యశము
మహిత హృద్యాన పద్య సామ్రాజ్య పూజ్య
యనుచు విద్వత్సమూహంబు లభినుతింప
నిలను పాలించె రాజన్న నృపవరుండు. ౨౦౧

సీ. ఘోర ధారారట్టి ఘోట్టాణముల నెక్కి
హెచ్చరించుచు సిఫాయీలు రాఁగ
దారుణ తరవారి ధళధళ ద్యోతంబు
నర్క ప్రభలతో నెదుర్కొనంగ
పవమాన మానసోజ్జ్వల తురంగము నెక్కి
ఘోయుని పగవారి గిట్టి ముట్టి
శిరములు కరములు చరణంబు లురములు
ఖరిలు ఖరిల్ ఖరి కర్కరి కనంగ

జెరకు కోలలు తెగ వ్రేయు తెరువు దోఁప
నరికి తజ్జయలక్ష్మి సనాథుఁడగుచు

సంగరాంగణ గాండీవి • సదృశ కామి
నేని రాజన్న నృపమౌళి • యలరెఁ దలిర్చి. ౨౦

సీ. ఖడ్గంబు బూనెనా • కఠినారిశిరములు
కందుక క్రీడ జెం • పొంద వలయు
సాఁగుఁచేబట్టె నా • చటుల రాహుత్త
రాట్పటు శిలాబత్తరుల్ • పగులఁ బొడుచు
నే జాగరించెనా? • నేటుగా వీరుల
గుదులుగా గను గ్రుచ్చి • మొదలకొండ
కోదండ మందెనా? • వేదండముల నైన
నొక్కొక్క కోలచే • నుక్కడంచు

సౌర సాహస విక్రమా • ర్కావతారుఁ
డనుపమాకారుఁ డాశ్రితా • పిన విహారుఁ
డను దినోదారుఁ డఖిల • విద్యా విచారుఁ
డగుచు రాజన్న నృప మౌళి • యలరుచుండె.

సీ. హాటకాచల హారి • ద్ఘోటకా సల సుహా
నాటకా గళ కాల • కూటములను
సలిన మార్గణ చైత్ర • నలరాజ హరిపుత్ర
ధనదాత్మజ విచిత్ర • ఘనతనులను
ఖర కరాత్మజ శీత • కర విరోచన జాత
హరస ఖామర పూత • సురతరులను
కాండజాస గణేశ • కుండలీశ వ్యాస
చండీశ చిత్ర శి • ఖండిజులను

గీ. శౌర్య సౌందర్య దానవా • క్చతురిమములఁ
బరిహసింపుచు నిత్య సం • పదఁ దలిర్చు
నిరుపమిత తేజుఁడై కామి • నేని కులజ
వరద రాజన్న శౌరియు • చంద్రుఁడలరె.

సీ. దంతావళ స్థితో • ద్ధత వాద్యమానోగ్ర
భేరికా ఢణఢణ • త్కార రవము
యోగ్యోత్పత్తి ఘటితము • హయస్తాస్యమాన ఢ
క్కారూఢ ఢమఢమ • త్కారములును
సంభృతా జానేయ • సంయుక్త టింకణ
దారుణ రమరమ • త్కారములును
పటు జవోత్కట మహో • ద్భట సంతతాహత
పటహ ఢాంఢాం క్రియా • పాటవములు

కలయ సంగర జాంగలాం • గణ కరాళ
కర్తరీముఖ సుశిలీము • ఖ దళితలుఠ
దరి గళగళద సృక్ఝరీ • తరణి ఖేల
దసి ధరుఁడు రాజ నృపవరాళి • యలరుచుండు. ౨౦౯

సీ. హస్తముల్ రాజేశ్వ • రార్చనా విధియందు
వీనులు శివకథా • వితతియందుఁ
జూపు మహాదేవు • దీపితాంగమునందు
జిహ్వ పంచాక్షరీ • స్థిరత యందుఁ
జిత్తంబు శాంభవ • శ్రీ పదాబ్జములందు
స్వాంతంబు ద్వాదశా • క్షరమునందుఁ
బుద్ధి యుమానాథు • పూర్ణ రూపము నందు
మనసు మహేశ్వర • మతమునందు
గీ. నునిచి కాల త్రయీ బాధ్య • యోగమొంది
సంతత భ్రమరాంబికా • సామరస్య
సరస రాజేశ్వర వర ప్ర • సాదలబ్ధ
జనన రాజన్న దేశాయి • చంద్రుఁడలరె. ౨౧౦

సీ. పలికెనా? నతోక్తిఁ • బలుకుటెంతియొ కాని
తద్వ్యతిరిక్తంపు • తలఁపు లేదు
చూచెనా? దయజేయు • చూపులింతియె గాని
తదభావమగు చూపు • లోదవకుండు

నిచ్చినా? పూర్తిగా • నిచ్చుటింతియె కాని
కొదువగా నిచ్చుట • నొదవకుండు
పట్టినా? విడకచే • బట్టుటింతియె కాని
విడుచుట కెన్నఁడు • గడఁగ లేదు

గీ. భళిరె? యిటువంటి నృపుఁడేడి • యీఁదలంప
శాశ్వత స్థితి రాజ్యంబు • విశ్వమునను
జేయవలెనని కవులెన్న • జెలఁగె నౌర
నిపుణుఁడైనట్టి రాజన్న • నృపవరుండు. ౨౦

శా. సామాన్యజ్ఞఁ గవీశ్వరుల్ సభకు రా • మద్దర్శనీ సీమ గో
ష్ఠీ మాధుర్య రసోక్తులం గరపి హా • ర్దింపన్ బ్రవర్తించుచున్
సోమార్కానల విద్యుదుద్ధిత కళా • స్ఫూర్తి స్వరూపంబు తా
నె మాహేశ్వర పాదపంకజ సప • ర్యన్ జెందు మనంబుగా. ౨౧

క. పటు శబ్దార్థాలంకృతి • రటద విరళ తరగళత్త్ర • రంగాయిత వా
ఘ్ఘుటనోల్లస ఘటన ప్ర • స్ఫుటన ప్రతిభా విశేష • పూజ్యుండగుచున్. ౨౨

సీ. అఖిల భూజన జీవ • నాధారత వహించి
యనుపమ స్థితి ఘనా • ఘనుల మించు
దృఢతరా రయవ సం • దీప్త తత్త్వము నొంది
గాత్రమున ఘనా • ఘనుల నొంచు
భాసమాన ప్రతా • ప స్ఫూర్తి జెన్నొంది
మనుముట్టకా ఘనా • ఘనుల నొంచు

గీ. ప్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • పరతఁ జెంది
ధరణి పాలింప వలెనని • ధన్యులెన్న
సమిత జయసాంద్రు కామినే • న్యన్వయేంద్రుఁ
డైన రాజన్న నృపమౌళి • యలరుచుండె.

సీ. ఏ తాపస స్వామి • యిరవుగా నామ్నాయ
సారస్యము వచించె • సజ్జనులకు
నేతపస్వి వర్ధుండు • హిత వరివస్యాది
సద్గ్రంథ కథమహా • శయము దెల్పె

నేపారి కాంక్షిన • మేధమాన మడధ్వ
జనితాశయంబు సాం • పునవిధించె
నేపగిప్రాథస్యు • డెటమితో డకుద్వైధై
క్యానుసంధానంబు • నందఁజేసె

గీ. సట్టి శ్రీరామ భద్రేంద్ర • యతివరుండు
నాత్మగురుఁడగు కరుణార•సార్ద్రదృష్టు
లలర గనుగత్త్రారహా • స్వంబు గరప
వెలసె రాజన్న దేశాయి • విశ్వమునను. ౨౧౧

సీ. అసమాన బలశౌర్య • లసమాన సౌందర్య
రసమాన గాంభీర్య • రభసమలర
ఋుంఖాను ఘుంఖాజి • రింఖావిశృంఖలో
త్కూరాఖాణ సంఘముల్ • గడలుకొనఁగ
జండశుండాదండ • భండనోద్దండవే
దండతండంబులు • ధ్ధతిఁ దలిర్ప
డోలికా హాటకాం • దోళికా పర్యంక
పాలికా శకటసం • పద వెలుంగ

గీ. నిగ్రహా నుగ్రహోదగ్ర • జాగ్రదుగ్ర
విగ్రహా వ్యగ్ర విక్రమా • వేశులైన
భటులు గొలువంగ • భూభార భరముబూని
నివుణ రాజన్న దేశాయి • నృపతులెన్న. ౨౧౨

గీ. అతని యర్ధాంగనాలక్ష్మి • యలరెరంగ
మాంబ యనఁగను సుగుణావ • లంబనగుచు
సత్యశీల దయావ్రతా • చారదాన
ధర్మసాధ్వీగుణములచే • ధన్యలెన్న. ౨౧౩

కం. రంగనులోచనజితపా । రంగను గరుణాంచితాంత • రంగనుగతిపా
రంగను చికురాంచితసా । రంగను విన్నుతింపసావ • రమణియనదగున్. ౨

సీ. ధవళాక్షిప్రభాధళ • ధళలు నవ్వులనుంచి
హంసయానాభిఖ్య • నలరుచుండి
చాంచల్య గుణము నే • త్రాంచలంబున నుంచి
కమలాను గుణవృత్తి • నలరుచుండి
నీలకాంతిచ్ఛటల • నెమ్మేన నొనరించి
యనుపమార్యాసమా • ఖ్యను వహించి
దృగ్గోచరముకాని • దీప్తిమధ్యము వెన్ని
యతను మోహనవిద్య • గతిజెలంగి

గీ. పలుకు చెలి కల్మి సఖి సామి•పౌలఁతి రతిని
కలవిలాసవ దవయవం • బుల నెదిర్చు
ధన్యరాజన్య నృపమౌళి • ధర్మపత్ని
యైన రంగమ్మ నెన్నఁగ • నలవియగునే. ౨౧౫

సీ. వేనలి ఘననీల • విభవంబున మెలంగ
ఫాలంబు విధుకళా • లీలదనర
దనరుబొమ్మలు శార్ఙ్గ • ధర్మమార్గము నొంద
కన్నులిందీవర • గతిజెలంగ
వీనులు శ్రీధర • విఖ్యాతిని వహింప
నధరంబు మధుగర్వ • హారతబూన
గళము శ్రీమత్కంబు • కరసంస్థితిని జెంద
నడుము హరిస్ఫూర్తి • నడరుచుండ

గీ. గతులు కరివరదఖ్యాతి • నతిశయిల్లఁ
దనరు దివ్యాంగముల విష్ణు • తనువహించు
రాజశేఖరు నర్ధాంగి • రాజ్ఞయైన
రంగమాంబను బొగడత • రంబునౌనె. ౨౧౬

సీ. ప్వసమాన వేషంబు • నినుమంతయైనను
పదభామ కొసఁగని • సరసిజాస్య
తనువంచన నొనర్పఁ • దేలఁచినవారలఁ

బుత్రుల గాఁచేయు • పుణ్యుఁ బోడి
బహుళతపోనిధియైన • పతిమహావిద్యాను
భవము నొందఁగఁజేసి • పద్మగంధి
భర్తృనిమిత్తమై • పద్మినీబాంధవు
నుదయింపఁ జేయుని • యుత్పలాక్షి

గీ. కలిత రాచుళ్లగోత్ర జ • కామినేని
కులజ రాజన్న దేశాయి • తిలకహృదయ
స్వాధి మతధామకులపాలి • కాభిరామ
రంగమాంబకు సాటిసే • యంగవచ్చు. ౨౧౭

సీ. ఏమహాదేవి శా • మేశ్వరాంకానల్ప
తత్త్వంబునందు మో • దంబుఁ జెందె
నేమహా శ్రీరాజ్ఞి • యింపుతోడ మదధ్వ
తత్త్వవిద్విజ్ఞాన • ధాత్రియయ్యె
నేజగజ్జనని మ • హేశ్వరార్పిత సప
ర్యావిశేషంబుల • నలరుచుండె
నేమహాలక్ష్మీప్ర • హ్మేశానముఖ దివ్య
జీవికావార్తయై • వెలుఁగుచుండె

గీ. నట్టి జగదంబ లలితాంబ • యధరబింబ
సైకతనితంబ భ్రమరాంబ • శారదాంబ
తనదు పూజావిధానత • త్పరతఁ జెంద
రంగమాంబ దలిర్చె శ్రీ • రంగయగుచు. ౨౧౮

సీ. సమ్యక్ప్ర చీపాక • శాసనుబహువిధంబు
సరవ ప్రభాప్రభా • కరులమాడ్కి
సంభ్రమ ద్రోహిణీ • చంద్రులకైవడి
చంద్రమతీహరి • శ్చంద్రులగతి
స్థిరభీమ జాహీర • సేనజు లన్వదగి
కనదన సూర్యాత్రి • మునులరీతి

పావనాంచ దరుంధ • తీవసిష్ఠులభంగి
భాసుర రతిమనో • భవులరీతి

గీ. శామినేవ్యన్వవాయసం • టితరంగ
మాంబరాజన్న జేశాయి • యానుగుణ్య
దంపతీ భావ మింపొంద • తతసమృద్ధి
వెలయ విలసిల్లి రానంద • మలరుచుండ. ౧౯

గీ. సమ్య గనపాయి పరశివ • శక్తులనగ
సకల సంపూర్ణ చంద్రచం • ద్రికలనంగ
భానురాఖండ దీపదీ • ప్రప్రభలన
లలిత రాజన్న రంగమ్మ • వెలసిరిలను. ౨౦

గీ. అమ్మహీపతి తోబుట్టు • వగుచు దనరి
రాజమాంబ ముఖోపమ • రాజబింబ
ఆశ్రిత కదంబ ఘనసుగు • ణావలంబ
భానుతభ్రమరాంబాంశ • పూర్ణబింబ. ౨౧

సీ. అన్నార్థులైవచ్చు • నన్యజాతులకైన
నన్నదానము జేయు • ననుదినంబు
బాంధవులందుసం • బంధంబు పాటించి
నేలుగా వారిబో • షించుచుండు
దనదర్శనమ్ము జే • సినయాచకులముంమం
బుత్రభావననుంచి • బ్రోచుచుండు
దమం గొల్చుం సేవక • దాసీజనమ్ములం
బనుశెన్ని రక్షించు • వినయమలర

గీ. దనదు గ్రామంబుల వసించు • జనులకెల్లం
దల్లియై వారి కుశలంబు • దలపుచుండు
నిఖల సుగుణాఢ్యయాసకామి • నేనిరంగ
మాంబను నుతింప శక్యమే • యవనిలోన. ౨౨

శా. రారాజద్గుణశాలి శీలవిలస • ద్రాజన్న దేశాయిభా
ర్యారత్నంబగు రంగమాంబ గనియెన్ • రంజిల్లముగ్గుర్ సద్గుణా
ధారుల్ ధీరులు దారులైతనరు పు • త్రశ్రేష్ఠులన్ సంతత
శ్రీరమ్యాకృతి వైభవంబుగల పు • త్రిన్ స్వర్ణపుత్తింబలెన్. ౧౩

క. ధీరోదాత్తుఁడు దారుఁడు। కారుణ్యాగణ్యపుణ్య • గణనీయశుభా
కారుఁడు పెదరాజన్నయు। హీరమణుఁడు నిత్యవృద్ధి•నెనయుచునుండెన్ ౧౪.

మ. తనగాంభీర్యము సుందరత్వముదిగం • తఖ్యాత దాతృత్వమున్
వనధిన్ మన్మథు వారిజాప్త తనయున్ • మందారులం జేయు స
జ్జనహైత్రై కేప్సితదాయియై వెలసెనా • సౌజన్యజన్యప్రథన్
జినరాజన్న నృపాలమౌళి మదన • శ్రీరంజితాకారుఁడై ౧౫

సీ. పటుతర బ్రహ్మాండ • భాండోదరంబులు
బొమ్మరిండ్లయ్యెనే • పుణ్యవతికి
హరిహర బ్రహ్మాది • సురతతుల్ పాంచాలి
కా సంచయంబులే • కాంతకయ్యె
మే[illegible]ర [illegible] • భూరిసర్వాంగ[illegible]
చ్చనగిల్ల లేదునా • ఘనచికురకు
మహిసహస్రస్తంభ • మంటపంబయ్యెల
జాలయై దనరెనే • చంద్రముఖికి

గీ. రమ్య నవరత్నకీరవయోంమి • రాజమాన
మైన యాబాల యీబాల • మురువుచుఁ బొగడ
జిన్నరాజమ్మ విలసిల్లెఁ • గన్నతల్లి
దండ్రులకు నేత్రములుచల్ల • దనముగాఁగ, ౧౬

క. సోమాంశంబున దనరుచు। సోమాభంబైన ముఖము • శోభిలుచుండన్
సోమహావయువం బలరఁగ । సో[illegible] మాంతరముల•సుదతిచెలంగెన్ • ౧౭

క. గోపాలరాయు డవనిం। గోపాలుఁడసంగదనరి • గోధనధాన్య
శ్రీపతియై వర్ధిల్లెను। భూపాలక సుతులలోన • పూజ్యుండగుచున్. ౨౨౫

గీ. దేవదేవుఁడు శ్రీరామ • దేవుఁడవనిఁ
బ్రోవవర్తించు గతి రాజ • పూజ్యుఁడగుచు
వాసుదేవుఁడు వర్ధిల్లు • వందనీయ
రాజ రాజేశ్వర కృపాభి • రాముఁడగుచు. ౨౨౬

వ. ఇవ్విధంబున వంశపరంపరాభివృద్ధిగా రాజశ్రీ రాజన్న దేశాయి వంశావతా
రంబు వర్ణించి. ౨౩

చ. నిరుపమితప్రయుక్తిజన • నీజనకాద్భుతసూక్తి, దేవ
సురగురు పాదభక్తిపరి • శుద్ధమనోఽచ నానురక్తి శ్రీ
నిరతిశయప్రసక్తి, సువ, నీపకర్తృకుణశక్తి • యాదయా
పరుఁడగు కామినేని పెద • పాపనికేఁ దగు ధీరులెల్లఁగన్. ౨౩

సీ. శ్రీసమృద్ధివహించి • చెలగె భరద్వాజ
గోత్రంబు తద్గోత్ర • పాత్రమగుచుఁ
గమనీయ బాగుసేల • కంట్యన్వయము నరం
జిల్లె దద్వంశ ప్ర • సిద్ధిఁ జెంది
ఋగ్యజుస్సామామ్నాయ • యోగ్యసిద్ధాంతధూ
ర్ధారణధుర్యుఁడౌ • దార్యశీలుఁ
డగుచు కర్తృమకర్తృ • మన్యథాకర్తృము
ద్యచ్ఛక్తి పెద్దరా • జన్నయనెడు

గీ. భూసురాధ్యుఁడు సన్న • పూర్ణాసమేతుఁ
డగుచు శ్రీకామినేనిరా • జన్న నృపతి
కీహితప్రద రాజపు • రోహితుండు
ధరణి వర్ధిల్లెఁ దద్భాగ్య • సరణిఁ జెంది. ౨౩

సీ. శ్రీమహాలక్ష్మి • ప్రసిద్ధిఁ గోదావరీ
వలశంబు భావి నుద్భవంబునొందె

పృథ్వీవృత్తము. నియుద్ధసమయోద్భవ • నిజభుజార్గళాస్త్రత్రుటి
ద్వియత్ప్రభువధావశ • ద్విమతతుండ చండోత్తమా
భయభ్రమదహస్కరా • భయకరభ్రచక్రభవ
త్స్వయోదయ శరాసనంతత సమాజ్ఞిత్రైకోత్సవా. ౨౩

మ. ఇది శ్రీరామన్నపాలుపేట నగరో • ర్వీశాఢ్య రామళ్ళశ్రో
త్రదిగంత శ్రుతకామినేని కులజ • ప్రస్ఫీత లక్ష్మీపసు
గ్రదయాసంయుత రాజశేఖరహిత • ప్రఖ్యాత భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమున నా • ద్యుల్లాసమింపై తగున్. ౨౪

గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ
ప్రసాద ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్య పూజ్య రా
మళ్లగోత్ర పాత్ర కామినేని వంశపయః పారావా
ర రాకాసుధాకర రాజన్యదేశాయి సార్వ
భౌమాజ్ఞాపితాంధ్ర గీర్వాణకవిత్వ
చాతుర్యధురీణపరాశరగోత్ర
రామాక లింగనార్యపుత్ర
లక్ష్మీపతిప్రణీతంబైన
భద్రాయురభ్యుదయం
బను మహాప్రబంధం
బునందు ప్రథ
మోల్లాసము
శ్రీ శ్రీ శ్రీ



శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము



## ద్వితీయోల్లాసము





శ్రీమణి సౌధాసీన
శ్రీమత్సింహాసనేశ్వ • రీకారుణ్యో
ద్దామధనధాన్యసంప
ద్రామన్నృప పురాధిరాజ • రాజమహేశా. ౧

### షష్ఠ్యంతములు

క. ఈదృగిదమియత్తావచ్ఛేదకర హితగుణమణివి • శేషాంబుధికిన్
వేదాద వర్ణతత్త్వ ప్రాదుర్భావోపలబ్ధి • వరధీరునకున్. ౨

క. ప్రపదప్రపతత్ప్రపదా న్యపతిప్రవిపద్ధ్రుదతివి • హారునకుసరీ
సృపహారికి భవదారికి గ్లపితారికి నిత్యసత్య • కల్యాకృతికిన్. ౩

క. విప్రత్యుక్త్యుత్పన్నగప్తురు పదునికట, నినసదాది • పత్యునకుమహా
కామ్రాంగ్షక పూర్వద్యుమ దద్రిభినాస్థగితశూల • హస్తాబ్జునకున్. ౪

క. ఏకానేకాకారా! టీకునకు గటీతటీప • టీసంరాజ
చ్ఛ్రీకరకృత్తికి నహసా! ద్యాకలిత మహాప్రబోధ • కాకృతిధృతికిన్. ౫

క. శరణాగత చరణామృత! చరణానత కరుణభక్త • సంవరణత్రై
పురనాయక దరదాయక! మురహారియక మిత్రునకును • భుస్తోత్రునకున్. ౬

క. శబల శరశరాసకటి! ప్రబలావృత బర్హిబర్హ • భాసురకుహనా
శబరీవరక బరీభర నిబిరీసరచిత సుమోప • నీతాత్మునకున్. ౭

క. సత్యచిదానందునకున్! నిత్యునకును శ్రుతిశిరఃప్ర • ణీతినిర్ణీత
ప్రత్యయరూపునకుజగ! త్ప్రత్యాహారోపపన్న • పరభాగునకున్. ౮

క. శ్రీరమ్యపరాశక్తిప! రీరంభవిజృంభితావ • రిచ్ఛిన్నసుఖా
ధారోదార మనోధా! రారామారెడ్డిపేట • రాజేశునకున్. ౯

వ. నిరంతరాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన భద్రాయురభ్యుదయంబను మహాప్రబంధంబునకు గథావిధానం బెట్టిదనిన. ౧౦

సీ. ప్రతిదినాధ్వరహవి • ర్భాగాగతామరా
నూన పరస్పరా • హ్వానములును
ప్రచురసమిద్దర్భ • ఫలపత్ర హరణార్థ
మునికుమారాన్యోన్య • నినదములును
సతతావభృథశుచి • స్నానోత్సవాయాత
తాపస జనతాను • లాపములును
నమ్యజ్ఞవీథవత్సవ • మానిసంపదు
ద్యాశీర్వచనపూర్వ • కారవములు

గీ. సత్రతకృతకృత్య యజమాన • జంపతీవి
రాజినీరాజనవిధాన • రతెసువాసి
సీమిధోవిభ్రమానుగ • నిస్వనములు
నలర శ్రీనైమిశారణ్య•మవని వెలసె.

సీ. బద్ధపద్మాసన • ప్రస్ఫురత్ఖేచరీ
లక్ష్యపశ్యన్మనస్కా • లంకృతంబు
సిద్ధాసన స్థిరప్ర • సిద్ధిమద్గోచరీ
వీక్షణోత్సుకమాని • విలసితంబు
సింహాసనవిధాన • సేవ్యమాననిరంజ
నీవిలోకనభిక్షు • జీవితంబు
ముక్తాసనప్రదా • వ్యక్తిమద్భూచరీ
సంయుక్త సంయమి • సంచయంబు

గీ. నగుచు వీరాసనస్వస్తి • కాసనాఢ్య
రమ్యహఠయోగ, లయయోగ • రాజయోగ
మోక్షలక్ష్మీకరగ్రాహ • ముదితులైన
యోగులు వసించుచుందు • రింపొంద నచట. ౧౨

వ. మఱియు నిరంతరాంకురిత పల్లవిత కుసుమిత ఫలిత లలితసవిధ వివిధమహామహీరుహ వ్యూహశాఖోపశాఖా శిఖర ముఖర కలరవ కలకంఠ నీలకంఠ కీరశారికాది పత్రిపత్రిభవ పవన చలిత గళితసుమసముదయ సంతతవికస్వర వాసంతికా సేవంతికా మల్లికా మాలత్యాది లతావితానస్యంద మానామంద మకరంద బిందుసందోహాస్వాదనానంద మిళింద ఝుంకారంబును, సదేశస్థితస్థల నలినీఫుల్లహల్లక కమల కుముద శాలినీలోత్పల దళగళత్పరాగ పరిమళ పరిమిళిత విశదశశధృదుపలశకలకలిత సోపానసంఘ సంఘట్టనోచ్చైర్ఘుళంఘుళ స్వనద భంగతరంగసంగతరథాంగాది పతంగారావ ఘుమఘుమిత సరోవరంబును బాలాతపసేవనోత్సుక జలమానుషీ పరిమృదితమృదులసికతామయసంగత పానీయపానార్థసమాగతనిమజ్జనోన్మజ్జన సజ్జీవభవన్మదభర వనగజనాదధారాస్తబకితోద్దాదసంబును నవనవభవత్సవనభవనభూమహోమధూమశ్యామికాభూతదిశాకాశావకాశంబును ప్రవర్ధమానాధ్వరసముత్సవ సమాగత శతముఖముఖ నిఖిలసురవర పరిషదభిరామంబును కుసుమశరసమిత్కుశ విలసత్కంద మూలఫలాహరణార్థము ముహుర్ముహుర్భ్రమమాణ మానిసంత్రాస కలకల నినాదమేదురంబును విశ్రుతశ్రుతిస్మృతీతిహాసపురాణ కథాకథన చతురయతివరవిరాజితంబును కౌండిన్య కణ్వమార్కండేయ కపిల శాండిల్య వత్సమాంజాయన వ్యాసపుండరీకాగస్త్యభృగులహమాతంగ మాండవ్యశౌనక మైత్రేయ చిత్రి

జాజవాల్య్న గాలవ గౌశిక గౌతమ మందపాల జాబాలి యాజ్ఞవల్క్య వరతంతుకశ్య
ప వామదేవ శమీకాదిముఖమహామునిసేవితంబై వెలయుచుండె. ౧౩

౪౦. ఆనైమిశమున వసివసి। తానూనజ్ఞానశౌన । కాదిమునీంద్రుల్
నానావిధావధానవ। చోనిఖిలకథాశతాంగ । సూతుఁ సూతుఁ. ౧౪

ఉ. చూచి మునీంద్రచంద్రుఁపతి । శుద్ధభవన్ముఖోక్తి భాక్సుధా
సేచనవృద్ధి మద్విమల । చిత్తుల పొంబశివాంఘ్రిపద్మదా
స్యోచిత వృత్తులై వెలయు । చుంబురుగాన యగణ్యపుణ్యసం
సూచకమైన తచ్చరిత । సొంపుగఁ బల్కి యుంచవేడుచుఁ. ౧౫

వ. అని ప్రార్థించిన నమ్మహాత్ముండు నానందావిర్భవంబున బులికితావయవుం
డు స్మయమానముఖుండునై శివభక్తి నిష్ఠాగరిష్ఠుల వర్తనంబులఁ జెప్పఁదలఁ
చి మునులారా, సర్వజ్ఞనిత్యతృప్త సకనసుభయనానాది బోధస్వతంత్రనిత్యా
లుప్తాత్మశక్తి నిరుపమచరితానంత కల్యాణగుణ పరిపూర్ణుండైన యమ్మహా
దేవు చరణారవింద ధ్యానంబు జేసి బ్రహ్మేంద్రాదులు కృతార్థులైరి. మఱి
యు నప్పరశివాభిధాన పరబ్రహ్మంబు సచ్చిదానంద స్వరూపుండును నిరంజ
నుండు, నిర్వికల్పుండు, నద్వితీయుండు, "ఏకమేవాద్వితీయో నాస్తి కల్పితం" అని పలికిన
శ్రుతిన్యాయంబున స్వవిలాస క్రీడావిశేషంబున "స్వేచ్ఛామాత్రేణ ప్రకృతిసృ
ష్టి" యను శ్రుతిప్రమాణంబునఁ బ్రకృతి పురుషులఁ గల్పించి తత్ప్రకారుం
డై అవ్యక్తమహదహంకార పృథివ్యప్తేజోవాయువ్యాకాశాది పంచమహా
తంబులఁ గల్పించి, తత్తత్స్వరూపుండై తద్భూతకార్యంబులైన దేహేంద్రి
యమనఃప్రాణాదికంబులను త్పాదించి తత్తద్విశేషంబుల స్థూలసూక్ష్మాది శరీ
రంబులం జేసి తద్రూపంబులు నహించి తత్తదుపాధులైన పిండాండ బ్రహ్మాం
డంబులందు స్వాంశభూతంబులైన జీవేశ్వరరూపంబులఁ బ్రవేశించి యందు
నీశ్వరోపాధివహించి సర్వజ్ఞత్వ సర్వకారణత్వ సర్వాంతర్యామిత్వసర్వప్రవర్త
కత్వ సర్వపాలయితృత్వసర్వసంహర్తృత్వాది లక్షణంబులు గలిగియుండు మఱి
యు భూతకార్యంబైన పిండాండంబులందు స్వాంశభూతంబైన జీవరూపంబు
న ప్రవేశించి బద్ధముక్తాది రూపంబుల నుండు.

నివ్విధంబున బిండ బ్రహ్మాండరూపుండై జీవేశ్వర రూపంబులఁ దదుపా
ధులఁ బ్రవేశించి వ్యష్టిసమష్టిపాలకసంహర్తృసంహార్య సర్వజ్ఞ కించిజ్జ

కార్య కారణ భోక్తృభోగ్య నియంతృనియామ్యవ్యాప్యవ్యాపకజ్ఞాతృజ్ఞేయస్వామి భృత్యధార్య ధారక రక్ష్యరక్షకత్వాది విశేషంబులఁ జేతనాచేతన బద్ధముక్తాదికృత నానావిధ నటనములు లీలావిభూతిం జేయుచు నుత్పత్తిస్థితిలయ జ్ఞానాజ్ఞాన బంధమోక్షంబు లెఱుంగకుండు మఱియు «యథోర్ణనాభిస్సృజతే గృహ్ణాతిచ» అని యూర్ణనాభి శరీర ప్రధానోపాదాన కారణంబునఁ దనయందుఁ దంతువర్గంబు సృజియించి, బుద్ధిప్రధాన కారణంబున నా తంతువర్గంబు గూర్చి తత్తంతుగ్రథనంబు చేసినగతి, నప్పరశివుండుపాదాననిమిత్త కారణద్వయ భూతుండై జగదుత్పత్త్యాదికంబు లీలావిభూతి చేసి చేయునివానిచందంబున నుండు, మృత్తిక పిండరూపంబై యనంతరంబున జలాహరణాది క్రియలకు ఘటరూపంబున యోగ్యంబై తద్వికారంబులు కార్యరూప ఘటభావంబున వికారాద్యవస్థా రహితంబై మృత్తిక యొక్కటైన ప్రకారంబున «పృథివ్యాపస్తథా తేజో వాయురాకాశ ఏవచ। సర్వేంద్రియాంతఃకరణం పురుషాఖ్యం హియజ్జగత్। సఏవసర్వభూతాత్మా విశ్వరూపోయతోవ్యయః” అన్న న్యాయంబున నానావిధోపాధుల సర్వేశ్వరుండు నలరుచుండు, సూర్యుండు జలదర్పణాదుల స్వప్రకాశ భూతప్రతిబింబమై జలాద్యుపాధివిషయమైన చలనాది వికారంబులఁ బ్రతిబింబ మార్గంబునఁ దత్తద్వికృతులఁ జెందని తెఱంగున శ్రీమత్పరమశివుండు నానావిధ ప్రపంచంబు తత్తద్రూపంబులు దాల్చి భోక్తృభోగ్యాది విశేషంబులఁ బ్రకాశింపుచుండి స్వావినాభావ సామర్థ్యంబున వసించునని బోధించి శివభక్తుల మాహాత్మ్యంబు జెప్పెద నాకర్ణింపుడని యిట్లనియె. ౧౭

మందరుండను బ్రాహ్మణుని చరిత్రము.

గీ. సకల ధనధాన్య రత్నవ • స్త్రప్రశస్త
విప్రముఖవర్ణ వేగప • ద్వీతిసమద
సామజస్యందన పదాతి • సహితమగుచు
నవనివెలయు నవంతిరా • జ్యంబుకడిమి. ౧౮

క. ఆదివ్యనగరముననొక। భూదేవుఁడు బహుపదార్థ • పూరితగేహామోదంబున దగిసకలజ। నాదరణీయుఁడయి మంద • రాఖ్యుఁ దనరెఁ. ౧౯

క. ఝంకారయుక్తుఁడై పు । ష్యంకారకు నీచబహుళ • మాగతవిత్తా
లంకార వైభవంబున । శంకారహితుఁడయి తిరుగు • సఖ్యేతరుఁడై. ౯

క. ఆరమ్య పురమునందొక । వారాంగన పౌరవార • వనితాజనతా
సారస్యము లరిపింగళ । నారూఢాఖ్యనువహించి • నైపుణి దనరెన్. ౧౦

వ. అది యొక్కనాఁడు సకలాభరణ భూషితయగుచు రాజమార్గంబున నరుదెంచు నెడ. ౧౧

క. చూచి తలయూచి మందరుఁ । డాచతురతయావిలాస • మాత్మనిడుచుమున్
నీచాతినీచుఁడైత । ద్వ్యాక్యవిక్రంసానుమతిని • వర్తిలఁ దలఁచెన్. ౧౨

క. ఆకాంతామణి పూర్వను । నైకాఁటిక పతియనయ్య • నాషిప్రుయం
జాకలిత చిత్తయద్యోఁబు । వాక్యేకవిధివశతఁదాఁటు • రాదెవ్వరికిన్. ౧౩

వ. ఇవ్విధంబున నాపింగళయను వారాంగన మందరుండును ధరామరుని రతికేళీ మందిరంబున నునిచి తత్సంపదాకర్షణశీలయై యిభబంధ, ధేనుబంధవ్యాన తకరణాదిబంధ విశేషంబుల వలనను అంగుష్ఠపదగుల్ఫజానుజంఘ ఘననాభివక్షస్స్తన కంఠకపోల దంతాధర కర్ణనాసికామస్తక స్థలంబులు కళాస్పదంబులని యెఱింగించి యుత్పలపత్ర మయూరపదగాదినఖక్షత విశేషంబులను రతిగతులను ప్రౌఢమార్గంబు నొందించి నక్తందివంబులు విషయాసక్తుంజేసి సంగీత నాట్య విద్యా నైపుణ్యంబుల సంతుష్టాంతరంగునిజేసి స్వాధీనుంగా నొనరించిన. ౧౪

గీ. ఇటుల నాతండు దానింట । నిష్టగోష్ఠి
వెలయుచుండఁ దపోధర్మ • విశ్రుతుండు
ఋషభుఁడను శివయోగీంద్రుఁ • డేగుదెంచె
విప్రుపుణ్యంబు మూర్తీభ • వించినటుల. ౧౫

శా. ఈరీతిన్ ఋషభాఖ్యనొందు శివయో • గీంద్రుండు రాఁజూచి యా
వారస్త్రీమణి బ్రాహ్మణుండు గురుభా • వంబేర్పడన్ క్షత్రవ
ర్ణారూఢింతగు కంబళాంబర వృతం • బైనట్టి పీఠంబుపై
శేరంజేయుచు భక్తిపూర్వకముదం • బ్చిత్తంబు రంజిల్లగాన్. ౧౬

క. అమ్మహనీయుని పాదా। బ్జమ్ముల సీతమ్ములైన • జలములచే నా
దమ్మున గడుగుచు నైజశి। రమ్ములపై జల్లుకొనితి • రమ్మగుమతిచే. ౨౭

గీ. కుశలము వచించి యాయోగి • కుంజరునకు
గంధ పుష్పాక్షతాదిస • త్కారవిధుల
బూజలొనరించి హృద్యమౌ • భోజనంబు
పానక నొసంగినఁ జేవార్చి, పొలిచియున్న. ౨౮

సీ. చీనిచీనాంబరా • చీర్ణమౌ పాన్పుపై
నింపుగా మునుబవ్వ • లింపజేసి
యుమగులొత్తుచునుప • ర్యావిశేషంబుల
నలరింపుచుండగ • నమ్మహాత్ముఁ
డత్యంత ముదితుఁడై • యా రాత్రి నివసించి
స్వస్థానమున కిచ్చ • జనినపిదప
నసమయమవ్విధమున • జరిగిన నవ్వేశ్య
కర్మార్జితంబైన • గతివహించి

గీ. దేహమొదలిన నశ్శుభా • దేవుఁడటుల
నంత మొంది దశార్ణదే • శాధినాథు
వజ్రబాహుని భార్యయై • వసుధ బరగు
సుమతి యనుదానిగర్భంబు • జొచ్చిపొలిచె. ౨౯

—: సుందరుఁడు దశార్ణదేశాధీశు భార్యయం దుద్భవించుట. :—

గీ. ఆసుమతి గర్భమున పూర్వ • సుస్మృతుఁడై
యుందరుండను విప్రుండు • మందవిషయ
పర్తనుండయి బహురోగ • వశతనొంది
నఘసమొందుచు జాలయి • నిలచెనపుడు. ౩౦

చ. ఎనసిన గర్భభారమున • నేచిన యాచిగుబోడి మే
న్గనుగొని తత్సపత్నులుమ • నంబుల గోపము దోప తన్మహాం
సనమొనరింపఁ జాలినవి • షంబు మెసంగగజేయ నామెయు
వ్వనట నెఱుంగక ర్రుచిర • వస్తువటంచును గ్రోలనయ్యెడన్. ౩౧

క. ఆపాద మస్తకంబుల। నాపాలతికి దానికడుపు • నందుండినయా
పాపనికి నిండబర్విన। యాపదజనియించెమేను • లలమటనొందన్. ౩౩

ఉ. ఆసతి దైవయోగమున • నవ్విషమానియు జావకన్ మహా
యాసము నొందకుండి మర • ణాగతికంటె దురంతదుస్సహం
బైసుడి జెట్టుక్లేశభర • మందుచుఁ బుత్రుని గాచి యార్తిచే
గాసిలెఁ బూర్వజన్మకృత • కర్మము దెట్టిదియా తలంపఁగన్. ౩౪

చ. స్ఫురదురు మాతృగర్భమున • బుట్టిన తత్తనయుండు భూనభోం
తరమదరంగ నేడ్చినను, తజ్జనయిత్రియు తద్విధంబున
న్మొరయిడ వజ్రకాయుఁడు న • ముద్ధతినంతయు నాలకించి వా
రిరువురి రోదనంబులకుఁ • నెంతయు విస్మితుఁ డైరయంబునన్. ౩౫

చ. జగదత్యద్భుత సత్యమార్గవిదిత • స్వార్వేద్యులైనట్టియ
య్యగదంకారుల నెల్లరాబనిచి జా • యాపుత్రు లున్నట్టినె
జ్జగృహాభ్యంతర సీమఁజేర్చి తగుపై • షజ్యంబు లిప్పించి వా
రిగరిష్ఠామయమేమి పోకనికినా • ర్తింజెంది మోహంబునన్. ౩౬

చ. ప్రతిదినమీగతిన్ జపత • పంబుల శాంతుల మంత్రతంత్రసం
గతుల విభాకరార్చనల • గైకొనుచోఁ దదుపాధి వేదనా
ప్రతిహతి కృత్స్నయోగముల • పారములై తనరంగఁ జేసిత
త్ప్రతికృతిఁ గానఁడయ్యె తొలి • బాముననేసిన చెవ్వు లెట్టివో. ౩

వ. మఱియును. ౩

సీ. ఆరాజ మౌళి దై • వారాధనాద్వివే
సిద్ధసిద్ధక్రియా • సిద్ధులెన్ని
మంత్రించ గరళస • మ్మర్దదుర్గమములౌ
రోగంబు లడగక • రూఢినొంద
గా త్రినిద్రయు లేక • రాజపత్నిదలంకి
పుత్రుబాధకు చాల • నొగిలిపొగిలి

కృశియించి దుర్దశా • వశతచే నొకకొన్ని
నెలలునుగడువనా • నృపవరుండు

గీ. వీరి రోగముమాన్పన • వ్వారి తరము
సతిసుతులు జీవమొందియుఁ • జచ్చువార
లంచు మదిలోవిచారించి • యంతకంత
వంతనొందినవారికై • చింతనొంది. ౩౯

క. ఈగృహిణీతనయులు నర। కాగతులైకానిచో మ • హారోగములన్
జోగుచు నేడ్చుచునిద్రా। త్యాగము నొందింతురా ని • తాంతవ్యథచే. ౪౦

వ. అదియునుంగాక,

క. మృతిబొందక జీవించుట। కతిశక్తులు గారువీరు • హతభోగులుగా
సతలంచెద నొక్కటి మది। నితరము దలపోయవలవ• దిట్టిపనికినై. ౪౧

ఆ. అనుచు దత్సుపత్ని • యందు తదాత్మజా
నందుఁ సక్తుఁడగుచు • నుందునృపుఁడు
దారపుత్రులనుర • థంబుపై నిడుకొని
యడవిజేర్చు సూత • యనుచు బలుక. ౪౨

క। ఆసారథి వేసారక। యాసారసముఖుని సుతుల • హాదుర్గపథా
వాసుల నతిశాసులదు॥ ర్వాసులగావించి మరల • వచ్చెన్పురికిన్. ౪౩

సీ. ప్రస్ఫురత్స్థల • ప్రస్ఫుటశ్రీద్రుక్రమ
ధ్వస్త జీర్ణచ్ఛద • స్థానమగుచు
నిర్ద్రవవ్యధ్వని • ర్నిద్ర గత్యధ్వనీ
నాధ్వజాతాయన • హారిణమగుచు
గ్రావకస్తదు • ర్మ్వస్తకోద్ఘట్టనో
చ్చైస్స్వనన్నిర్ఝర • స్థగితమగుచుఁ
గుటకోటరరటత్కు • రట్టముఖాండజపత్ర
పటపటత్కార సం • భరితమగుచు

గీ. నడరు బహుయోజనాద్వార • హార్పతిప్ర
భానభిజ్ఞమహా మృగ • స్థానమగుచు
భూతభేతాళరావ ప్ర • భూతదురవ
గావ గహనంబు నారాజ • కాంతజొచ్చె. ౪౪

వ. అదియునేలా, లవంగ, తక్కోల, గంధసార, ఘనసార, కాక,తుండ, కాంచ
నా, లికుచ, కంటకీ• ఫలః బిజ్జుల, పాటల, ఫలినీ, జటిల, గంధకా, కురంటా,
క,కోవిదార, బంధుజీవిక, దాడిమూ, శ్వకర్ణ,హస్తికర్ణ, చాంపేయ, తాలపరి
లాంగళి; సదాఫల, తమాల, నారికేళ, హింతాల; ఖర్జూర, కర్బుర, ఉత్తరికా,
శ్లేష్మాత్మకీ, విభీతకీ, హరీతకీ, భల్లాతకీ,వాక్పుష్పికా, ఖదిర, శాకోట, కాలాగ
రు, కాలస్కంధ, చించా, దుంబ, రచలదళ, శమీరుచక, కుటజాది వృక్షభే
దంబులు గలిగి సంతతాభంగ రంగత్తరంగిణి రోధఃప్రరూఢపు వేతసీకుహర
విహర దపరిమిత గండభేరుండ సింహశరభ శార్దూల భల్లూక వానరసృగాల
వృకాదిమృగ వ్యాపారంబును బహువిహగ నాదమేదురంబవగునచ్చట. ౪౫

మ. బహుధాధావదనేక భీకరమృగ • బ్రహ్మాణ్య వర్ధిష్ణునా
వహుతాశావృత తార్ణభూచిటచిట • స్వానంబుచే నుల్కుచున్
జహిహిత్వోత్సుత మస్మదభ్యవహృతి • స్థానంబివాదంచుబై
నహహేత్యుక్తుల దానవుల్ గదియుదుః • ఖార్థిన్ వడిన్ బోవుచున్. ౪౬

చ. అతివనితాంతచింత నుతుః ధాతతత్తృష్ణలచేత భీతియై
సుతునివహించి యించుకయు • సోలుచు వ్రాలుచు కాలకున్ ధరా
పతనము నొందఁ జేయుచు న • పారపుఖేదము నూనుచు న్బ్రరా
కృతమగు కర్మమొస్సి తమ • కింపుచు నూర్పులు సందడింపగన్. ౪౭

మ. పదరుక్కృత్కఠినోగ్ర కంటకశిలా • ప్రాయంపు త్రోవన్ మహా
పదఁ బొందున్ బ్రపదప్రముక్తకనమై • ప్రత్యగ్రజాగ్రద్బలో
న్మదవద్బంధుర గంధసింధుర మిళ • న్మార్గంబు గన్గొంచును
న్మదమొందున్ దరి మేరలేని పదవి • న్మల్లాడుచున్ బోవుచున్. ౪౮

వ. మఱియు.

శా. భూతప్రేత పిశాచ ఢాకినులచే • భూరివ్యథల్ జెందుచుం
యాతాయాత విలేశయంబులకు భీ • వ్యావృత్తి బెంపొంది భూ
జాతస్ఫీత నికుంజ పుంజములలో • సంచారముల్ జేయుచున్
ధూతాధూత కృశాంగి యావనములో • దూరంబుగా నేగగన్. ౪౯

క. ఘోరతపాజనగస్తం • బీరమయుత వైశ్యపదము • ప్రేమంగనిశై
వారంభ యత్నమునన౯। భోరుమహాలోచనయు జోవ • బోవగ్రామాల్. ౫౦

సీ. ధనకనక వస్తువాహనో • దంచితంబు
సమిత మణిగణ విపణిమా • ర్గాన్వితంబు
విప్ర నృపవైశ్య శూద్రవ • వీణమైన
నొక్క వైశ్యపురంబును • నుఱుటబోల.

క. ఆపురమునం గాపురమై। చూపట్టెను పద్మకరుడు • సుమహితనానా
భూపశ్రీపతికరుణ౯। రైపతియై వైశ్యకులజ • రత్నంబగుచున్. ౫౨

వజ్రనాభ రాజభార్యయైన సుమతిపద్మాకరుండను వైశ్యునియింటికి జనుట.

సీ. పూబోడి తత్పురం • బునకు నప్పుడెయై
చనియెం గృశీభూత • తనువుదాల్చి
చనిన తజ్జనపాలు • సదనంబున వసించు
నొకదాసి యారాజు • యువతివార్త
నెఱింగి యవ్వైశ్యాధ్యు • నెదుటను గొనిపోవ
నతను రుజాపీడి • తాంగియైన
నృపపత్ని వీక్షించి • నిపుణుండౌ యేకాంత
ములర శోధన్వృత్తాంత • మంత యరసి

గీ. యహాహా కష్టంబవచ్చునుది • నబ్బురంబు
నొంది నిట్టూర్పు నిగుడించి • యోగ్యమైన
తనదు గేహంబులోనన • తన్విముంచి
గౌరవంబెనయించుచు • గరుణతోడ. ౫౩

మ. మణిమంత్రౌషధ యంత్రతంత్ర ముఖ • సన్మానాద్య హృద్యద్భిష
గ్గణులన్ బిల్చి యనేకవిత్తముల సం • భావించి తత్తత్కృతా
గణనీయౌషధ జాతిఁదత్తనుగి • రోమాంచాంత యున్మోచ్యపతి
తుణమేమాం౦ శోసంగఁజేయుచుఁ దగన్ • గారుణ్యసంయుక్తుఁడై. ౫౪

వ. ఇవ్విధంబున బహువిధోపచారంబులు జేయింపుచుఁ బథ్యపానీయంబుల వల
నను జికిత్సకోపదిష్ట విశిష్టమార్గంబుల రక్షింపుచుండ. ౫౫

క. ఆ రాజపత్ని ప్రణయా। త్మారూఢార్తిఁ దనుకాంతి • నందక యుండెన్
సారంబగు రోగమునఁగు। మారుఁడు మృతుఁడయ్యె దైవ • మాయావశుఁడై.

సుమతి తనయుఁడు మృతినొందుట.

చ. ఇటువలె బుత్రుఁడీల్గిన స • హింపక చంపక గంధిశోకము
త్కటముగ మూర్ఛనొందె మద • దంతికరాహత వల్లికై వడిన్
దిటముగ నంతలోపలను • దెల్వివహింపుచు బాష్పధారమి
క్కుటమయి తత్పయోధరన • శోకమునందొరుగంగ నిట్లనున్. ౫౬

ఉ. హా యనుఁ, దన్మనోరథ సుధార్ణవ • పూర్ణశశాంకరుచ్యదే
హా యనుఁ, సర్వధూర్వహావి • హారమహారమణాంకపాళి వా
హా యనుఁ, సత్ప్రతాపతప • నాభిహతారి మహాస్తమస్సమా
హా యనుఁ, ధర్మకీర్తినివ • హా యనునస్మద భీష్టహాయనున్. ౫౭

సీ. నాథధిక్కృత ధీస • నాథమై తగునన్ను
నూరార్చఁగా నెవ్వ • రోకుమార
పత్మనీ హితనన • పత్యమై తగునన్ను
ననునయింపఁగ నెవ్వ • రాత్మజాత
కాంతనిష్కాసితై • కాంతమై తగునన్ను
గడఁదేర్చ నెవ్వరు • గలరుపుత్ర
ప్రియనిరాకృతపథా • ప్రియమైతగిననన్ను
సలరింప నెవ్వరో • యనుఁగుతనయ

కాలమునఁ గార్శ్యము వహించి • కడఁగివాస
నావశత నిద్దురించు వి • న్నాణముగను. ౬౩

క. వినుసత్త్వాదిగుణంబులు। ఘనమాయాజన్యమాన • గతినివహించున్
జనువులు తద్గుణములచే। జనియించును దద్గుణప్ర • సక్తము లగుచున్. ౬౪

గీ. సత్త్వగుణమున దేవత్వ • సంజ్ఞఁ జెందు
నలరజోగుణమునమను • ష్యత్వ మొందు
నతితమోగుణమునను తి • ర్యక్త్వమునయు
వసుధజంతువు వాసనా • వశతఁ జేసి ౬౫

గీ. జంతువు వివర్తమానసం • సారమునను
ముందుఁ గర్మానుబంధనం • బునఁ దలిర్చి
దృష్టసుఖదుఃఖ మయమునై • దుర్విభావ్య
మైన గతిని వహించునా • నద్భుతముగా. ౬౬

సీ. కల్పాయువును దగ • గలదేవతలకైనఁ
గలదపాయము మహా • కల్పమునను
వరకర్మ బద్ధులౌ • నర దేహులకుసిద్ధ
మౌ నపాయంబిందు • కరుడ లేమ;
తెలియక కొందఱ్ • దేహంబునకుఁ గాల
మే హేతువేయని • రిందువదన;
యొలమిఁ గొందఱుకర్మ • మే యంద్రు కొందఱు
గుణములు నెంచిరి • గణుతిఁ జేసి

గీ. కాలకర్మ గుణ ధార • గతినిఁ బూని
పంచభూతాత్మకంబయి • పరఁగుతనువు
పుట్టుటయుఁ జచ్చుటయుఁ జూచి • మోహశోక
ములవహింపరు పండితుల్ • జలరుహాక్షి. ౬౭

క. అవ్యక్తమున జనించు। నవ్యక్తంబునన శింపు • నవ్యక్తమునన్
సువ్యక్తగుచు జంతువు। భవ్యజలంబునను బుగ్గ • దగిది దలంపన్. ౬౮

గీ. ఎప్పుడు గర్భస్థుఁడో దేహి • యప్పుడె నాశ
నంబు కల్పితమయ్యెసి • కర్మంబుగాఁగ
దైవ వశతను జీవించు • దైవవశత
మరణమొందును జంతువీ • ధరణిలోన. ౮౮

సీ. ఉదరస్థులైకొంద • రుదయించి కొందఱు
ముదియక కొందఱు • ముదిసి కొంద
ఱంతంబు నొందుచు • నలపురాతనకర్మ
గతి యెట్టిదో యట్టి • గతి వహించు
దేహంబుఁ బొందిత • ద్దేహానురూపంబు
లగు సుఖదుఃఖాదు • లనుభవించు
మాయానుభావప్ర • మాణంబుచే స్త్రీలు
పురుషులు సురలును • భూతకోటి

కలసియుండిన దైవయో • గమున జంతు
వుదయమొందుచు సమ్యగా • యువును సుఖము
దుఃఖమును పుణ్యపాపంబు • దోడ నశాస్త్ర
ధనములను బొందుచుండును • ధాత్రిలోన. ౮౯

గీ. వనజభవుఁడు లలాటంబు • లను లిఖింప
తదనురూపంబుగా దేహి • దనరుచుండు
కాలకర్మంబు లవిలంఘ్య • గతి వహింప
భావముల నిత్యములు దుఃఖ • పడగ నేలా. ౯౦

గీ. స్వప్నమున సౌఖ్యమెక్కడ • సమ్యగింద్ర
జాలమున సౌఖ్యమెక్కడ • శారదాభ్ర
మునకు నిత్యత్వమెక్కడ • తనువులకును
నిలుకడెక్కడ లేదని • నిశ్చయింపు. ౯౧

క. *శతకోట్యాయుతసంఖ్యా | మితజన్మంబుల నతిక్ర • మింపఁగ నా శా
శ్వతపరతత్త్వం బెఱుఁగమి | సతి నీకి భ్రమ జనించె • సాధ్వీనమొసఁగఁగ.

* శతకోట్యాయుత మని అచ్చుప్రతి.

## — శివయోగి సుమతికి మహాదేవుప్రభావంబు బోధించుట —

సీ. సకల జగత్సాక్షి • సర్వేశ్వరుఁడు పరా
త్పరుఁడు సాక్షాత్పర • బ్రహ్మతత్త్వ
రుండే శివవరు [ బ్రోనద్వితీయోస్తి
తస్మాత్త నందగు • ధన్యమూర్తి
బ్రహ్మాధిపతియని • బ్రహ్మణోధిపతిశ్చ
యని శ్రుతుల్ బలుకున • య్యముదలిర్ప
మఱి శంభురాకాశ • మధ్యేయనుచు విశ్వ
తశ్చక్షువని శ్రుతుల్ • దవిలిచాట
గీ. యఃపరస్స మహేశ్వర • యనుచు నజుఁడు
నిత్యుఁడును శాశ్వతుండును • నిర్గుణుండు
ననుచు బహువిధముల శ్రుతుల్ • మునువచింప
నతఁడు నిత్యస్వరూపుఁడై • యలరుచుండు. ౭౫

సీ. సర్వవిద్యలకు నీ • శానుండె యధిపతి
సర్వభూతములకీ • శ్వరుఁడె కర్త
యాఢివిశ్వాధికో • రుద్రయంచూర్ధ్వరే
తంవిరూపాక్షమం ( తన్నుఁడైన
యాత్ముఁడు నద్వితీ • యస్వరూపుఁడు శివ
మద్వైత మనుచు వే • దాంతనికర
మొప్పుడు వచియింప • నీశుఁడు సర్వోత్త
ముఁడని శ్రుతు • లొనరబల్క
గీ. సర్వలోకంబులకుఁ బత్తి • సర్వవ్యాప్తి
ము లకుఁ [illegible] • [illegible]
[illegible]
నతఁడుగాక తలఁ ప్రడీ • యువనిఁగలఁడే. ౭౬

సీ. ఉర్వీఁగాలాగ్నిరు • ద్రోపనిషచ్ఛ్రత
రుద్రీయములు ముందు • రుద్రుఁదెలుపు
శ్వేతాశ్వతరమును • స్కాతసంహితయును
హాదేవుఁడే దేవుఁ • డనుచుఁబల్క

నైవల్య మును లస • త్కఠవల్లియునుబర
శివుఁడె బ్రహ్మంబని • చెప్పుచుండు
ఘనబృహ దారణ్య • కంబునారాయణ
ప్రశ్నంబు నభవుండు • బ్రహ్మమనుచు

సీ. వేదపాదస్తవంబును • విశదవృత్తి
శింశుమార స్తవంబును • చెప్పుచుండు
వామదేవుని శిరమధ • ర్వశిఖశిరము
శంకరుండపరుండని • చాటుచుండు. ౮౦

క. యోగీశ్వరేశ్వరుండని। యోగతివాయువ్యసలహి • తాప్తావింశ
త్యాగమము లెవ్వనిమహా। భాగుండని వినుతిసేయుఁ • బరమప్రీతిన్. ౮౧

క. గాయత్రియు జాబాలము। నాయత వేదాంతములుని • రాకారశివ
స్వాయత్తత్వము దెలుపున్। వేయననేటికి శివుఁడు • విశ్వమయుఁడగున్. ౮౨

ఆ. పురుషసూక్త మెవని • బోధించు బ్రహ్మాది
దివిజులెల్ల నతని • దివ్యపాద
కమలములను గొలఁచి, తనుతను నెలవులఁ
జెలఁగుచుండు రదియు • జెప్పనేలా. ౮౩

సీ. అవ్యయ నిర్వికా • ల్పాద్వితీయబ్రహ్మ
మనుధ్యాన మొనరింప • దనరునినుచు
దత్స్వరూపావస్థ • తత్వంబు జెన్నొంది
పగుణుఁడై విలసిల్లు • శంకరుండు
దేవుండుగాన త • ద్దేవుని కిష్టమై
ధన్యమౌ రుద్రాక్ష • ధారణంబు
రవ్యవిభూతిధా • రణమును దగియుతం
డధిపతిగానన • య్యధిపుఁడలరఁ

గీ. దాల్చులక్షణములను శి • వ్యభక్తులైన
జనులు ధరియింపవలయునీ • జగతిలోన

విప్రముఖజాతులకు భక్తి • విభవములర
దాల్ప వలయునటంచు వే • దములు పలికె. ౮౫

చ. అతని విభూతి వేదములు • నర్థముల్ గ్రతువుల్ వ్రతంబులున్
శతధృతియున్ బ్రభాకరుఁడు • చంద్రుఁడు పేంద్రుఁడు నింద్రముఖ్య ది
క్పతులును సిద్ధసాధ్యులును • పర్వులు తారకలున్ గ్రహంబులున్
యతులును యక్షరాక్షసులు • నంతయుఁ దద్విభవంబు నందగున్. ౮౬

క. సతత చతుర్ముఖ ముఖ దే। వతలు పసులుగాఁగ నతఁడు । పశుపతిగాఁగన్
మతిఁదలఁపనిది పశూనాం। పతియేనమ యనుచు శ్రుతులు పలుకఁగవినవే. ౮౭

క. అదిగాన నీవు భ్రాంతిని। వదలి మహేశ్వరుని భక్త • వత్సలుని శివున్
ముదమున నెమ్మదిలోపలఁ। జెదరక యారాధనంబు • చేయుము భక్తిన్. ౮౮

క. అని యివ్విధమున శివయో। గి నిబోధితయగుచు రాజ్ఞి • కేల్మోగిచి తద్భ
క్తినిబద్ధబుద్ధిఁ దత్పద। వనజంబుల మీఁద వ్రాలి • పలికె వినతిచే. ౮౯

క. స్వామీః మృతపుత్రత్వం। బామయము సదేష్ణబాంధ • వాభిభవమునన్
వేమరు గలిగింపక నిక నా। మరణమె కానితనకు • నన్యమెయుంగన్. ౯౦

గీ. కాననీతనయునితోడ । మేను వోరగి
నినుభజించి కృతార్థత • నెగడుననుచు
దవిలి మరణోన్ముఖత్వంబు • దాల్చునతివఁ
గనుచు శివయోగి నెమ్మది కరుణదోఁప. ౯౧

సీ. స్మరోపకారంబు • స్మరణించి మృతుఁడైన
బాలుని కడఁజేరి • భవ్యమైన
భస్మంబు శివమంత్ర ; భావితంబుగఁజేసి
వివృతమౌ తద్వక్త్ర • వివరమునను
ప్రసరించ మృతుఁడైన • బాలుఁడప్పటియట్లు
కన్నులు తెరచి త • త్కారుణచేత
*సర్వేంద్రియస్ఫురత • జరుఁగ గస్తన్యంబు
నకు రోదనము సల్పి • నంతవేగ

* ప్రాప్తసర్వేంద్రియ పటిమ జెలఁగుచు స్తన్యమునకై రోదనము సల్పినంతవేగ తాఁ ప్ర

గీ. మృతుఁడగుచుఁ బునరుద్ధాన • + మొసఁగెననుచు
వైశ్యపురమున నివసించు • వారలెల్ల
విస్మిత స్వాంతులై వచ్చి • వెరగునొంది
మించు నమోన్మాదమున నివ • సించియుండె. ౯౨

గీ. అప్పుడానంద రసవిహ్వ • లాంగియగుచు
దనయునిఁ గ్రహించి శ్వాస్వసం • తాననేత్ర
యగుచు నాలింగనముచేసి • యతిముదాత్మ
నలరి తన్ను నెరుసెరుంగ • దయ్యెనంత. ౯౩

వ. మఱియు నావృషభ శివయోగీంద్రుఁడు నారాజపత్నీ తత్పుత్రుల విమ్రవ
ణావృతంబులైన శరీరంబులఁ దద్విభూతి స్పృశించిన నయ్యిద్దరు దివ్యతనువుల
ధరించి బహుపుణ్యకర్మంబుల యేదేవతైశ్వర్యసుఖంబు గలదో దానికంటె
శతగుణంబుగల సుఖంబునొంది యమ్మహాత్ముని పాదపద్మంబులపై వ్రాలి నస
తుండెత్తి! యోరాజపత్నీ; నీవు బహుసంవత్సరంబులు జీవింపుచుఁ దాపంబు
నొందక జయంబు జెందఁగలవు. నీకుమారుఁడు భద్రాయువను నామంబు ధరి
యించి నిజరాజ్యంబు పాలింపుచు ఖ్యాతినొందగలఁడి వైశ్య గృహంబున సక
లవిద్యలు గ్రహించి యవ్వనాభిరాముండగు పర్యంతంబు నిల్పఁదగునని వచిం
చి యా యోగీంద్రుఁ డటఁగెనని సూతుండిట్లనియె. ౯౪

క. ఏపూర్వంబునఁ జెప్పిన • నాపింగళ కృష్ణపింగ • ళాఖ్యశివార్చ
ద్దీపితమై తొలుతను ని! ర్వాపణమొందంగఁ బుణ్య • పరతఁదలిర్పఁ. ౯౫

—:సుమతియొక్కయు దత్పుత్రునియొక్కయుఁ బూర్వజన్మ వృత్తాంతము:—

సీ. చంద్రాంగదుండను • జనవల్లభుని భార్య
యైన సీమంతిని • యనెడుసాధ్వి
కుదయించి ప్రతిదినా • భ్యుదయరూపౌదార్య
సుగుణ గణోపేత • సురుచిరాంగి
యై కీర్తిమాలిని • యనునామమున భూమి
వృద్ధిబొందెను గుణ • వృద్ధులెన్న
భద్రాయువును వైశ్య • పతితనూజుండు న
య్యంబుజ ఫ్సు నిప్రతి • బింబములన

+ మొనసెననుచు తా. ప్ర

గీ. సొంపుజనియింగ వైశ్య • సూనుఁడెలమి
సునయుఁడను పేరఁదగుఁ రాజ • సుతునితోడ
జెలిమిఁ గావించి రత్నభూ • షలధరించి
క్రీడసల్పుచునుండిరి • వేడుకలర. ౯౩

క. ఆవైశ్యాగ్రణి ఘనభూ। దేవగ్రామణులచేను • దీర్ణప్రతిభా
భావిభవ గాత్ముతనకుయ । థావిధి సంస్కారములను • దగనొనరించెన్.

క. ధనధాన్యాంబర మణిగణ ఘనుఁడై తగువైశ్యవిభుఁడు • కడువేడుకరా
ట్తనయుని నిజపుత్రాగ్రణి। సునుగురుశిక్షాపలంబ • ముఖ్యుల జేసెన్.

వ. మఱియు సర్వజ్ఞులైన దేశికులవలన యక్షరలక్షణగణిత గంధర్వాలంకారేతిహాస న్యాయమీమాంస నీతిశాస్త్ర పురాణాగమజ్యోతిశ్శాస్త్ర స్త్రీలక్షణ పురుషలక్షణ కన్యావాద ఏమవాద రసవాద ధాతువాద మాయావాద క్షుత్రకర్మాశ్వవైద్యగజవైద్య యింద్రజాల మహేంద్రజాల గజకర్ణ గోకర్ణ తృణావధాన శస్త్రావధాన ఘంటావధాన భ్రమణ మోహనోచ్చాటనా ద్వేషణాకర్షణాంజనాదృశ్య కరణి భృగుమతభేతాళమత కావ్యలక్షణ వాస్తుశాస్త్ర నీతిశాస్త్ర ధనుర్వేద రథారోహణ శిబికారోహణ యోగశాస్త్ర భరతశాస్త్ర మోహనస్తంభన ఖడ్గస్తంభన ఆపస్తంభన ఘుటికాసిద్ధి మంత్రసిద్ధి ఖేచరగమనపరకాయ ప్రవేశంబులను విద్యలనెఱిగించి అసిముసల కంపణకాయ భల్లభిండివాల కోదండ శరచక్ర కుంతకుఠార పరశుపట్టిసగదా ప్రాసతోమర ముద్గరలాంగలత్రిశూల ఛురికాంకుశాద్యాయుధ విశేషంబు లభ్యసింపఁజేసి యున్నంత. ౯౬

సీ. తలముల్లు మెడనూళ్లు • * దండచేకడియముల్
బిగువాళ్లు రుల్లతాళ్ళు • బిరుసందన ము

* దండకపింపులు — అచ్చుప్రతి — ౨ ఘనశితి శుక్ల ప్రకాండజముల సతులవరాహ దంష్ట్రాతతోద్భవముల మానితి బహువిధనానా కర్మముల గరములఫ్రాని సంఘను వ్యాగ్రాహ్యములుగ జెంమువాండ్రు మాదంబెదమింమదనాడ — రాట్సుతాలోకలాలనోల్లాస మమరఁ నేగుదెంచి తదాజ్ఞచే నేముటనిలచి.

గండపెండేరముల్ • కటినంపు గొలుసుల
దగిలిన శునకముల్ • జిగురుగండె
లలరెడు తడకలు • నడ్డంపు పందివా
టులు వలలునుసురి • యలునువంక
కత్తులు శూలముల్ • ఖడ్గముల్ పట్టిన
ములుకుంతములు భల్ల • ములు తెలంగ

గీ. కటకుమీసాలు కెంజెన • సరకుసేయు
గాత్రములు శోణనేత్రముల్ • కప్పువలువ
కాసెలును గండ్రగొడ్డండ్లు • గలిగిచెంచు
వాండ్రు జనుదెంచి రయ్యెడఁ • దీండ్రముగను. ౧౦౦

సీ. వరరక్త సితవర్ణ • వంశోద్భవంబులఁ
బీతవర్ణేక్షుసం • జాతములను
గురుకద్బురద్యోత • కుంభి కుంభస్థల
నీలవర్ణాహిస్ఫు • టాలయముల
జ్యోతిరుగంబుము • క్తాతసంభవముల
శ్యావద్యుతివరాహ • జన్యములను
ఖర్జూరదీప్తి శం • ఖసముద్రితంబుల
మహితగౌరప్రభా • మత్స్యజముల

గీ. కలితదీధితి శుక్తి • ప్రకాండజముల
కరములనుబూని ముందు • పగ్రాహ్యములుగ
రాజదర్శన లాలసోల్లాస • మలర
నేగుదెంచి తదాజ్ఞచే • నెదుటనిల్చి. ౧౦౧

క. నతికి జోహారొనరించిరి। పతికిన్ వితరణగుణునకు • భాస్వన్మతిగీ
ష్పతికిన్ ఘన తేజోహ। ర్పతికిన్ సతతాభియాతి • రాజవిజితికిన్. ౧౦౨

వ. ఇట్లు మ్రొక్కి నిలిచి. ౧౦౩

క. జేజేజేజేసామీ। యాజేజేరేనివలె నో • యారంబలరం
గాకనములఁ బాలింపుమి మా • జీవములీవసుమ్ము • మానవనాథా. ౧౦౪

చించిన. ౧౦౫

గీ. వారిఁ గన్గొని మన్నించి • మీరిచటికి
నేమికోరిక వచ్చితి • రెచటనుండు
వారు మీ పేరు పెంపు నే • ర్పాటుగావ
చించుడనఁ బల్కె • నందొక్క • చెంచు తేడు. ౧౦౬

సీ. చెలువగుబ్బలిని ని • చ్చలువసింపుచునుండి
తిత్తిగొండమీఁదని • త్తితిఁజరించి
చుట్టుగొండ మొకాలఁ • జుట్టుకొంచు మొలంగి
జాళువాతిప్పపై • జాలువారి
వెండి మెట్టనుజుట్టి • వెండియు విహరించి
సిరిగంధపుఁ గట్టు • సిరిహరించి
ప్రొద్దుపొడుపుమలనే • ప్రొద్దుసంబరమంది
గ్రుంకురా పైనీటఁ • గ్రుంకుచలమి

గీ. ఇంపుగల సొంపుటడవిని • ద్దంపునడక
లడర నాడాడ దిరుఁగుచు • నవనినాథ
నిన్నుఁ జూడఁగని పెనుమొకా • లున్నచోటు
దెలియ వచియింపవచ్చితి • మలవుమీర. ౧౦౭

గీ. అయ్య వైవస్వతకులంబు • నందుఁబుట్టి
శ్యామ శబలంబు లగుచును • ద్దామబలము
గలుగు కుక్కరంబులిగంపు • తులకు రాక
దక్కినవు దిక్కునవసించె • నుక్కుదక్కి ౧౦౮

గీ. దేవరా, క్షేత్రపాలక • దేవుఁడొకఁడు
భవక మీగంగ గన్గొని • పారిపోయి
యెచటనుండెనొ కానిమా • కెర్కలేదు
తెలియఁజెప్పెద వీసిఁ స • త్తుల్లసుజగతి. ౧౦౯

క. * బూసులరాయఁడు తొలిమా। వేసాలదరించినాల్గు • వేపులగాఁగం
జేసెఁదొలిపలుకులనుమా। వాసిగలుగు పిచ్చితోడ • వశిబోరంగన్. ౧౧౦

ఆ. సామి కొలనిచుట్టు • చక్కని యడవిలో
చెంచువేసమూసి • సిరిమగండు
దిరిగెఁ దానిచుట్టు • డెగలేవి వేటు వే
మెకము లలరుచుండ • మేకొనుండు. ౧౧౧

క. • ఈమృగయాకుశలము నా। నామృగముఁ జంపజూచి • నలినశరహరున్
సోమని సమాశ్రయింపుచుః నామృగము లు బ్రతికియుండె • నటదలపోయన్.

క. అనిపల్కి నొక్కశబరుం। డనుమోదముతోడ దేవ • రా చూచితెయా
వనమృగ గండరబిరుదాం। కనమానఁదగు కుర్కురమును • గాతలక మలరన్.

గీ. దేవ యాభైరవుఁడు మించి • సాహసమున
బొమ్మదేవర మెరగుల • పుట్టబట్టె
దేవతలు నీవతలు గడ • దేరలేరు
మానవులు నీనవులు నెంత • మానవేశా. ౧౧౪

సీ. ఈమృగదంశకం • బేచిన గండభే
రుండంబు నైనను • బెండుపరచు
నీసారమేయంబ • నేకంబు లైనట్టి
బొల్లినోటి మెకాలఁ • బొలియ జేయు
నీకుర్కురంబు వ • న్యేభంబులను గిట్టి
కుంభస్థలాస్రంబు • గ్రోలివచ్చు
నీభషకంబుల • నోంక్రవజంబులఁ
తుస్సులుగా జేసి • తొంగలించె

గీ. నిదియుఁగాఁ జెప్పుఁ డనుపేరఁ బొదలుచుండు
నిదియు పోలమరాజన • మదమునొందు

* బూసులరాయెడు తొలిమా। వేసాలదరించివాల్గు, వేపులచేవ। బ్యాపంచరుఁ డయ్యెనుమా
తొలిపాటికిరాక కొండ పొవలోదాగన్. తా. ప్ర—
• క. ఈమృగదంశకముల అచ్చుప్రతి.

నిదియు నాపోతు లింగడన్ • పసవినొందు
నిదియు మనుబోతులకు మిత్తి • యులదలంప. ౧౧౫

కం. అరపదిమోముల వేలుపు। టూకవు జిరాదాద్రిపైన • యొడయడవగునీ
సరియేటిక మాసెంచుల। పగిసైతము గాగరమున్ • పాద్దివముఖ్యా ౧౧౬

సీ. తడ్క వేటకుబంటు • తగినయీ పాపడు
నాలులకు దిట్టయీ • చిఱుతవాఁడు
జోనులు చేఁబట్టి • పొదలుకీ బుడుతండు
వలవేయ నేర్పరీ • కెలనిపట్టి
పందివాటుకునేరు । పరియయ్యె నీకందు
చిల్లనమ్ము బలితుండీ • చెంతకూన
బొట్టకోలలమొకం • బులఁగొట్టు నీబొట్టె
జంజాళి దాళ్ళుయీ • జంటకుఱ్ఱ
గీ. మొదలకుండంగ తెఱనోటి • మొకమునైన
పట్టిపల్లాస్సు నీచిన్న • వాఁడు సామి
మాకులంబునఁ బుట్టిన • మగతనంబు
గల్లువారెల్ల మునువేట • కాండ్రుదలఁప. ౧౧౭

కం. అనిపల్కిన వినయోక్తుల। మనమునహర్షించివారి • మన్నించిప్రత్తా
పనిరూఢి వేట తమకము। జనియించిన రాట్పుతుండు • చయ్యన లేవన్. ౧౧౮

కం. గరికిజిగినీ దగినజిరా। నరుపుసధరియించి • తత్త్వ • దాచిత్యగతి
స్ఫురణంబున సొంగుకయి। స్మెరయఁగ సొంగుమని శబర • నికరముపొగడన్.

ఉ. శ్రీపగులెల్ల సుల్లసిల • చూడ్కికివేడ్క జలంకపంకజా
ద్దీపిత వామపాదముధృ, తిస్వపనీయ పుటంకవన్నెపై
స్థాపనజేసి సవ్యకర • సంస్థితినాయము లుల్లసిల్లగా
జ్యాపరమేశ్వరాయనుచుఁ • జంగననెక్కెఁదురంగపుంగమున్. ౧౨౦

కం. వినయజ్ఞుఁడైన సునయుఁడు। దనకుఁ సహాయతవహించి • ధారాశ్వమునన్
దన్నరిచను దేరఖాద్యా। దినివహామ్రలరంగ దివ్య • తేజుండగుచున్. ౧౨౧

వ. ఇట్టుల వాహ్యాళి సముత్సవంబునకో హటించి, చటులభాసురచంద్రహాస ప్రాసశరాసన భిండివాల కరవాలతోమర పరశుపట్టసకుంతశూల ముద్గరగదాది సాధనంబులడర, తద్బలసహితుండై, గిరిసరిదుపవన జనపద దుర్గంబుల నిర్గమించుచుఁ దత్పుళింద సైన్యకలకల నినాదాకర్ణ నేతస్తతః కుంజపుంజంబుల నరయుచుం జని ముందట. ౧౨౨

సీ. ఉడుపథోత్క్రమణశా • ఖోపశాఖాశిఖో
త్కటజటాపటలవ • త్కుటసమూహ
ముభయ తీరప్రపా • తోల్లలత్కల్లోల
గుంభశుంభత్సరో • జృంభణంబు
సన్నోన్నస్త్ర జన్యక్ష్మ • ద్ధర్యక్ష వీక్షణ
క్షరదద్భ్ర తతరక్షు • సంచయంబు
నమిత శుండాదండ • హాతదండ సంతాన
ధానదుద్దండవే • దండనికర

తే. మమిత సంప్రౌఢ కుటజకు • సుమసముదయ
మత్త్యుదార తరుజమనో • హరఫలంబు
లమరవర్యులకునుజ్జొర • నలవిగాని
గహనమయ్యెడఁ గనుగొని • మహివిభుండు. ౧౨౩

సీ. హారాయితోభయ • ద్వారసిలాసమా
సక్తముక్తాలోక • సమద సింహ
మతివేల మదపూరి • తాశేష నిర్ఝర
బింబితాత్మోరుకుం • భిప్రకాండ
మనుగళద్ఘోరదం • ష్ట్రానీల నఖముఖ
దారితముస్తాత • టోరుకోల
మగణిత నగభేద • నాభంగ తరశృంగ
సంఘటితాటవీ • సైరిభచయ
గీ. మహసమాంస్రాభనఖరసం • చనఖఖడ్గ
గంధ గంధర్వశంబర • బంధురతల
మగుచు నగభేది పానుసి • వెగడి నిగుడు
నిపిన మార్గంబు గనుగొని • నృపవరుండు ౧౨౪

లయగ్రాహి

నింగిదవులం జివురు • లంగదరు నూషలప
యింగదియు భృ • గములభంగ రుతులన్నా
రంగములుముంగల మె • లంగెడులవంగముల
చెంగట వొరంగునన • లంగొమరుమై గొ
జ్జంగుల జెలంగెడు వి • హంగముల భంగుల గ
నుంగొనుచు నానృపతి • పుంగవుఁడు రాశి
వ్వంగులు కురంగులు కు • ళుంగములు శింగములు
చంగున నలుంగడల • కుం గదలిపోవన్ . ౨౨౫

వ. మఱియును నాగరాజస్థితి యనందగి యనంతమూలాధారమై కల్పవేళ యనంద గియేకకాలోదితానేకార్కవిరాజితమై సుధర్మ యనందగి స్వచ్ఛంద కౌశికమై, సత్పురుషసేవ యనందగి శ్రీఫలాఢ్యమై భారత సమరభూమి యనందగి ప్రరూఢార్జునమై, సజ్జనసంపద యనందగి వికసితాశోక పున్నాగసరళమై, శిశుజన లీలయనందగి ధాత్రీకలాపమై రాఘవ చిత్తవృత్తి యనందగి వైదేహీ ప్రమోదమై క్షీరసముద్ర మథనవేళ యనందగివిజృంభమాణామృతమై, లంకాపురియనందగి బహుపలాశ సేవితమై, సుగ్రీవసేన యనందగి పనసనల కుముదభాసురమై, సువాసిని యనందగి సింధూరతిలక ప్రవాళాభరణ భూషితమై, కురుసేన యనందగి ధార్తరాష్ట్రోలూక శకుని సనాథమై, భీమకలహభూమి యనందగి కీచక నికరోపశోభితమైన• వింధ్యాటవిం గనుంగొని నల, నలద, నళినీ, నిచుళ విమలబిల్వ, చిరిబిల్వ, బహుళంబును, ప్రచురపిచ్ఛిల రంభాభిరామంబును వివిధోట జకుట జరుద్ధోప కంఠంబును వితత చూతప్రతతి వాతావరుణ తరుస్కంధ సన్నద్ధ భృంగగేయంబును, గోలాంగూల భగ్నగళన్మధుఫలిమాధురసా సారసిక్త తరుతలంబును నారికేళ కంకేళి తాళీ సాలహింతాల తమాలలవలీ వకుళపూగ పున్నాగ నాగకేసర ఘనసార గంధసార కోవిదార ఖర్జూర మందార బీజపూర జంబీర మల్లికా కేతకీ కుందబృందంబును దాత్యూహ వ్యూహ కుహూకుహూరావ భరిత నదీతట నికట నికుంజంబును బుంజితోత్కంఠ కలకంఠాధ్యాసిత సహకార పల్లవంబును పరాగపుంజ పింజర సింధువారమంజరీరజ్యమాన మధుకరమంజుశింజిత జనితముదంబునులవంగలుంగ చంపకమధూక లోధ్ర కర్ణికారకదంబ కదంబకంబును జటకసంచార్యమా•

ణ చటులవాచాట చాటుకైరక్రియమాణ చాటుసమాచరిత చంచుచరణ చతుర చకోరకంబును కిరాతరమణీవక నిర్దిష్టమష్ట బలాకా కుటుంబినీ నిరీక్ష్యమాణస్థ విరళబర కుంజాంతరంబును శైలేయవాసిత సుగంధి శిలాతలసుఖశయిత శశకంబును, సవిధగిరిశిఖరంబ నిర్ఝర నినదశ్రవణ నిద్రాణానంద మందాయమాన కిరణంబును, తదాసన్న కిన్నరీగీతాకర్ణనరమమాణరురునికరంబును కులిశఖర నఖరప్రకర ప్రచండ పరిపాటిత మత్తమతంగ ముదచ్చటాచ్ఛాత చారుకేసరభర భాసుర కేసరి విసరంబును అగు తద్వనంబుఁ బ్రవేశించి మహాభుజంగమంబు చందంబునఁ బ్రవేశించి సదాగత్యభిముఖంబై సరిత్పతి యనందగి శుక్తిశోభితంబైన వింధ్యవనంబున వెలసి శ్రీవృక్షలాంఛితంబై హంసంబనఁదగి మానసగమనంబై హరిత్తురంగంబనఁదగి చిత్రభానూర్జితంబై తనరు తనయుత్తమ తురంగంబును నాస్కందిత ధారిత రేచిత వల్గిత ప్లుతాదిగతుల సమపించుచు. ౧.౨౭

సీ. తొవలరాయిడికాని • తొలుసోకుసోకని
చిగురుటాకులకింతి, చెలువుజూప
డెలిపాక ఝోకల • లలిడాలు పేకల
నలరారు నినుకది న్నెలు మెలంగ
నొకటిపై నొకటి నుం • టుకయున్న సన్నంపు
కొమ్మల దొమ్ములు • నెమ్మిఁజూప
నప్పటప్పటికార్లి • దిప్పరంబుగ వచ్చు
కప్పురంబుల పొదు • లొప్పఁజూప

గీ. సుమసమూహంబులను జాచ్చు • జుమ్మనుచును
జమిల ముక్కాలు చాలుపుల్ • సందడింప
బొదలఁ బొదలుచు సిద్ధుర • నొదిగియున్న
మిన్నమొకములఁ గనికదా • సన్నఁడగుచు. ౧.౨౮

సీ. శింజినీరవముచేఁ • జెప్రలు చింపర రేగ
కొండలంబం దెడు • కోలములును
తురగఖురోత్పన్న • ధూళికన్నులఁగప్ప
దల్లడింపుచునుండు • భల్లుకములు
తరవారిదీప్తులు • మిరిమిట్లు గొలుపంగ

గజిబిజి నొందెడు • గజచయంబు
శరపాత వ్యథ్వసుల్ • తరుచుగాఁ దోచిన
పరపర లైపోవు • వారణములును

గీ. చవ్వుచవ్వున వడినార • సములు బాఁగ
దవ్వుదవ్వున జనుమ్మృగా • దనగణంబు
కర్కరీముఖ సుశిలీము • ఖములు గడఁగ
నార్తి నొందున వార్యహా • ర్యతతములును. ౧౨౭

చ. కెలఁకులఁ జేరిచేరి శర • కీలిత గాత్రతఁ బారిపారి ప
ల్వలములఁ దూరి తూఁగిబలు • వత్తను వైఖరిఁ గేరి కేరి పె
న్మలకల మీఁరి మీఁరి చల • సంభ్రాగి లేకనుఁ దేరి తేరి పె
బ్బులులు నృపాలు బారిఁబడి • పోవక చావక యున్కి చిత్రమే. ౧౨౮

ఉ. సందులఁ బొంచి డెక్కతుది • చప్పుడులన్ బరికించి పూఁబొదల్
[illegible]దరిఁగా[illegible] తత్కుహర • ముద్రిత మూలము లన్నంచి శ్రీ
చందనముల్ హరించి మును • సత్వము లేమిదలంచి యొక్కఁడా
పందులు మించిపోకనని • పైబడుటల్ వివరింపశక్యమే. ౧౨౯

చ. ప్రదరోత్పాటిత కుంభసంభవమణి • ప్రచ్ఛాదితాస్యంబులై
మదమాతంగము లొక్కపెట్టున మహా • మందారబృందోల్లస
త్పదనాంతస్థితితో గసత్వములని • స్సారత్వ మొందింపుచున్
బొదలంగన్గొని భూభుజుండ దరిసెం • పూర్ణప్రతాపంబునన్. ౧౩౦

సీ. కరవాలములు దుండ • చరణముల్ నరికినఁ
గుంభినీస్థలిఁబడు • కుంభిచయము
మండలాగ్రంబుల • గుండియలవియింప
ధారిణినొరగు కం • ఠీరవములు
నారాచముల మెడల్ • నఱికిన భూమిపైఁ
బొరలాడుచుండెడు • వారణములును

క్రూరమార్గణములఁ • దూరుపెట్టినఁ దన్ను
కొని నేలఁ బైఁబడు • కోలములును

గీ. సాయకంబులఁ బడుచిత్ర • కాయములును
కాండములఁ దెగుగండభే • రుండములును
గలిగి యాకీతి రక్తసి • క్తంబులైన
భూతలంబులు గావించి • భూభుజుండు. ౧౩౧

గీ. వేటచాలించి యవ్వన • వాటిలోన
నొక్క యెలమావిగుంపులోఁ • బక్కఁ జేని
మానికంబుల తిన్నెపై • సూనశయ్య
యలరియుండుట • గన్గొని • నెలవుఁ జేసి. ౧౩౨

వ. ఇటుల విశ్రమించి పోటుమానసులగు వేటకాండ్ర వేటాడ నియమింప వార లుక్కుమిగిలి మగటిమి పెంపొంగ తెగయు వెలుంగ బెగడని మృగంబులఁ దగిలి మిగుల వగల నొగిలించి యారియలు వరువులుగ నొరుగు మెకముల మొరగుల వఱలు శరములసరికినఁ దిగుగుడువను కరులను కరభంబులఁ బాపి తొలుగక హులగుబలువులుల పులులు గరపించి చంగుచంగున నింగిచెంగట లగసి మగు డి యంగముల రంగు తెసంగ నుగ్గొంగు సింగములను భంగంబు నొందించి మాటిమాటికి వనవాటిదాటఁగల పాటిగలిగి నేటగు లేటిదాటుల నేటుపోటుల నాటించి యల్లనడలఁ గొల్లలగు జొల్లినోరు మెకంబులఁ జిల్లలనడంచి మించు వారును, గొలుసులుడిపి విశ్వక్రమువులను సికొల్పి బలుమృగంబుల నడగించు వారును, వలలొడ్డి బలుపులుగులఁ బట్టుచువారును దడులడరించి వాగురులఁ బనరింపఁజేసి కృష్ణసారంబుల వివశింపజేయువారునైయుండి రాజయోగ్యంబు లగు కొన్ని మృగంబుల సంతంగంబుల నా భద్రాయువు ప్రమోలసిడి జోహా రొనరించిన సంతసించి వైశ్యుండగు నునయుండు. దాను తద్బలంబులతో వచ్చి నిజపద సమీపంబున నాలుబ్ధక బలంబున కాజ్ఞనొసంగి తన్నగరంబు ప్రవేశించి జననికి నమస్కరించి వైశ్యాగ్రణికి సమ్మోదం బలరించి యున్నంత.

సీ. హంసరూపుండనే • ననపకించినరీతి
• భసిత లిప్తాంగంబు • బరగుచుండ

క. గురువులకు సపర్యాతత్పరత వహించితివె నీకుఁ • బ్రాణసఖుండనై
వరవిలయు నన్నుఁ దలఁచితివె! పరగున బల్కు మన నతని • జననికడం కన్. ౧౩౯

ఉ. అతివేగంబున వచ్చి యయ్యతివసా • ష్టాంగప్రణామంబులా
ర్జితభక్తిన్ దగసల్పి తచ్చరణరా • జీవంబులంబ్రతునా
నతునింగా నొనరించి సమ్ముఖముగా • సప్రహవనత్వాదిసం
యుతుడై దేనెలు జిల్కు పల్కులను న • య్యోగీంద్రుతో నిట్లనున్, ౧౪౦

గీ. ఇతనిగురుఁడ వయిన నీకు • సుతుఁడు నగుని! తనికి బ్రాణంబొసంగిన • తండ్రివీవు
గాన నితనిని శిష్యుని • గా భరింపు! సరసకరుణామయాత్మ యో • గురువరేణ్య.

క. జ్ఞాతిజనబంధువర్జితుఁ! డీతనయుఁడనాథుఁడగుట • నితనికి సర్వ
జ్ఞత్వప్రద సన్మార్గము! నాతతమతి దెల్పుమీ రె • యర్థములు దలఁపన్. ౧౪౧

క. అని యివ్విధమున నారా! ధ్వని తా నుణి విన్నవింప • వాత్సల్యమునన్
యాముని రాజసుతునకు! ర్థి నిసద్ధర్మంబు తెఱఁగు • దెల్పన్ దొడఁగెన్. ౧౪౨

క. శ్రుతులయందును స్మృతులందు, హితపురాణ!తతులయందు సనాతన • ధర్మ మొలమి
బరగ వర్ణాశ్రమానురూ, పముగ సర్వ! ధాజనంబులు సేవింపఁ • దగు దలంప ౧౪౩

క చాలగు తత్సన్మార్గము! వాలాయంబుగ నుమాణ • వక; భజియింపన్
మేలగు గావున నీవిపు! డీలీల జరించు దేని • హితమగు దెలుపన్. ౧౪౪

మ. తెలియన్ నీకవియులంఘ్యమై తనరుమ • ద్దివ్యాప్తి నీ వెప్పుడా
విలమార్గంబున దేవహేళనముగా • వింపన్దలంచేవు స
త్ఫలదాత్మస్థితినొంద దేవగురువి • ప్రశ్రేష్ఠులం దెల్లనిం
శ్చలభక్తిన్ జరియింపు సంతతమిలన్ • సత్ప్రథానుండవై. ౧౪౫

మ. ఎపుడున్ దుర్లభవస్తుజాతములయం • దిచ్ఛన్ విచారించకా
శ్వపచుండైఁ దగునేని మన్నతిథియై • నంప్రాప్తుఁడై నన్ బ్రజలా
పవరిగ్రాహత నొందబోవకను సం • భావించి యన్నంబు స
త్కృపతోఁ బెట్టినఁ బుణ్యముల్లసిలు నీ • పృథ్వీస్థలిన్ బుత్రకా. ౧౪౬

సీ. ప్రాణసంకటము సం • ప్రాప్తమై యుండినన్
సత్యంబు విడనాడ • జనదు తలంప
రమణిగో బ్రాహ్మణ • రక్షణార్థంబుగాఁ
బడబులో నొకవేళఁ • బొంకవచ్చు
పరభామినులయందుఁ • బరవిత్తములయందు
భువి దేవవిప్రవ • స్తువులయందు
దృష్టనుపిడువుము • తత్ప్రత్ష్ట భావాబలాఢ్య
దంభంబు సర్వదా • తలఁపవలదు

గీ. సత్కథలయందు సద్వ్రతా • చారవిధుల
సత్పథములందు ధర్మాది • సంగ్రహముల
నిత్యమును తృష్ణనుంచుము • నిరుపమాన
హృదయ వచింపుంతుఁ గొన్నిటి • సదయమతిని. ౧౪౭

సీ. స్వాధ్యాయమునస్నాన • జపహోమపితృ తర్ప
ణాతిథిగోబ్రాహ్మ • ణార్చలందు
నలసత్వమువహింప • నర్హమార్గము గాదు
ముందుఁ గ్రోధము ద్వేష • మును భయంబు
నలజాడ్యపైశూన్య • మసదాగ్రహంబుకౌ
టిల్యంబు మోహంబు • కీవితోడ
నుద్వేగమునువీడు • టొప్పు క్షత్రియధర్మ
మొనసియు వృద్ధుల • హింసవలదు

గీ. శుష్కవైరంబు గూడదు • సొంపనుచుమృ
షానులాపంబు పరనిందలఁ • బూనఁదగదు
గాన నీవింక బహుధర్మ • గతులు గలుగు
పథమును మనంబులోఁదల • పంగవలయు. ౧౪౮

క. సఖులందు మైత్రియుంచుము। సుఖులందు దయానువృత్తి • జూపందగునో
సఖ; పుణ్యవంతులందును। నఖిలము మెచ్చంగ మోద • మలరింపఁదగున్.

క. వాసికిబుద్ధులయుండా। దాసీన్యముమించి తిరుగఁ • దలఁపుముసద్గ్రం

ధాసక్తిగలిగి గురునే। నాసక్తుం డయ్యె నేని • హర్షముదలంపన్.

క. అత్యాహారమతిశ్రమ। మత్యాలాపంబు మఱియు • నతికోపంబా
ధత్యంబతి వీర్యము భువి। నిత్యమతిక్రీడసలుప • నీకుదగదొగిన్. ౧౫౦

క. అతివిద్య యతిశ్రద్ధయు। నతిపుణ్య మతిప్రీతియును • నత్యుత్సాహం
బతిధైర్యంబతికీర్తియు। సతతము గడియింపవలయు • సౌజన్యనిధీ ౧౫౧

సీ. మోహాకృన్నిజవరా రోహాసముభిలమ
త్యాంతంబుతో నున్కి • జనుదలంప
నత్యహితపరిదప్రత్యవస్థాతుని
స్వర్ణంబొనరింపం • దగుదలంప
గణ్యంబులై నట్టి • పుణ్యంబులందు లో
భస్థితి వర్తింపన్ • నగుదలంప
పశ్యేతరాధర్మి • కేభ్యసంఘమునందు
సాభ్యసూయుండౌట • నర్హాయుక్తి

గీ. చండమతి హిండితాత్మపా • షండగణము
నందు విద్వేషుడగుటపెం • పౌందుదలంప
సజ్జనులమీద ననురాగ • సహితుడగుట
యుక్తమగుచుండు వివరింప • నుర్విలోన. ౧౫౩

సీ. తెలివిమీరంగంబ్రికృ • తిప్రత్యయంబుల
ననురక్తి గుణవృద్ధు • లరసియరసి
ప్రబలపరాదేశ • పదవిభక్తులసంధి
విగ్రహంబులచక్కి • వెలసివెలసి
పటుపరరూపని • పాతంబుల రసితే
ద్ధితవాక్యములమేలు • దెలసి తెలసి
సుగుచిరాగమముఖ • సూత్రతావ్యయార్థవ్రు
త్తులననుష్ఠుంబున • నలరియలరి

గీ. గురునమంచదకీన • వాగ్గుంభనముల
నలరు చలజాతినిగ్రహ • ములవితర్క

గతులుగల రాజనీతిప్ర • కారమరయ
వేయు భూపాలతనయుఁ డయా • వసుంధలోన. ౧౫౪

క. కాపాలికలోకాయతి। కాపట్యత్యాగశద్యః • కాతిగుణంబుల్
దీపించి తత్పథముదా। రాపాతనమొందఁజేయు ॥ నగుడలపోయర్. ౧౫౫

క. నిర్మర్యాదాభిజ్ఞులు! దుర్మంత్రులు బోధఁజేయు • దుర్బోధముచే
ధర్మంబు దప్పఁగూడదు। ధార్మికమార్గానువర్తి • తతనత్కీర్తి ౧౫౬

క. వర్ణవ్యావృత్తిస్థితిఁ। గర్ణేజపనిర్ణయప్ర • కారోక్తులనా
కర్ణించునెడలబధిరో। దీర్ణత్వము నొందలలయు • దీనవిధానా ౧౫౭

క. క్రూరశఠదంభ ధూర్త వి। హారకితవచపలపతిత • నాస్తికజిహ్మా
త్మాదులఁ గన్నంతనె। దూరముగాఁ దొలఁగవలయు • దూషితకలుషా.

సీ. సంతతాత్మప్రశం • సారక్తుఁడవుగాక
విజితేంద్రియుఁడవుగా • విశదమతిని
పుత్రమిత్రకుటుంబ • ములనొక్క స్పటికిన
[illegible]ఁడవుగాక • యాపవలయు
సాధ్వీత్వమొందిన • జాయవాక్యములందుఁ
బిత్రుభాషితములందుఁ • బ్రీతివెలయు
సద్గురూక్తులయందు • సర్వదావిశ్వాస
ముంచంగవలయునో • యురుగుణాఢ్య

గీ. యాత్మరతపరత్వంబు • ప్రమత్త
తయు దృఢవ్రత బుద్ధియుఁ • దగఁజరింపు
మాత్మజులమీద నైననో • కప్పుడైన
నలదు విశ్వాసముంచంగ • వర్ణనీయ. ౧౫౯

గీ. అవని దొరకొను నన్నాసి • [illegible]విశ్వ
సించనేనియువాని హిం • సింపదాద్రు

మాయలేక చరించిన • మనుజునందు
శంక జేయంగవలవదో • జనవరేణ్య. ౧౬౦

సీ. స్త్రీల బాలురవృద్ధ • కృపణాళ్యనాథుల
నపరాధ రహితుల • నవనిలోన
బుద్ధిబల ప్రాణ • ములశక్తిబలమున
నరసి రక్షించుచు • యతిముదమున
సత్యంబు వలనను • జలియింపఁగూడదు
హననయోగ్యుండైన • యతివరుండు
శరణాగతుండైనఁ • జంపంగవలవదు
పాత్రుఁడైనను మన్న • పాత్రుఁడైన.

గీ. నీచుఁడగునేని మఱి • మహనీయుఁడేని
యెవ్వఁడైనను యాచించె • నేనివాని
కొంతకు శిరమొ నొసఁగుచు • గురుయశంబు
నొందు [illegible] సదా • యుర్విలోన ౧౬౧

క. నరపతులకుఁ గోవిదులకు। ధరఁగీర్తియె భూషణంబు • తత్కీర్తియెప్రస్ఫురితమగులక్ష్మి తత్కీ। ర్తిరతింబుణ్యంబుగలుగు • ధీరవిచారా. ౧౬౨

క. అవనీశతనయః సంతత। కవిసన్నుత చంద్రచంద్రి • కలకెటువలెనో
యవినాభావంబటువలె। నవనిజనము కీర్తిచేత • నలరుచునుండున్. ౧౬౩

క. రాజాశ్వహేమనవమణి। రాజని గుప్తక్రియలను • రక్షింపమహా
రాజః యకీర్తినిపతితో। త్తేజితసర్వస్వబువిడుము • తృణగణముబలెన్. ౧౬౪

ఆ. మాతృకోపంబు జనకున • మర్షణముగు
రుపతిఘ్నరెవ్వయంబు పు • త్రులవలనను
ప్రాప్తమగు నపరాధంబు • బ్రాహ్మణాప
రాధమునసహింపవలయునో • రాట్కుమారా. ౧౬౫

ఎటువలెనైన విప్రవతు • లెంత ప్రసన్నత నొందుచుందురో
యటువలె వారికీప్సితప • దార్థము సంగపోసంగు రాజుసం
కటపడుచున్నవారల నొ : కానొక వేళఁ గడంగి యుద్ధరిం
చుట నిజమైచెలంగుఁ బరి • శుద్ధగురూదిత బోధసంయుతా. ౧౬౬

ఆయుఃకీర్తి బలంబు సౌఖ్యధనపు • త్యస్త్రీప్రజల్ పూర్వక
ర్మాయత్తంబులు గాన నేదిజవితంబై • ప్రాప్తమౌదాని ని
చ్ఛాయుక్తిన్ భజియింపు కాలముచు దే • శంబున్ ప్రసక్తిన్ సదా
న్యాయత్కౌతుక కార్యముల్ జనము మె • చ్చం జేయుచే మేలగున్. ౧౬౭

గీ. ఎవ్వనికి బాధ జేయగా • దెంచిచూడ
బరుని బాధ నివారింపఁ • బడదలంపు
శాత్రవులఁ జోగులన్ దుష్ట • సంచయముల
శక్తి గాలఁదని బాధింపు • జనవరేణ్యా. ౧౬౮

గీ. వెలయు పిత్రుకర్మ జపహోమ • ములను స్నాన
మొనరఁ జేయుతరిన్ వేగ • ముడుగవలయు
భోజనము జేయువో నిద్ర • బోవునెడను
సత్వరస్థితి నొందంగఁ • జనుఁదలంప ౧౬౯

సీ. దాక్షిణ్య యుక్తమై • తనరి యక్రూరమై
జనమనోహరమునై • సత్యమగుచు
సత్ప్రేమరం బగు • శాస్త్రమౌ వాక్యంబు
బలుకమెప్పుచు గురు • భక్తి సహిత
క్షితిపార్థివులయందు • భయ మొందకుము గురు
శాసనద్విజపాప • చయములందు
భయ మొందుమా జ్ఞాతి • బంధుమిత్రులయెడ
జామాతృజులయందు • సమతచేత

గీ. సంచరింపుము పంక్తి భో • జనమునందు
నటుల వర్తింప నగువిద్య • దభిహితోక్తి

శాస్త్రిగోష్ఠుల పుణ్యప్ర • సంగములను
ధార్మికులపై బ రాజున్ముఖ్యత్వంబు వలదు. ।౧౭౦

క. పరిశుద్ధ పుణ్యమానస పరణిఁ విఖ్యాతివిప్ర • సభయందుఁబరా
త్పరుఁ శివుని మందిరంబున। స్థిరతఁ వసియింపవలయు • ధీరవిచారా ౧౭౧

క. కాముక కులటాగణికా! స్త్రీముఖనీచార్త దుష్ట • దేశమునను ము
న్నేమరి పాటున నైనను। నేమరి వసియింపరాదు • విహితవివేకా. ౧౭౨

గీ. త్రిభువనేశ్వరుఁడగు మహా • దేవుభక్తి
నేదినంబున భజియింతు • వా దినమున
సకల దేవతలను మది • సంస్మరించి
పూజసేయంగ వలయునో • భూపతనయా. ౧౭౩

క. నిరతము శుచివైచిద్వి। స్తరబుద్ధిని నిర్జితారి • షడ్వర్గుఁడవై
స్థిరశాంత చరితలుమదిఁ। బొరయఁగ నేకాంతవాసముసదగును నృపా. ౧౭౪

సీ. మునుత్రయీధర్మాభి • ముఖ్యాస్యవిప్రుల
శాంతులై నియమిత • స్వాంతులైన
యతులఁ బుణ్యాత్ములఁ • పతివ్రతలనుబుణ్య
నదుల నదంబులఁ • బొదలుచున్న
పుణ్యతీర్థంబులఁ • బుణ్యసరస్సుల
వితతమణీరత్న • వృషభములును
సత్య పతివ్రతా • సముదాయముల నాత్మ
గృహదైవములఁ గూర్చి - కేవలంపు

గీ. భక్తిచేఁ బ్రణమిల్లుచు • బ్రహ్మసమయ
ములను మేల్కాంచి స్వచ్ఛాంబు • వులనుగ్రుంకి
యాచమన మొనరింపుచు • నాత్మగురుని
కలరవందన మొనరింపఁ • నగుదలంప. ౧౭౫

వ. ఇవ్విధంబుగ్రప్రవర్తింపుచుఁ శ్రీమదుమా మహేశ్వరుల ధ్యానంబుసేయుచుని
య మాహాత్మ్యుని ప్రభావంబు మందర శ్రీకవచ పూర్వకంబుగా వివరించెద

నిప్పుడు సగుణనిర్గుణ ప్రకారంబుల దన్మాహాత్మ్యంబుల వివరించెద నాకర్ణింపు
మని మఱియుట్లనియె. ౧౭౬

కం. శ్రీసుఖదశుద్ధసత్త్వా। వాసము శివపార్వతీని • వాసము సుమహా
భాసమనా భాసముకై। లాసముదనరారుచుదివ్య • లాసం బగుచున్. ౧౭౭

వ. అద్దియు నాదిమధ్యాంత రహితంబును సజాతీయ విజాతీయ స్వగతభేద శూ
న్యంబును, నిత్యాపరోక్ష స్వప్రకాశావహ సితానంతకోటిసూర్య చంద్రాన
లలోకంబును, వేదశాస్త్ర పురాణేతిహాసా గమాగమ్యంబును ఐహాముష్మిక క
ర్మధర్మ గుణనామ రూపవికార శక్తి విహీనంబు బ్రహ్మేంద్రాద్యమరాసురో
రగ గరుడగంధర్వ కిన్నర కింపురుషసిద్ధ సాధ్యవిద్యాధర చారణాప్సరోయక్ష
గుహ్యక ఖేచరభూచర దేవర్షిబ్రహ్మర్షీశ్వర యోగీశ్వర మునీశ్వర వాగీశ్వరా
ద్యుపాస్యంబును, నిత్యనిర్గుణ నిర్వికల్ప నిరాకార నిరంజననిర్విషయాతీంద్రి
యావాఙ్మనస గోచరాప్రమేయ శుద్ధబుద్ధ ముక్త కేవలాఖండ సచ్చిదానం
ద మయంబైన తురీయాతీత పరతత్త్వ కైలాసంబున నవ్యక్త మహదాది స
ప్తావరణ వేష్టితంబును. చతుర్దశలోకకందర సుందరంబును సార్వభౌమాది
హిరణ్యగర్భానంతానంద గండశైల భాసురంబును, భానుసోమనక్షత్రగ
హతారకా పావకసౌదామన్యాది వివిధరత్న శర్కరిలంబును, ప్రవిమల వైరా
గ్యోపత్యకాత్యంతము ముముక్షుతాధిత్యకా కలితఫలిత నిష్కామ కర్మోపాసన
యాగయోగజపతపశ్శౌచ సత్యదయాశీల వ్రతదానాది నానావిధానోకహో
ద్యాన విరాజితంబును ఋషిత నిగమాగమాంత కల్పలతా విలసితంబును ష
డధ్వసమాధి సౌధవిభ్రాజితంబును పరమాధ్యాత్మ విద్యానంద జలాభిషిక్త ని
ర్మల చిత్తవృత్త్యంగణమును తితిక్షాశ్రద్ధా సమాధాన మానిత్వారంభిత్వాది
కల్యాణ గుణమణిగణ రంగవల్లీ ప్రకాశితంబును నిరతిశయ కైవల్యభాండా
గార శోభితంబును ఫలకామానాభాన స్వభావ నియత కర్మాచరణ చిత్తశు
ద్ధి సర్వకర్మ పరిత్యాగ గురుభక్తి శ్రవణమనన నిధిధ్యాసనాది సోపాన సమన్వి
త విజ్ఞాన రాజమార్గ లలితంబును పంచాక్షరీ మహామంత్ర మాణిక్య తోర
ణాలంకృతంబును ప్రణవనాద మంగళవాద్య రవపూరితంబు నగు తదాస్థాన
మంటపాంతరంబున సర్వోప నిషత్సార భూతబ్రహ్మాత్మైకత్వరూపోంకార సిం
హాసనాసీనుండై శుద్ధసత్త్వ ప్రధాన మాయామయుడు దివ్య శోభన దివ్యవిగ్ర
హుండును సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వ
రక్షకత్వ సర్వసంహారకత్వాద్యగణిత సమగ్రసుగుణ పరిగ్రహుండును సత్య

జ్ఞానానంద స్వరూపుండునగు శ్రీమహాదేవుండు శ్రీమూర్తి మంతంబులైన షట్త్రింశత్తత్త్వంబులు నిచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, వ్యాపికేశ్వర వాగీశ్వర సురేశ్వర నందికేశ్వర విఘ్నేశ్వర కుమారాది ప్రమథగణాధీశ్వరులును, బ్రహ్మ మహేశ్వర్యాది సప్తమాతృకలు స్వసాన్నిధ్యంబున నిజకరుణా కటాక్షంబు నపేక్షించి కొలువ స్వస్వరూపావలోకనంబు సేయుచు నాత్మారాముండై యుండఁ దదీయ వామార్ధ శరీరిణియుఁ బరాపర ప్రకృతిస్వరూపిణియు, నిఖిల జగదుపాదాన కారణభూతయు, నిఖిల లోకైకమాతయుఁ, ద్రిభువన గేహినియు విశ్వమోహినియు, ధీముఖ జ్ఞానవిజ్ఞాన లోచనయు, విమల విరక్తిధవళయు, విచార మందస్మితయు, సిద్ధాంత నిరహంతా హస్తయు, యోగ వక్షస్తనియు, సందేహమధ్యయు, సంసార చక్రనాభియు, రాగద్వేష జఘనయుఁ గామలోభోరుయుగళయు సంకల్ప వికల్పచరణయు, కాలానుగత కర్మయానయు, వేదాంతవిద్యావ్యసన వసనోపరతి కంచుకధారిణియు, రజస్సత్త్వతమోగుణగ్రంధియు నీవిబంధ వేణుబంధ సురుచిరయు, ఫలత్యాగపూర్వక వర్ణాశ్రమోచిత ధర్మానుష్ఠానేశ్వర ప్రణిధానాద్యుపాసనేంద్రియాత్మయు, నిగమస్థిర ప్రజ్ఞత్వాది సాత్త్విక గుణభూషణాలంకారిణియు, శుద్ధవాసనా వాసితయు, నిత్యానపాయినియు నగు నమ్మహాదేవి వామభాగంబున వసియింప. ఇట్లొందు నా యుమామహేశ్వరుల ధ్యానంబు సేయుమని మఱియు నిట్లనియె. ౧౭౮

క. నారాయణ మూర్తి ప్రబలి హరియై వచింతు దాని, నాకర్ణింపన్
ఘోరతర పాతకంబులు దూరములై పోవుఁ గుముక్తి. దొరకొనుఁదలఁపన్.

క. అనివచియించిన ఋషభునిఁ గని కండము బెట్టనీవు గరుణదలిర్పన్
ననురక్షింపుము శ్రీహరి ఘనతర సుగుణానుభవము గరపుము దమునన్.

వ. అనిన నమ్యోగీంద్రుఁ డిట్లనియె శ్రీమన్నారాయణ చరణారవింద భక్తియుఁ దదితర విరక్తియు నీకు సంభవించు. నిందుకు సాధనంబు వినుము. సర్వాత్ములకు క్షేమహేతువగు స్వస్వరూప జ్ఞానంబు, తద్వ్యతిరిక్త వైరాగ్యంబు ని నిశ్చయింపఁబడియె, నదియెట్టిదనిన. నాత్మ శుద్ధుండును. జ్ఞానానందస్వరూపుండును భగవచ్ఛేషభూతుండును శిరఃపాణ్యాది లక్షణంబు పిండంబు, నాత్మవ్యతిరిక్తంబు గాని యాత్మ గాదు. యుపచయాపచయాత్మకంబగు దేహంబు ఘటాదికంబు వగిది నాశస్వభావంబు, ఆత్మ నిత్యుండని చెప్పి మఱియు నిట్లనియె.

సీ. అసహామర్థంబైన • యంగంబునందభి
మానంబుచేతను • జ్ఞానిరహిత
జనుఁడు తత్ప్రాకృత • సత్త్వాదిక్రియా
మాణంబులైనక • ర్మములఁగర్త
ననుచు బద్ధుండగు • ననయంబు తద్గుణం
బులు స్వకార్యంబులఁ • బొందలుకతన
దానకర్త నటంచుఁ • దత్త్వజ్ఞుఁడగువాఁడు
దలఁచు నిస్సంగన • ధ్యానముచేత

గీ. నాత్మకీదృశ కర్తృత్వ • మరసిచూడ
లలిపురాకృత కర్మము • లగుణయోగ
కృతముగాని విచారింప • గేవలస్వ
రూపకృతమనదగదవ • నీపతిలకా. ౧౮౨

ఉ. కావున నాత్మయందురతి • గల్గితదన్యము లందరక్తుఁడై
పావనమూర్తి శ్రీయువతి • భర్తృసమర్పణ బుద్ధిఁజేసి క
ర్మావళి నాచరింపుచు ని • రంతర తత్త్వల సంగకర్తృతల్
భావమునందుఁ జేర్పకవి • భాసిలునాత్మహితాభిలాషియై. ౧౮౩

సీ. అధ్యాత్మయోగని • ష్ఠాతిశయంబు వి
జ్ఞానంబు శ్రీశు ధు • సరససత్క
థానులాపంబుత • దాకర్ణనంబును
పరమయోగీశ్వర • ప్రాప్తియుంచి
శాస్త్రేంద్రియారాము • లగువారి విడుచుట
యును వారి కీర్తనముఁ • దనరుననగ
కామంబులందున • కాంక్షశీతోష్ణాది
సమాన తాహింస • శమదమాది

గీ. కంబు విజనస్థలస్థితి • గలిగిశౌరి
కీర్తనామృతపానవి • స్ఫూర్తి దక్క
దతితర పదార్థ వైరాగ్య • వశదలిర్చి
యుండు యమనియమాదిసం • యుక్తుఁడగుచు. ౧౮౪

వ. ఇట్టి పురుషునికి జ్ఞానవైరాగ్య యోగంబున భక్తియోగాగ్ని జనించి హృదయగ్రంథి విదాహకంబగు నిట్లు దగ్ధహృదయగ్రంథియైన పురుషుఁడు బాల్యాది బాహ్యధర్మంబులు, సుఖదుఃఖాద్యాంతరధర్మంబులు, రాజభృత్యాద్యుచ్చ భేదంబులు, నాత్మైకారామునం డగుటంజేసి, నిరీక్షింపకుండు ద్రష్టయైనయాత్మకు, దృశ్యంబులైనయింద్రియార్థంబులకు నంతఃకరణంబు బంధుహేతువగుటంజేసి యయ్యంతఃకరణంబు నాత్మకధీనంబైన కతంబున దదితర దృశ్యభేదంబులు గనకుండు నిట్లుగాకుండిన విషయాకృష్టత్వంబులై నయింద్రియంబులచేత మనంబాకృష్టంబులైన నింద్రియంబులచేత మనంబాకృష్టంబై విషయాసక్తిం దగిలియంతంబైనవిచారశక్తి నపహరించుదానివలనఁ బూర్వాపరానుమేయసంధాన రూపస్మృతి దొలంగు నట్లయిన నాత్మవిషయక జ్ఞానంబు దూరంబగు నదియే యాత్మాపహ్నంబనదగు నదియుంగాక అది గాక

సీ. మహినాత్మనోసుకా • మాయసర్వంప్రియం
భవతియన్ వైదిక, భాషణమున
నఖిలంబు ప్రియతమం, బగునాత్మకేయాత్మ
స్వాపహ్నవంబున • నలరుకంటె
నధికతరంబైన • నాత్మనాశంబెద్ది
గలుఁగు జర్చింపలో • కంబునందు
మఱియు సంసృతిఁదాట • మతిగల పురుషుండు
దొలిపురుషార్థచ • తుష్టయములఁ

గీ. ద్రితయమతి భీకరంబని • తెలసినాలు
గవది మోక్షార్థ మనిజనుల్ • గణుతిజేతు
రనుచు సద్భక్తియుక్తుఁడై • యనుపమాన
మైన మోక్షమపేక్షించు, ననఘచరితా. ౧౮౬

వ. అదియునుంగాక స్థావర జంగమాత్మకంబైన ప్రపంచంబునంగు భగవంతుండైన శ్రీహరి వ్యాపకుండయి యంతర్యామిత్వంబు నొంది వెలుంగుచుండు నమ్మహాత్మునియందుఁ గార్యకారణావస్థానద్వయంబుగల జగంబు సదసచ్ఛబ్దవాచ్యంబై ప్రవర్తిల్లు "యస్యాత్మా శరీరం యస్యప్రకృతిశ్శరీర" ఇత్యాది వేదాంత వచనములచే చిదచిదాత్మకంబైన ప్రపంచంబంతయు నచ్ఛబ్దవాచ్యండగు నతనికి శరీరభూతంబు స్వాత్మదశావన్న చిదచిచ్ఛరీరుండగు నతం

డు కారణభూతుండై "సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయంబ్ర
హ్మ" యనంబడు పురుషోత్తమునికి శరీరిశరీర భావంబుచేతగాని నిర్వికారంబై
న స్వరూపంబునంగాదు. ఏకవిజ్ఞానంబున సర్వవిజ్ఞానంబగునను వేదాంతోది
తార్థంబున సూక్ష్మచిదచిచ్ఛరీరక బ్రహ్మవిజ్ఞానంబున స్థూలచిదచిచ్ఛరీర వి
జ్ఞానంబగునని దేహాశ్రితంబులైన కామరాగాదికంబులు దేహియందు జెంద
ని తెరంగున, వ్యాప్యగతంబులైన వికారంబులు అపహత పాపాది గుణకుండైన
జగచ్ఛరీరియందు దవులకుండునట్టిసర్వేశ్వరుండు స్వసంకల్ప కృతజగదుదయ
విభవలయ లీలుండును పాపకానన గహనార్థంబు హృత్కమలకర్ణికాంతరంబున
వసించి సర్వనియామకుండు సర్వవిలక్షణుండు దివ్యమహిమా రమారమణుండు
బ్రహ్మాకరోన్మిభయ భావనాత్రయాతీతుండు ననంత కల్యాణగుణ పరిపూర్ణుండు
నై వర్తించునని యిట్లనియె. ౧౮౭

మ. కమలాభర్తలసత్స్వరూపగుణరూ • పధ్యానమాధ్వీకపా
నముచేతన్గడుమత్తుఁడై చెలఁగి య • న్యంబించుకంతైన చి
త్తమునందెంచక ధన్యుఁడై ప్రకృతిబం • ధంబుల్ దెగంగోసియు
త్తమయోగీశ్వరగమ్యముక్తిపదమం • దంబూను సర్వేశ్వరా. ౧౮౮

ఉ. ప్రీనులవిందుగాఁగ వర • విందదళాయతనేత్రసత్కథా
గానము సోకమేను బుల • కల్ బచరించి ప్రమోదబాష్పసం
తానమమేయ మయ్యెగను • దమ్ములఁ జార గళంబు గద్గద
స్వానము చేఁజెలంగఁ దగు • వానిది జన్మము నూతలంబగన్. ౧౮౯

సీ. ధరలోన నెవ్వని • చరణాబ్జభక్తిసం
స్మరణంబునన్ సుధీ • సంచయంబు
లధికకర్మగ్రథ • తాహంక్రియాహృద
యగ్రంథి నడచిన • యతులనిర్వి
షయ నిరుద్ధేంద్రియ • సరణిమానులుబోధ
శ్రేయ లేరదియేమి • జెప్పవచ్చు
నట్టియాశ్వరునిశ్రీ • యఃపతి వాసుదేవు
నిజగతా • వను ననఘచరితు
గీ. నర్థిశరణంబు గాఁదత్ప • దాబ్జయుగళి
భక్తి భజియించు నదిరెన్నుసూ • పరమయోగి

సన్నుతంబైన పదము నిం స్వాశయముగ
రమ్యసుగుణవిహార యో • గాఖ్యకుమార. ౧౯౦

శా. కామక్రోధము ఖిన్నపద్భయదన • క్రవ్యాహా సంకీర్ణని
స్సీమాగాధ భవాంబురాశిగడవన్ • శ్రీనాథ పాదారవిం
దామందస్మరణప్లవంబు తదుపా • యంబన్య మేదన్ననుఁ
ద్దామప్రీతి దవాశ్రీయుండ వగుమీ • ధాత్రీశ నృపాలాత్మజా. ౧౯౧

వ. ఇవ్విధంబున శ్రీమన్నారాయణు ప్రభావంబు జెప్పితి నతని భజియింపుమని వచించి తదనంతరంబున బ్రహ్మదేవుని, విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, మహాలక్ష్మిని, సరస్వతిని సేవింపుమని దేవి మహాత్మ్యంబు వినుమని యిట్లనియె.

—ఋషభయోగి రాజకుమారునకు దేవిమహాత్మ్యంబు చెప్పుట—

మ. అనయంబున్మనిమై నవావరణ ము • ఖ్యప్రోల్ల సద్రత్నకాం
చన సింహాసన దేదివత్సరశిహం • చద్ధా ను వామాంకవా
సిని, సామర్ధ్యకరాబ్జవీజిత కస • చ్చేలానిలస్పర్శసం
జనితానందినియైన శ్రీత్రిపురవా • సన్ సంస్మరింపందగున్. ౧౯౩

చ. సరసమహాత్వతత్వ నవ • చక్రరథాధినివాసయయ్యు వి
స్తరతరగేయచక్రగిరి • చక్రధరస్థితు లీప్సితార్థమం
త్రరతిని దండనీతిని య • థావిధిఁ వెల్చుచు నుండనొప్పునా
సురుచిరమూర్తి యాత్రిపుర • సుందరిఁ గొల్వుము నెమ్మనమ్మునన్. ౧౯౪

సీ. సదసదాత్మకజగ • జ్జన్మాది హేతుత్వ
మొందుచు సచ్చిదా • నందయగుచు
దీపితస్వస్వరూ • పాపరిత్యాగస్వ
రూపాంతరాదర్శ • రూఢిదనరి
సర్వోపనిషదర్థ • సాంభూతస్థితి
కాదిహాది మనుప్ర • కారమొంది
సమ్యగోనవిం • శద్ధళా వరణాంత
రస్థకోణత్రయా • రమ్యబిందు

తంస మణికుండల మండిత గండభాగద్యుతియు నవఘనసార కస్తూరికాది న
మామోదిత వీటికయు, జ్వలచ్చాంద్ర బైందవమండల మధురాననయుఁ జింతా
మణి సారకహితసరీటయు, దరోన్మీలద్రక్తాబ్జ ఫాలనేత్ర విరాజితయు, గాఢాం
ధకార నిబిడశ్యా... సంహతియు, శ్రీకంఠ ... సింధూర రే
... వనయు సర్వశృం
గార విశేషాఢ్యయు, నకు నమ్మహాదేవి సేవింపుమని యిట్లనియె. ౧౯౭

గీ. హరిహయానల యమకోణ • పాంబుధీశ
పవనయక్షాధి పేశ్వర • ప్రభృతిదిక్ప
తులను బుణ్యాత్ములగుమునీం • ద్రులనుగూర్చి
ధ్యానమొనరింపవలయు ని • త్యంబు మదిని. ౧౯౮

సీ. సముదయత్పద్మినీ • రమణునకు నిరంత
రంబు నమస్కార • గంబొనర్చ
పుష్ప సుగంధతాం • బూలశాకంబుల
ఫలపత్రముల శివా • ర్పణముఁ జేసి
భుజియింపవలె భక్ష్య • భోజ్యాదు లన్నిఁటి
నటువలె సేయంగ • నగుఁదలంప
నేది దత్తంబగు • నేది కృతంబగు
నేది స్నానముజపం • బేదిస్మృతము

గీ. నేది తపమగు నదియంత • యీశ్వరునికి
నర్పితముగాఁ దలంచుట • యర్హమగును
అమ్మహేశ్వరు కృపచేత • నఖిలపదవు
లనుభవింపంగ వచ్చునీ • యవనిలోన. ౧౯౯

సీ. రుద్రాక్ష వలయునం • రూఢోజ్వలత్కార
దండయుగ్మంబునఁ • దనరుచుండి
ఫాలభాగాంతర • ప్రస్ఫురత్సితభస్మ
యుక్తత్రిపుండ్రంబున • నొప్పుచుండి
...త్రరాజమా • పంచాక్షరి జపించి
సావధానంబైన • శాంతమునన్ను

సతతంబు శివపదా • బ్జధ్యానమొనరించి
యింపుగాఁ గనుభుజి • యుంచునెడను

గీ. పల్కునెడ, జూచునెడ, నిల్వఁ • బడినయెడ, ది
రంగునెడ, గూర్కునెడ, విహా • రంబొనర్చు
నెడను, వినునెడ, గ్రహియించు • నెడను, శివుని
చింతసేయుంగఁ దగుబుద్ధి • మంతులకును. ౨౦౦

కం. ఈవిధమున సంక్షేమము। గా వచియింపఁదగె ఫర్మ • గతిసంగ్రహమీ
భూవలయమున బహుపురాఁ ణావిష్కృతమయ్యెఁ బ్రకటితాంచితవృత్తిన్.

చ. ప్రకలపురాణ గుహ్యమగు • సంహరణంబు పవిత్రమాజయు
ప్రకట సుఖప్రదంబతివి • పత్తివిమోచన మైతలిర్చు శై
వకవచమెన్న నీకుహిత • వర్తనమొప్ప వచింతు తాల్కుమా
నక పరిశుద్ధ మానసము • రంజిలఁ జేయుము సమ్మదంబునన్. ౨౦౨

వ. అని శివకవచంబు సాంగంబుగా నతనికి నుపదేశించి యావృషభ యోగీంద్రుఁ డిట్లనియె. ౨౦౩

సీ. అవనివరప్రదం • బగు శైవకవచంబు
చెలఁగ నా చేయుండు • జెప్పఁబడియె
సకలబాధాప్రశాం • తికరంబు సర్వదే
వాలయ రహస్యమై • యొప్పుచుండు
నేమానవుండైన • నీయుత్తమంబైన
శివకవచంబు పా • సించనేని
యామర్త్యునకు శాంభ • వానుగ్రహంబున
భయమింక లేని సం • భవమగును

గీ. దరసిచూడంగ • క్షీణాయు • వైన బ్రాప్త
మృత్యువైన మహారోగ • మిళితుఁడైన
సతుల సంపత్సుఖంబుదీ • ర్ఘాయు వెలమిఁ
జెందు సంశయ మొక్కింత • చెందవలదు. ౨౦౪

గీ. సర్వదారిద్ర్య శమనంబు • సర్వమంగ
ళప్రదంబైన శివకవ • చప్రభావ
మెవ్వఁడేని వహించువాఁ • డివ్యనుమతి
దేవతలచేతఁ బూజ్యుఁడై • తిరుగుచుండు. ౨౦౫

క. ధరణి వివరించిచూచితె। పరమ మహాపాతకోప • పాతకములచేఁ
బరివర్జితుఁడై శివకవ। చరతిఁ దేహాంతమున ను • * సద్గతిఁ జెందున్ • ౨౦౬

క. నీవును శ్రద్ధాయుక్తుఁడ। వై వర్ణితశైవకవచ • మత్యుత్తమమి
చ్ఛావిధి ధరియింపుము శ్రీ। రోవంతుఁడవగుము మామ • కోక్తి వశమునన్.

క. అని యివ్విధమున బుషభుండనుపమ శివకవచమున్న • పాత్మజునకు నె
ర్పున నుపదేశింపుచుఁ బె। వానుతనుపరసత్కృపాస • మగ్రతదోషన్. ౨౦౮

శా. గర్వఖర్వ విపక్షశిక్షణచణా • శ్రీకనచ్చక్రమున్
సర్వద్వేషణ వ్యాప్తస్ఫుటస్ఫుట నక్ర • చ్ఛంఖంబు మున్నిచ్చి శ్రీ
సర్వేష్టంబయి మంత్రపూతమగు భ • స్మంబున్దదంగంబులన్
వేర్వేరన్ స్పృశియింపుచున్ మఱియునా • విఖ్యాత మోదంబునన్. ౨౦౯

చ. ద్విగుణిత వడ్డమానగజ • దీప్తబలంబు నొసంగనప్పుడ
య్యగణితశక్తి భూతిమహి • మాతిశయంబలరన్ ధృతిన్ప్రతి
స్వగురువిభుత్వమొందిన జన • శానసూనుఁడు • శారదేందుఁడై
సొగసువహించి కేల్మొగిచి • చూడ్కికి వేడ్క నొసంగుచుండఁగన్. ౨౧౦

వ. అయ్యెడ నమ్మహాత్ముండు. ౨౧౧

మ. ఘనజాధీశతనూజ; ఖడ్గము తపో • మంత్రానుభావంబుచే
తను నీకిచ్చితి దీనిఁ జూచి పరుఁడం • తంబొందు వైరుల్ నిరా
కసమున్ జెందుటఁ జెప్పనేల మఱియా • శంఖంబు ప్రాయంగము
న్వినన్ శత్రులుమూర్ఛనొందుదురని • ర్వీర్యాత్ములై భూమిలో. ౨౧౨

* తేజరిల్లు—అచ్చుప్రతి సద్గతినొందు అ. ప్ర.

సీ. జననాథ సుత; దివ్య • శంఖఖడ్గంబులు
పరసైన్యనాశన • ప్రతిభఁ జెందు
నాత్మసైన్యంబుల • నలరించు నిత్యంబు
భవ్యమానేత్రత్వ • భావమునను
జటులద్విషత్సహ • ప్రక్షిప్త బలముచే
బరిస్ఫుట భస్మధా • రణముచేత
నిఖలశాత్రవసేన • నిర్జించి పితృసంగ
తంబైన సింహాస • నంబునొంది

గీ. భూమి పాలించఁగలవని • బుద్ధిఁ దెలిపి
జననిచేఁ దత్సుతునిచేత • సరసపూజ
నంబులను దృప్తిఁ గొంది • యానందమునను
ఋషభయోగీంద్రుఁ డతిగె య • ధేచ్ఛమీర. ౨౧౩

వ. అని యివ్విధంబున సూతుండు శౌనకాదులకుం జెప్పిన నటమీఁద కథ యె
ట్టిదనిన. ౨౧౪

మ. వర నైజస్ఫురణోద్ధ వర్వభువనో • పాదానపాదానత
స్వరధీశాజ మునీంద్రనిత్య విలస • ద్ధ్యానాంగ వాఙ్మంగనా
కరుణారక్షిత శాస్త్ర సత్వఖలవ • ద్గాంగేయ గాంగేయ భూ
ధరశాణాసవిలాస సత్యవదకృ• ద్వ్యాహార వ్యాహారకా. ౨౧౫

క. హార్దస్తుతికృజ్జనహా! హార్దసకాపర్దముక్తిదాపగయభ్యా
మర్దన సమ్మర్దఖలీ!వర్ధరవవి పాట్యమాన • వనజభవాంఘ్రా. ౨౧౬

భుజంగప్రయాతము

ప్రమాణప్రమేయ • ప్రమాతృస్వరూపా
అమేయావ్యయాత్యద్భు• తైశ్వర్యదీపా
రమానాథ హాణీశ•రమ్యానులాపా
నమోంతౌను వాకాభి•నంద్యా ప్రతీపా. ౨౧౭

మ. ఇది శ్రీమత్కృతి పాద్యవేద్య కవితా • హేవాకభావాదిక
ప్రదశయ్యార్థధ్వనివృత్తి రీతిరసపుం॰భావ ప్రభావప్రబం
ధదయాసంభృతి రాజశేఖరహిత • శ్రీరమ్య భద్రాయురా
భ్యుదయాభిఖ్య మహాప్రబంధము ద్వితీయోల్లాసమై పెంపగున్. ౨౧౫

ఇది శ్రీరామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రామళ్లగోత్ర పాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజ
ద్రాజన్న దేశాయిసార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణ
కవిత్వతత్త్వ చాతుర్యధుర్య పరాశరగోత్ర
రాపాకలింనామా త్యపుత్రలక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాయు
రభ్యుదయంబునందు
ద్వితీయోల్లాసము





శ్రీరస్తు

# భద్రాయురభ్యుదయము



## తృతీయోల్లాసము





శ్రీరాం కరుణారస
ధారాప్లుత హృదయసదయ తత్త్వవమధురా
ధారేయ సుఖకరవిహా
రారామా రెడ్డిపేట . రామ మహేశా

వ. అవధరింపుము. శౌనకాది మునీంద్రులకు సూతుండవలికథ నిట్లు చెప్పదొడంగెను. ౨

గీ. అధికబలుఁడు దశార్ణదే . శాధినాథుఁ
డై తగినవజ్రనాభురా . జ్యంబు గొనఁగ
మగధ దేశాధి పతిమహా . మహుఁడు హేమ
రథుఁడనెడు [illegible] జనబలాఢ్యు . [illegible]డపుడు. 3

కం. ధనబలవంతుండాయెా। ధనబలరథగజతురగప . దాత్యసి ముఖసా
ధనవలయుత భూభుఁడరిసా। ధనవిలయాంతకుఁడగుచును . దగ్రతదోర్వర; ౪

వ. అతండొక్కనాఁడు హితులు మంత్రులు పురోహితులు సేనాధిపతులు సామంతులు ప్రధానులు సంధివిగ్రహాది విచారులు, దండనాయకులు కార్యభారకర్తలు సైనధికులు రథికులు హాస్తిపకులు పీకలు భటులుగొలువఁ గొలువుదీర్చి యంతఃపుర గలయుంగని యందు రాజకార్య ఖడ్గపరివీణులగు ప్రధానపురుషులం జూచి యిట్లనియె.

మ. విమతవ్యూహ విభేదనోద్యమమునా • విఖ్యాత విశ్వాసపూ
ర్వమునీతిపరిమదాత్మ రక్షణవిధి • ప్రారంభమిష్టార్థలా
భము విద్వన్నికరస్తుతంబు శమనం • ప్రాప్తంబు నామంత్రకా
ర్యము గోప్యంబగుగాన మీమదిని ని • త్యంబిచ్ఛయింపఁ దగుఁ. ౬

గీ. కాన నామదిలోనొక్క • కార్యవరణి
యిప్పుడుద్భవమయ్యె న • దెట్టులనిన
సకల దేశాధిపతులు లం • చము విధాన
మొనఁగి రౌకవజ్ర బాహుండు • నొసఁగఁడయ్యె. ౭

క. అతఁడు మదోన్మత్తుండు। ద్ధతి ధనబలవిక్రమములఁ • దనరును, యుద్ధోద్ధతిఁ గెలచి యతనిసంపద। లతిరయమునఁ గొనగవలయు • వార్షింపఁదగుఁ. ౮

గీ. అనినవిని తత్ప్రధానవీ • రాగ్రగణ్య
ముఖ్యులిది దండనీతిన • ముజ్జ్వలంబు
నీదువచనంబు మామది • నిరుపమాన
మోద మొనరించె నీయెడ • మేదినీశా. ౯

క. అనివార్య ఠీయ్యఁగొనన। జ్జనపతి సాగ సైనకొలువు • జాలించిజయాంకనవిరుదధ్వజకీలిత। కనకరథంబెక్కి కౌతు • కంబిసురొత్తఁ. ౧౦

—• హేమరథుఁడు వజ్రనాభునిపై దండెత్తుట •—

గ. సంధుతసిత మద్విధబల। బంధురుఁడై వెడలెనపుడు • బధిరీకృతదిక్సింధుర బంధుర దుందుభి। ధంధాంధాంకరణములను • ధరణి వడంకఁ. ౧౧

వ. ఇవ్విధంబున వెడలిన; ౧౨

సీ. గధిత దుష్ప్రథజన • ప్రథితావితథమనో
రథశాస్త్ర శస్త్రభృ • ద్రథములలర
బంధురావయవగ • ర్వాంధదానస్రవ
ద్గంధ సింధుర ఘటల్ • గదలుకొనఁగ
ఘోరబాహ్లీకధా • రారట్టతుఖార
ఘోట్టాణధట్టికా • కోటులెనయ
చటులారి ధీరహృ • త్స్ఫుటపరిస్ఫుటనార
భటిసముద్భటవీర • భటులు గొలువ

గీ. భూరి భేరీమృదంగఢ • క్కారవములు
పటహ గోముఖవాద్య శ • బ్దములు భద్ర
కాహళీ కుహళీరవ • వ్యూహములును
నొక్క మొగిమ్రోయ మాగధుల్ • పిక్కటిల్ల. ౧౪

వ. మఱియు. ౧౫

సీ. అధికులై తగినట్టి • రథికులు దుష్టులై
వధికులు దవిలి కీ • వలఁ జెలంగఁ
ప్రాసికుల్ కార్ముకా • భ్యాసికుల్ ముద్గర
న్యాసికుల్ దగుహాళా • హాళిరొనర్ప
శాళికుల్ వందిపై • కాళికుల్ నిశితార
ఖాళికుల్ సాటోప • లగుచునడవ
కూంతికుల్ ముసలవి • ఖ్యాతికుల్ ముష్టిసం
ఘాతికుల్ మెండుగా • గ్రందుకొనఁగ

గీ. శాంఖకులుఘాంటికులఁగూడి • చాంక్రికులును
ఖాడ్గికులయాష్టికులమించి • కౌంతికులును
దారసోత్సాహ సన్నాహులు • లగుచునపుడు
పగరనిర్జించు వేడ్కచే • బలసిరాగా. ౧౬

సీ. స్వవిషయానంతర • స్థానుండు శత్రుండు
తదనంతరుండు మి • త్రత్వమొందు

కులుదెల్ప సంతోష కలనఁజెందు
నింపుమీఱంగ శ్రీ • సంపాతకీర్తిప్ర
స్థానంబనుచుఁ బల్కఁ • బూనఁజేయు

సీ. వస్త్రముల బాడ్ల సవరణ • లలరుచుండ
శార్కరిలసికతిలము హో • శాద్వలముల
ప్రకటపంకిల నద్వల • పద్ధతులను
గడచి చతురంగ బలములు • త్కలికతోడ. ౧౯

శా. శీమాదర్గళ నిర్గళత్స్వరబలా • భేద్యంబు • ధావ్యాదిక
స్తోమస్థేము మనేకపార్శ్వరథవి • స్ఫూర్జద్భటప్రక్రమో
ద్దామంబద్భుత నూత్నరత్నవిలస • త్స్థానంబజస్రైకస
ద్ధైమచ్ఛత్రిగ వజ్రబాహునృపురా • ష్యంబాక్రమించెన్ వడిన్. ౨౦

— • భద్రాయువు దశార్ణదేశనగరాదుల నాక్రమించుట • —

చ. కలుషిత ధూళితో నెదురు • గాడ్పులు డాయ, వరళ్లుగూయ, ను
ల్కలుబడ, రక్త మేఘములు • గర్జిలి నెత్తురు నింప, మించుచు
క్కలు భయదంబుగా దివిని • గన్పడ, దుష్టములైన శాకునం
బులు గనుపించ, మాగధ పే • మూహము జెగ్గిల కగ్గలంబుగన్. ౨౧

వ. ఇవ్విధంబున సముద్రతరంగంబులచందంబున, వర్షబిందువుల విధంబున చిలుకపరిగలి, మిడుతగమివడువున నుసిళ్లగుంపురీతి, నేల యీనిన పగిది తండోప తండంబులై, లక్షోపలక్షలై, కోటానకోటులై, పెక్కగతుల నెక్కుడంగన నక్కుడగినుపట్టుశతాక్షోహిణీ మాగధబలంబు వజ్రబాహు పరిపాలిత దశార్ణదేశనగర గ్రామజనపదంబుల నాక్రమించె. ౨౨

ఉ. కొందఱు రత్నరాసులను • కొందఱు స్వర్ణచయంబులన్ మఱిం
గొందఱు దివ్యవస్త్రములఁ • గొందఱు గోవృషసంచయంబుల
న్గొందఱు సుందరీమణుల • గొందఱు బాలుర గొంపటింపుచె
న్కొందిన ధాన్యసంఘముల • నుద్భటవృత్తిని సంగ్రహింపుచున్. ౨౩

సీ. సౌభాగ్యకాపోతమా • యూరకేకాదిస్ఫు
టోద్యాన వనముల • నుక్కడంచి
జాలపాదరథాంగ • జాలమేధాభంగ
విమలాంబు పద్మాక • రముల గలంచి
సుఖభోగ శాలికా • ముఖయుక్త సస్యంబు
ఘోటకంబులు మెక్క • గోసివైచి
ముక్తాఫలాసక్త • ముఖ్యేత్తు వనములు
విటతాటనంబుగా • వించి మించి

గీ. కమ్మ కేళీరథంబుల • గాసిజేసి
ధనపదాగారములుజొచ్చి • తస్కరించి
సకల వస్తువ్రజంబును • త్సుకతఁ గొనుచు
రిపుబలంబులు తద్రాజ్య • రిపులనొంచి. ౧౪

చ. అలరులద్రుంచి, తీవియల • నన్నిటి మున్నిరసించి పెంపుడుం
బులుగుల గాంచి, వానిఁ జోరిఁ • బుచ్చదలంచి • రమ్యహర్మ్యకూటముల్
తొలుతనడంచి, రథ్యముల • తోరణముల్ విదళించి స్త్రీలసొం
పుల నడగించి, వారిడవగు • భూషణముల్ హరియించి మించఁగాన్. ౧౫

క. అనదలగుచు ద్విపదపమృతి। ధనకనకకళత్ర పుత్ర • ధాన్యాంబరగో
ధనులై నిర్బంధనులై। చనుదెంచి నిజాధిపతికి • సాగిలిభీతిన్. ౧౬

సీ. ఓమహారాజ, నీ • యుర్విలోపల ముందు
సుఖవృద్ధినిజెంది • సుతులు మేము
సకల సంపదలచే • సతతంబు చరియించు
వారమైయుండు నీ • పారమయ్య
వలసిన యప్పుడే • వారిదంబులునిల్చి
వర్షంబు గురియున • వ్వారిగాఁగ
ముక్కారు పంటలు • నెక్కడ గనుగొన్న
తరగకుండును ధాన్య • తతిదలిర్ప

గీ. కామధేనువులన ధేను • కాముకొనఁగ

క్షీరవారిధి నింపునీ • సీమనెపుడు
బ్రాహ్మణ క్షత్రియార్యశూ • ద్రవ్రజంబు
సత్యవృత్తి జరియించు నై • శ్వర్యమొంది. ౨౭

గీ. అట్టి మాపాటు వినుమిప్పు • డవనినాథ
యరివరులు నీదు రాజ్యంబు • నాక్రమింప
భంగపాటున సంకట • పాటుదుఃఖ
పాటుగల్గెనయా, యేమి • పలుకవచ్చు. ౨౮

—*ప్రజలు వ్రజనాథునితోఁ దమ సంకటములఁ జెప్పికొనుట*—

క. నిగుడింపునీదు మగటిమి। సెగసోఁగ లెగయంగ శత్రు • సేనాటవులన్
దగులుకొనంగ లేకునికిని। వగలు మగు నెనిన్ను గొల్చు • వారల మదిలోన్. ౨౯

వ. అని విన్నవించిన. ౩౦

మ. వినియా భూపతి క్రోధఘూర్ణితరసా • వేశాత్ముఁడై మంత్రికా
ర్య నిరూఢాంతరులైన వారి, ఘనశౌ • ర్యస్ఫూర్తిఁ జెన్నొందువా
రిని బిల్వన్నియమించి శాత్రవులగా • ర్వంచంగ సేనాళికో
మనక ద్యోగముగల్గె సర్వబలసం • మర్దంబుగాఁ గోదగున్. ౩౧

మ. అనిమిషాల్ వడివేసి యీసుననసా • కోదండ పాండిత్యమే
ననిలోఁ జూపెద నాసమానులకు ము • న్నామాగధుల్ గీగధుల్
ననుఁ గోటిం దొడరంగ వచ్చినను నే • నానావిధాస్త్రాళిఁ
త్రనువుల్ నెత్తుట జొత్తిలన్ ఖరపెదం • దథ్యంబుగా నెంచినన్. ౩౨

వ. అని కోపాటోపంబున వీరాలాపంబులు పలికి. ౩౩

సీ. సమరసన్నాహము • స్ఫుహాబలబంబరంగ
రథము తెమ్మనిన సా • రథిశదంగి
వివిధాస్త్రశస్త్ర ప్ర • వేశదివ్యంబైన
తేరుసమ్ముఖమునఁ • దెచ్చినిలుపఁ

గని త్రిదశంబెక్కఁ • గదనంబొనర్పునా
ప్తవరూధినీపతుల్ • దరిసినడువ
నాగరాశేషమా • నవమోదము వహించి
చతురంగవాహినీ • సహితుఁడగుచు

గీ. స్వీయదేశప్రజార్తి కృ • చ్ఛ్రీలఖేల
బహుళమాగధసైన్య సం • బాధనంబు
కొలికు రౌద్రరసవిశేష • ఘూర్ణమాన
మానసంబున వెడలెన • మ్మహి వడంక. ౩౪

స్రగ్విణీవృత్తము. భూర్భువర్భార కృ ద్భూరి భేరీనినా
దార్భటుల్ ఘోటకానాదార్భటుల్ మ్రోసెనా
విర్భవత్త్రాసమిత ద్వేషి రాడ్గర్భిణీ
గర్భనిర్భేదనో త్కంఠ దీపింపఁగన్. ౩౫

క. తనరాజ్యవర్తులై తగు। మనుజులలో గల్గుపోటు • మానవులెల్లన్
వెనువెంట నంటిరాన। జ్జనపతి సంగరముసేయ • సరభసవృత్తిన్. ౩౬

వ. ఇవ్విధంబున బలసమన్వితుండై నొక్క దినమాత్రంబున శత్రుసైన్యంబు గదిసి. ౩౭

క. అరదంబులు నరదంబులు। కరులుకరుల్ హరులుహరులు • కౌతుకము బరన్
నరపతులును నరపతులును। దురమొనరించంగనపుడు • తుములంబయ్యెన్.

సీ. కుండాంచితాయసో • ద్దండ దండములచే
నెత్తులు బగులంగ • మొత్తి మొత్తి
కఠినోగ్రతరదంత • ఘట్టనంబులచేత
రొమ్ములు బగులంగఁ • గ్రుమ్మి గ్రుమ్మి
పటుభయంకరకాల • పాశవజ్రములచే
వీపులు చెదరంగ • వేసి వేసి
దృఢదృషత్సంకాశ • దీప్తదేహోద్ధతి
మేనులు నలియంగ • మొదపి మొదపి

# తృతీయోల్లాసము

గీ. మలయమారుత చోళసిం • హాళసముద్ర
[illegible] ...న
...బుగని హస్తి ... మా • లంబనంబు
దోచఁదదధిష్ఠత వ్రజం • బేదిపోలె. ౩౯

సీ. ఫాలస్థలాయఃప్ర • ఘాలీన మకుటముల్
ఖడ్గధారలఖంగు • ఖంగుమనఁగ
కవచరూపంబులౌ • ఘనశిలాబత్తుల
కరవాలగతి ఘల్లు • ఘల్లనంగ
గూర్పర గుప్త్యయః • కోశముల్ మండలా
గ్రంబులచే ఖణీల్ • ఖణీలనంగ
బంధుర తరములౌ • స్కంధ దేశంబులు
తరవారు లనుఖరీల్ • ఖరిలనంగ

గీ. పాత్తుకొని మత్తులైనరా • వుత్తులడరి
సింధుకాంభోజ కురుపార • శీకవనాయు
యుపనభవనసవీనవా • హములు బరపి
తునుముల మొనరించి రన్యోన్య • సమతదనర

సీ. రథముల బరపిత • త్సృథుల ఘట్టనముల
నెదురించు భటులము • ష్టదిపి చదిపి
రయముమీరఁగ సాంప • రాయికంబున మోహ
రింపుపాదాతంబు • జంపిచంపి
ఖురుగోలంకులనిల్చి • మొర మొనచ్చినవారి
సిరముల నందంద • జిదిమిచిదిమి
వెనువెంట నంటవ • చ్చిన చౌరబలముల
మించి తచ్ఛదములఁ • ద్రుంచిత్రుంచి

గీ. యుద్భుతాన్యోన్యసైన్యగ • హనము నడుమ
జొచ్చి ఘంటాపథంబుగాఁ • జొచ్చిపెరిగి
రథికు లత్యంతరణమనో • రథికులగుచు
బవర మొనరించి రమితపర్వా • బరవసమున.

వ. ఇవ్విధంబున నుభయసైన్యంబులు దలపడి పరిఘ గదా ప్రాస తోమర భిండి
వాలాసిముసల కణయ కంపణ భల్లాంగచ్ఛురికా కుంతముద్గరశరచక్ర క్రకచ
పాలాంగూలాంకుశకుఠార శూలాదిసాధనంబులం బ్రయోగింపుచుండ నప్పడి

లయవిభాతి. పుడమి గడగడవడక • నెడతెగక నిగుడవడి, పిడుల
నుడుగకడు • బెడిదమగు దంతుల్
తొడరు జడివిడి వడిన • వడువునను మిడుగురులు
గడలుకొను నలుగడలఁ • బడుకడిదిఁ తూపుల్
తడబడక గడుసులగు నొడలనడుములదొడల
నడుగిడులను వెడలిబుడి • బుడివడియు రక్తం
బడర జొడబొడు దుము నెడు • నుడువులను నుడువులను నుడువుచును
విడనిక డిమిని జడ • వడబడ నేసెన్ - ౯౨

సీ. ప్రబల ముష్టాముష్టిఁ • ఘటించికొందఱు
శిరములు పరియలై • తొరుగఁజేసి
ప్రకటఖడ్గాఖడ్గి • బచరించి కొందఱు
కరచరణంబుల • నురుమఁజేసి
క్రమ బాహాబాహిఁ • బెనఁగొని కొందఱు
కాయంబు లనుదును • కలుగఁజేసి
చటులదండాదండిఁ • జర్పించికొందఱు
బిరుసైన విపులఁ • బెటిలమోది

గీ. పటునఖానఖి ఘనపదా పదిఁగచాక
చిని రదారదిననిశేసి • రనుపమప్ర
తాప దీపిత వీరాను • లాపమలర
నుభయపక్ష బలంబులు • రభసమునను. ౯౩

ఉ. భండన భూమినిట్లు భయ • పద్ధతులైకడు నుత్సహించియు
ద్దండ పటిష్ఠతం దొడరి • దారుణయుద్ధము జేసిచేసి బ్ర
హ్మాండ కటాహముల్ బగుల • నార్చిన నద్దిగ్గృహాంతరంబులన్
నిండి ప్రతిధ్వనుల్ నిగుడ • నిష్ఠురగొందిరి దివ్యులత్తఱిన్. ౯౪

వ॥ మఱియు నబ్బలంబు లురుపడి నొకరొకరు తమ శౌర్యంబు మెఱయ ఖడ్గంబుల వ్రేసియు, కుంతంబులఁ బొడిచి కుఠారంబుల నడచి వంకులఁ గ్రుమ్మి శూలంబులఁ జిమ్మి ముసలంబుల మొత్తి పరిఘంబుల విదళించి పాశంబుల బంధించి ప్రాసంబుల వారియించి భిండివాలంబుల భేదించి ముద్గరంబుల ఛేదించి చక్రంబుల విక్రమించి తోమరంబుల నాక్రమించి మఱియు వివిధాయుధంబులఁ బరఁగించిన విరుగు తేరులును, యొఱఁగు నేనుంగులును దిరుగు హయములును, దఱుగు భటులునుం గలిగి విచ్ఛిన్నంబులైన ఛత్రంబులును, విదళితంబులైన కేతనంబులును విద్ధంబులైన తనుత్రాణంబులును విదితంబులైన శరాసనంబులు. విధ్వస్తంబులైన శరంబులు విగతంబులైన బాహుదండికంబులు వికలంబులైన మస్తకంబులు. విలూనంబులైన కరంబులు విశీర్ణంబులైన భుజంబులు విగళితంబులైన వక్షంబులు వివిధంబులైన తుండంబులు విశకలితంబులైన యూరువులు విపాటితంబులైన జంఘికలు విభ్రష్టంబులైన పదంబులుగలిగి విన్యగ్వ్యాప్త కీర్ణన ర్తన పరివర్తన ప్రభూత భూత ప్రేతపిశాచ శాకినీ ఢాకినీ భేతాళాది గణకోలాహల రవంబులుగలిగి బహు ప్రహారణంబులవలన బుడిబుడి బడయు శోణిత ధారాళి ధారావారి పూరంబు దారుణ బాణవిలూన గజవాజి యోధ మేదోమాంస మజ్జ మస్తిష్కంబు. పంకంబు. భుజంబులు. భుజంగంబులు శిరఃకపాలంబులు కమఠంబులు శిరోరుహంబులు శైవాలంబులు కరంబులు మత్స్యంబులు తురంగంబులు నక్రంబులు ద్వీపంబులు ద్వీపంబులు ఛత్రంబులు ఫేనపుంజంబులు చామరంబులు మరాళంబులు. నానావిధభూషణ మణిగణ చూర్ణంబు పులినంబుగల సంగరాంగణంబు మహార్ణవంబు ననుకరించె దంభసంరంభ విజృంభమాణ ద్వంద్వ యుద్ధంబున శతాంగంబుల నిట్టట్టుశేయు మాతంగంబులు మాతంగంబులఁ దూలించు తురంగంబులు తురంగంబుల జెదరించు భటులును నిట్లు నిర్మర్యాదంబుగాఁ బెనంగు సమయంబున. ౭౫

క. మగధ మహీపతి బలమున మగటిమిగల వారలేట, మూర్ఛలములమున్
జెగడుపడఁజేసి తరిమిన। వగచెడి దాశార్హ సేన, వడిబఱచుతఱిన్॥ ౭౬

వ॥ అట్టియెడ వజ్రబాహుండు. ౭౭

గీ. వర్ణితాగ్నేయ బాణమా • వజ్రబాహుఁ
డేయ, నదిజ్వాల లలరంగ • నేదిరాగ
హేమరథుఁడంత వరుణాస్త్ర • మేసిదాని
యణుగుటడంచెను తనసైన్య • ముబ్బుచుండ.

క. చంద్రప్రకాశమునదగు • సైంద్రాస్త్రము వజ్రబాహుఁ డడరించయశో
సాంద్రుఁడగు హేమరథుఁడును • హేంద్రాస్త్రముచేతదాని, యేవడచె వడిన్.

వ. ఇవ్విధంబున సింహంబుల చందంబున శరభంబుల పోలె శార్దూలంబులగతి
వృషభంబుల విధంబున గజంబుల చాడ్పున నంతకంతకు మచ్చరంబు గదు
కొన దివ్యాస్త్ర విలాసంబు జూపుచుఁ జెండంబు మొఱయింపుచు శరవర్షం
బులు వాటింపుచు నిజబిరుదంబులఁ జాటింపుచు పోరునవసరంబున. ౫౭

సీ. చటుల భృత్యామాత్య • సహితుఁడై యువ్వజ్ర
బాహుఁడు వజ్రాధి • పతినిగిట్టి
అయిదింట గుఱ్ఱంబు • లారింటసారధి
నేడింట దధ్వజం • బెనిమిదింటఁ
జాపంబు తొమ్మిది • తూపులఁ దత్తను
త్రాణంబు దశసంఖ్య • బాణములను
నతుకంబుగాఁడంగ • వసనేయుటయుఁజూచి
క్రోధారుణాక్షుఁడై • యోధవరుఁడు

గీ. నతడు నిగుడించు శరముల • నంతకంటె
బెడిదమగు తూపుగమిచేత • నుడిపి తత్ప
కార మార్గంబునకు ప్రతీ • కారమొనయఁ
జేసి కడుమాట యుద్ధంపు • చిత్తమునను. ౫౮

క. తన యోధాగ్రణులందఱిఁ గనుఁగొని చేవీచికడిమి • గడలుకొనఁగఁద
త్తున్ని శితబాణాసారము మనువడివారింపుచోన, మోఘాస్త్రుండై. ౫౯

గీ. స్వర్ణవర్ణంబు గురిసిన • చందమలర
నతని యరదంబు భోజను • యంబు జేసి

విజయ బిరుదాంక నిజయోధ • వితతిఁజూచి
వల్లుఁడని బరఁగ సమెచ్చ • నట్టియెడల. ౬౦

సీ. ఆహవంబున ద్రుక్కి • యలతిజెందివ్రజ
బాహుల్పై మాగధుల్ • పలువు రేచి
*యొగ్రభాగ వాక్ప్రతిత్య • గుదగధిష్ఠలములఁ
దవిలి శస్త్రాస్త్ర సం • తతులచేతఁ
• దద్దేహము సహస , ధారంధ్రముగఁజేసి
కొండజాతని తేరుఁ • గూల్చి రకట
గొండజాతనిసూతుఁ • గుదియఁగఁజేసిరి
కొండజాతనివిల్లు • గ్రిందువరచి

గీ. రెలమిఁగొండజు తత్తూణ • మిలఁబడంగఁ
జేసిరొక కొండజాతనివా • జివజంబు
నరికి యిటువలెనా రాజు • విరథుఁజేసి
పట్టిబంధించి రత్యంత • బలముమెరయ. ౬౧

చ. కలువలె బద్ధుఁజేయుచును హేయరథాధిపు యోధులెల్లఁద
త్ప్రటసదివాప్త భృత్యగణ • బాంధవులందరిఁ బారదోలియు
త్కటులయి భేరికావిజయ • ఢాంకరణంబుల శంఖకాహళ
స్ఫుటరవముల్ చెలంగఁ బరి, పూర్ణ మనోరథులై త్రిదోపఁగఁ. ౬౨

సీ. ప్రహిత చకాంచనమణి • మయములై రంజిల్లి
కనుపట్టు ఘనశతాం • గములఁ గొన్ని
దానధార సమిం • ధానగంధోల్లస
ద్బంధుర తరయూథ • పములఁ గొన్ని
[illegible] కరితత్ని • పల్యాణభరవాయు
గమనంబు గలతురం • గములఁ గొన్ని
[illegible] వాహకో • న్నతకాయములు గల్గి
సమదంబులైనయు • ష్ట్రములఁ గొన్ని

* [illegible] దేశంబుల తా. ప్ర. (౩) తద్వ్యాహము [illegible].

గీ. బహుళ ముక్తాఫలాంచిత • పటగృహముల
వితత సౌవర్ణ ముద్రికాం • చితవిశాల
వేటికా సంఘముల రాజ • బిరుదకేత
నాదులను గాని రత్యంత • మోదమలర, ౬౩

వ. మఱియు. ౬౪

గీ. వరచు తన్మంత్రి ముఖ యోధ • వరులమీఱ
వాయువేగాశ్వములఁ దోలి • వారిబట్టి
పాశ నిర్బంధ దేహులై • పరగజేసి
హేమరథు ముందల నిడ నమ్మ • హీశుఁడపుడు

గీ. వీని నా వజ్రబాహుని • విరిచికట్ల
తోడ బహుళకటములతోఁ • గూడబెట్టి
తెండు మీఱిపు డేమర • కుండుడనుచు
విజయ దుందుభి మ్రోయించి • వేడుకలర. ౬౫

క. నృపుఁడు చతుర్విధసైన్య | ప్రతతుని గని మనము వజ్ర • బాహుపుర శ్రీ
నిపుడపహరించి యీ రా | జ్యపరిగ్రహణంబు సేయు • నర్హంబయ్యెన్. ౬౬

క. అనియా నతి నొసఁగిన వా | రను మోదముతోడ వేగ • నమరఁగ శుభల
త్మ్నని దగు తత్పురవరము | న్ననిలగ్గకు జొచ్చి మిగుల • కడిమిఁ దలిర్పన్. ౬౭

హేమరథునిభటులు వజ్రబాహుని పురంబు కొల్లగొనుట.

క. వీరులు తత్పురి కావలి | వారలఁ గాంచుకయు వేటు • వాటుల చేతన్
బోరగ వారలనెల్లం | జీరికి గైకొనఁ శత్రు • సేనలు కడిమిన్. ౬౮

గీ. ధనకనక వస్తువాహనా • దినిదనర్చు
వజ్రబాహుని గరిమమును • వ్వరుసగాఁగ
దోఁచి తమతమకిష్టవ • స్తువులఁ గొనుచుఁ
బ్రభుని యుక్తిఁ దదంతఃపు • రమున కేగి. ౭౦

సీ. నవవిధ స్థానసం◦భవ మౌక్తికంబులు
గలుగు దివ్యాగార ◦ ములుగలంచి
వజ్రవైడూర్యప్ర ◦ వాళగోమేదికం
బులమించు నవసితం◦బుల నడంచి
సౌవర్ణ చేలసం ◦ చయముల విలసిల్లు
లలిత చతుశ్శాల ◦ ములఁజరించి
రమణీయ తపనీయ ◦ రౌప్యముద్రికలుండు
భాండాలయంబుల ◦ బడలుపరచి

గీ. హారకేయూర మంజీర◦చారుమకుట
ఘటిత పేటీభరంబుల ◦ గాసిఁజేసి
వలసినట్టులఁ దిరిగియు ◦ వ్వారిగాఁగ
నపహరించుచు రిపుసైన్య ◦ మలరుమతిని. ౭౧

సీ. రామణీయకకన ◦ ద్రాణివాసస్త్రీల
రాజిల్లుదాసదా ◦ సీజనులను
జన్యస్థలమునకు ◦ జనకశాలలనుండు
రంగత్తురంగమా ◦ తంగములను
వహ్నిమూర్తి విహారి ◦ తావివాహితనిత్య
మాన్యలై తగురాజ ◦ కన్యకలను
పోషితవ్యక్తశా ◦ పోతమాయూరాది
భరిత చామీకర ◦ పంజరములు

గీ. జనమనోహార మగుమృగ ◦ సంతతులను
మహితకస్తూరికాసంకు ◦ మదమృగమద
ముఖ్యగంధ యుతకరండ ◦ ములును మొదలు
గాఁగ సర్వస్వము ◦ హరించి ◦ కౌతుకమున, ౭౨

సీ. ద్రాక్షాఫలసమృద్ధి ◦ తస్వాసవంబుతోఁ
జరణాయుధోపదం ◦ శంబుగూర్చి
పక్వగీతవరసాం ◦ వత్సధుతతితోన
జ్యాపైత్రరంబులతో ◦ సంగ్రహించి

మత్స్యండికాదిసం • భవమధుప్రతతితో
సచ్ఛీకతరసంబు • సంఘటించి
మహిత గంధోత్తమా • మైరేయముం గూర్చి
యాపక పలలంబు • నావటించి

గీ. వారవనితాళి పెలాస • పంబు గాఁగఁ
జేసి పానంబొనర్పఁగం • జిల్లువారి
బట్టికొని పరిమదావన • ప్రముఖపులను
రూపుమాపుచు నవ్వాడ • రూఢజనులు. ౭౩

సీ. మర్భరావద్వ్యగ్ర, కార్భకస్త్రైణాశు
పాతపంకిలమునే • పట్టుఁజూడ
గుల్ఫద్వయసకాత • కుంభముక్తాఫల
శార్కరిలంబునే • చక్కఁగనిన
జానుమాత్రసితాభ్ర • సంకుమదాగరు
గంధగంధిలమనే • కడదలంచ
స్కందఘర్మాధక • చణకశాలికులుద్ధ
మాషతుందిలమునే • మస్కసరయు

గీ. ఘనజనులఁ జూరఁబుచ్చినఁ • గతిసదిత్సు
రాపణంబులు జూపట్ల • నభిలజనులఁ
జేరఁ గొనుచుఁబోవ సింధుసం • భరితనవడ
మనుకరించెను వినువారి • కద్భుతముగా. ౭౪

గీ. అప్పుడా బాల గోపాల • మనకప్రజలు
నొక్కమొగ్గవెరులకుజిక్కి • ప్రుక్కిపొక్కి
క్రుందియాక్రంద నధ్వని • జెందియుండ
శత్రుజను లేగుచుండ త • త్సనుయయమునను ౭౫

మ. సరథాశ్వేభభటాళియై మగధదే • శంబేలు దున్నట్టి హే
మరథాళిఖ్య నృపాలపాళి మిగులన్ • మత్తిల్లి దాశార్హరా

జ్యరమాధీశ్వరు వజ్రబాహున్నృపుఁ బ్ర ♦ ఖ్యాతాత్ము నాఁ జేసి చె
చ్చెరబంధించుచుఁ బోవువారు మొఱసెన్ ♦ శేషించు దేశంబులన్. ౭౬

క. ఆవార్త పరఁగ రాజ్య శ్రీవిభవసమేతరాజ ♦ శేఖరులమహా
త్యావిష్కృతోక్తుల దరభయావహాతన్ జాగరూకులై యుండిరొగిన్. ౭౭

వ. అట్టియెడ. ౭౮

పద్మాకరుఁడను వైశ్యుఁడు భద్రాయువు సహాయమున
—వజ్రనాభుని దండించుట.—

సీ. ఒనరభద్రాయుర ♦ భ్యుదయాదినెఱిగిన
వాఁడొటఁ జేసియా ♦ వైశ్యవరుఁడు
మథితారి వీరుఁడ ♦ మ్మగధాధి నాథుఁడు
ద్వృత్తుఁడై యస్మత్స ♦ మృద్ధిగల్గి
మించుదేశంబాక ♦ మించగలఁడువాని
విక్రమంబిమ్మహీ ♦ వీరుచేత
నడగింపఁ వలయుని, యడ నదియుంగాక
మును బితూృణము దీర్చు ♦ కొనిననతఁడె
గీ. సుతుఁడుగాక తదన్యుఁడు ♦ సుతుఁడె మఱియు
నిర్విఘ్నంబున భూపాల ♦ కేప్సితంబు
సర్వజన సమ్మతంబుని ♦ శపథసాద
లబ్ధబలుఁడీతఁ డతనిగ ♦ లంచగలఁడు. ౭౯

మ. ఫణిహారుల్ పరదేశ వైవధికులై ♦ ప్రస్తావనావాప్తివా
క్ఫణితిన్ మార్గగతార్య వల్లభునితో ♦ భాషింప నాతండుత
త్ఫణితిం జెప్పిన సూర్భజదూర్జితశర ♦ త్పర్జన్యగర్జవిజృం
భణమేపారనపారకోప మలరన్ ♦ భద్రాయువభ్యున్నతిన్. ౮౦

సీ. ఘనయోగివరలబ్ధ ♦ ఖడ్గశంఖంబులఁ
గొనిహీర కవచంబు ♦ మునుధరించి
మణిగణాలంకార ♦ మకుటాదులవహించి
రమ్యదుకూలాంబ ♦ రములఁ గట్టి

పరశుపట్టసశూల • కరవాలముద్గర
ప్రాసతోమర భిండి • వాలముఖ్య
శస్త్రాస్త్రములనెల్ల • సవరించుకొనివీర
గంధమాల్యంబులు • తగ్గ లిరఁదాల్చి

గీ. యీశ్వరాజగవసనాన • విశ్వమైత్ర
మనుశరాసన వరముల • పాశుపతము ఖ్య
మార్గణంబుల విలసిల్లు • భర్గుఁడనఁగఁ
దనరి సఖుఁడైన దత్రైవాశ్య • తనయుఁజూచి. ౮౧

క. ఇపుడు ధనుర్విద్యాభ్యా ! స పరిశ్రమ రాకుమార • చాతుర్యముతో
నుపమింపజేసి శాత్రవ! నృపకులము ను గీటడంచి • నిగుడఁగవలయున్, ౮౨

క॥ కావున నీవీ యెడ, వీరా! వేశమ్ముబూను, నాస • హాయముగలుగన్
నావిజయము. నీవిజయము! గావినరింపుమి తె మైత్రి • గడలుకొనంగన్. ౮౩

గీ. అన్నను బలికిన సమకోచి • తాసమాన
భాసమాన సముద్యచ్ఛ • రాసమాన
నీయ బాణప్రసాధన • నియతుఁడగుచుఁ
దద్వధోత్సాహ పరతచే • దగిననగుచు. ౮౪

సీ. ఋషభ యోగీంద్రము • హేశ్వరాంఘ్రులముందు
స్వాంతంబులోపల • సంస్మరించి
మాతృపదనముత • న్మానితాశీర్వాద
మొంది వైశ్యాధ్యునా • నందమొనసి
బహుమంత్రపూర్వక • ప్రహరణంబులుమూర్తి
మంతంబు లై కనం • బడివెలుంగ
ననఘుఁడై రంజిల్లు • మనయుఁ దవ్విధమున
బూలిచినవారిన • స్ఫురజనమ్ము

గీ. లలరి శత్రుల గెలచి మీ • రతిరయమున
రావలయునని దీవింప • భావజారి
కవచ సాయుర్ధ్య యుక్తవి • క్రమధురీణు
డైన భద్రాయువవ్వేళ • హర్షమెసఁగ. ౮౫

శా. ద్రాఘిష్ఠప్రతిఘాతఘాతవిధిసం • ధానోన్నమి నీసామహా
శ్లాఘాఘామోఘ జవప్రభావవిలస • చ్ఛౌర్యంబునన్ స్వీయధా
రాఘోట్టాణము నెక్కి దివ్యబలధా • రంధర్వ ధుర్యుండునై
మేఘాడంబర శంబనిస్వనము • న్మిళద్రవారంభుఁడై. ౮౬

క. వినయంబుతోడ సునయుండు ఘనతర కాంభోజఘోట • కము నెక్కి యతో
ధనుఁడై తగు భద్రాయువు వెంవెంటన రాగ దివ్య • విభవంబలరన్. ౮౭

వ. ఇట్లు త్వరితగతిం జనుదెంచి. ౮౮

సీ. అశ్రుత (శాప్మాణం • బజ్ఞాతపార్థివం
బవిదితార్యంబబు • ధ్వాంక్ష్యవర్ణ
మాహృత ధనధాన్య • మాద్రదసత్కంఖాణ
మాస్ఖలద్గజబృంద • మావిలూన
రథసంఘ మాధ్వస్త • రథ్యారథరాజాత
నాభమచ్ఛేకంబు • నాపతద్వ
జవ్రజం బభిన్న • సౌధాగ్రమాగళ
త్తోరణం బాకృత్త • దుందుభియును
గీ. గలితతత్పటణరాజ • కంబుస్వ్ర
థాసమావర్జితపదాతి • మానమగుచు
దుర్మదప్రాహృత శేమవ • స్తువులు నిట్టుల
గాసిఁజెందిన కనంబడ • కనికరమున. ౮౯

శా. కంటేమత్సఖ, యస్మదీయపిత్రుసో • త్కంఠాఖిలశ్రీపురీ
లుంటాకప్రకట ప్రతాపుఁ డనని • శ్లోకంబు గావించిపె
న్కంపై హేమరథుంకు పోవఁగలఁడే • బాణానలజ్వాలలో
క్కుటన్ జేయుచుఁ దగ్ధశేంధనము వే • కన్గొండఁగా జేసెదన్

క. వనజాప్త తురగమేగతిఁ జనునాగతి నామనోజ్ఞ • జవనాశ్వము వే
చనునీవును నా వెంబడిఁ జనుదెంచితి వేవినాకు • సంభ్రమమలరన్. ౯౧

వ. ఇవ్విధంబున బరవసంబు జేసి జయదుందుభి భేరీ ఢాంకారాదుల నిగుడింపుచుఁ
బోవు మాగధ సైన్యంబును శౌరి జనమాత్రం గూడముట్టె. ౯౨

శా. స్వోద్ధానర్ఘ్యచిరత్న రత్నమకుటమే • రుద్యద్ధనుశ్శింజినీ
గాఢాకర్షణమాచరింప నదియా • కల్పాంత భూభైరవ
ప్రౌఢధ్వానము నై తగన్ శ్రవణమా • క్రాంత ప్రత్యర్థిస్థాత్రీసం
రీధాలజ్జిత వేపమానతనునా • రీగర్భ నిర్భేదమై. ౯౩

గీ. అమ్మహానినాద • మఖిలభీతిప్రదం
బయ్యె రిపులగుండె • లావలించె
గ్రాంతనడికెఁ దెలివి • గూడంగ రిపుసైన్య
మొక్కమొగినిఁ గవిసెఁ • బిక్కటిల్లె. ౯౪

వ. ఇట్లు గదిసిన నక్కమాగధ కంఠీరవుండు మనోవేగంబుగల నిజతురంగంబును దత్సైన్యంబునకు వలయాకారంబుగఁ బరపి, దానవాభూములదననార్చి నిలునిలుమని యదల్చి తన ధనుర్విద్యాభ్యాస పాటవంబుం జూపం దలంచి లాఘవ దృఢత్వలక్ష్యశిద్ధినరఁ బ్రళయార్భ విక్షురణాద్భ్రనిరర్గళ నిర్గళన్నిర్ఘాత పాతనంబుల ననుకరించు మార్గణ గణపాతంబు బరగింపుచు శత్రుసేనారణ్యంబు ప్రాక్పశ్చిమోత్తర దక్షిణ దిగ్భాగంబులేర్పడ ఘంటాపథంబుగావించి యాహవదోహలంబగు తన వాహనంబు మొరయ నిర్వక్రవిక్రమక్రమంబు నెఱపుచు నెక్కడం జూడ నక్కడం దానయై యెరికి నెదిరింపరాక యొదిరించినవారిని నొక్కకోలను నొక్కనిఁ బెక్కుకోలం గూలించి కేలిసలుపుచు నప్పటప్పటికి జ్యానాదంబు నిగుడింపుచు లస్త్రకంబులను భయకోటుశెడి దంపుటంప వెల్లినిగుడించుచు నెదిరినిల్చు పరుల బదగుల్ఫజంఘజానూరుమధ్యతుందవక్షఃకంఠంబుల గత్తులబచ్చడిసేయు చందంబు నొందించి చతురంగ బలములఁ దునియలు పయలు గుదులునై బడలు పడ నడచనఁ గూలియు వ్రాలియుఁ జచ్చియు విచ్చియుఁ గెడసియు మడసియు జెల్లియు డొల్లిఁ ద్రిప్పితిసియు విరిసియు వెరచియు నుండ మొత్తుంగొని మెఱసిన తెఱంగున నొరివియుద్ధాన

చ్ఛందంబునఁ గార్చిచ్చుఁ బొదివినచం దమ్మున నింద్రజాలంబుఁజూపిన యేపున మాయఁగావించిన పగిది మంత్రించి పడవైచినగతి విపక్షబలంబును గనుపుగొట్టఁ బశుపతి సంగి ప్రళయసమయసమారంభ సంరంభ జృంభమాణ పరాక్రమంభవీనిటల తటస్ఫుటిత కీలికలాపం బనందనరి యమ్మహాత్ముండు మందస్మిత వదనారవిందుండై. ౯౫

శా. పూజ్యప్రాజ్య విభావిభాకరములై • పుంఖాను పుంఖంబులై
సజ్యవ్యాసనముల్లసితంబులై యిన • శస్త్రంబులన్ సంప్రహా
రేజ్యన్ వైరిలుశత్రుసంచయముఁ దా • హింసించి తద్రక్తపూ
రాజ్యోద్ధారోద్ధిరవక్రవిక్రమశిఖన్ • హర్షంబు నొందింపుచున్. ౯౬

చ. దరమొనరింపు శాత్రవుల • తోరములై దగు మేను లెల్లఁ జ
ర్ఝరములై దలిర్చగను • సాయకముల్ పరగించి మించి దు
ర్భరతర శాతహేతుల, న • పారవిరోధి పదాధి నీశభీ
కరకర పాదమస్తకని • కాయముఁ దెగటార్చి పేర్చుచున్. ౯౭

వ. మఱియును. ౯౮

ఉ. ఆశుగవేగతో మరి గ • దాసిపరశ్వధ • చక్రకుంత ది
వ్యాశుగ ముద్గరాది నిప • హంబుల మిన్నగుడింపుచున్ ధనుః
శాశల మేర్పడన్ భయద • కాండమునొక్కటి నేర్చి సంగరా
భ్యాశభటాళిమీఁద తెగ • జాపెనణిక్రుతుఁ డిచ్చమెచ్చగన్. ౯౯

చ. పొందదగు కోలఁ బూనుటది • పొందగ వింటఘటించుటంతలో
నెదిరిన మార్బలంబుపయి • నేయుట వారనిలోనఁ గూలుటన్
మదవదరాతి భంజనుని • మానసమొక్కటెరుంగు గాక వా
నిదురము జేయునేరుపు ఫణి • ప్రభుకైన వశంబె యెన్నగన్.

గీ. పదియునైదు రెండు • పరగంగనొక్కటి
యెదురులేని తూపు • లేర్చిఁ వుల
బదిపదుల నవేయుఁ • బదిసహస్రంబుల
లక్షదాను మహాస్త్ర • లాఘవము న ౧౦౧

వ. అట్టియెడ.

ఉ. ఈసున శత్రుసైన్యము ల • నేకములై తగు సైనికోత్తముల్
దోసటమై మెలంగఁ బటు • భల్లసమూహము లుల్లసిల్లఁగన్
వేసియు డాసియుం బరఁగ • విచ్చియు నొచ్చియు మచ్చరంబుతోఁ
గాసిఁదలిర్ప నిప్పగిది • కయ్యముదయ్య మెరుంగఁజేసినన్ ౧౦౩

చ. అనువుగ వారుబట్టిన శ • రాసన బాణ కృపాణ తూణముల్
తునుకలుగాఁగఁ బెట్టిదపు • తూపులనేయుచు వారివర్మముల్
దునిమి తదంగకంబులను • దూరఁగ ఘోర తరాశుగంబులన్
జొనుపుచు రక్తపూరములు • జొబ్బిలఁజేయుచు కౌతుకంబునన్ ౧౦౪

క. గంధేభగమనుఁడరి ని • ర్గంధన మొనరించి కార్ష్ణ • క్రవ్యోద్ధతగో
గంధన సఖవిశిఖా సం • ధానితఘనగవేషోనర్చఁ • జతురిమ మెరయన్. ౧౦౫

వ. అప్పుడమ్మాగధ బలంబులు, ౧౦౬

చ. తమతమ దర్పమేర్పడ మ • దంబున గొల్తలఁ జేసిసంభ్రమ
భ్రమితమ దేభ ఘోటభట • పంక్తుల. నేరుపుచేఁ బ్రచక్రసూ
ద్యమమలరంగఁ జేయుచు య • థావిధిగా మొనలేర్పరించి, భూ
రమణుసితోడ శత్రులుదు • రంబొనరించిరి పేరువాడుచున్. ౧౦౭

గీ. అట్టి సమయంబుఁ జూచి వై • శ్యాగ్రగణ్య
సుతుఁడు భద్రాయుఁగనుచునో • శూరవర్య
ఘనగదాయుద్ధ నైపుణి • గందునాకు
చూడుమని వాహనము డిగ్గి • స్ఫురణ దనర. ౧౦౮

వైశ్యసుతుఁడు హేమరథు సైన్యంబుతోఁ గదాయుద్ధంబు సేయుట.

ఉ. దండధర ప్రచండతర • దండసమానమునైన పెన్గదా
దండముఁ గేలఁబూని, భుజ • దర్పమెలర్పనిజాంగకప్రభా
మండల మానదేశమున • మార్బలముల్ గని భీతిజెంద ను
ద్దండ పటుత్వమొప్పఁ బవి • దారుణమనిఁ బొల్చనిల్చినన్ ౧౦౯

క. కనినగరాధీశ్వరమ! త్రినివహమధ్యమున శూరు • ధన్యుండనువాఁ
డనుపమ బలదర్పోద్ధురుఁడన! ననవశంకింపుగ నుగదవ • సంగరనివచ్చెన్. ౧౧౦

వ. ఇట్లువచ్చిన యవ్వైశ్యనందనునకు నభిముఖుండై. ౧౧౧

మ. సమదాటోపతవార లిర్వురుజయే • చ్ఛన్ గారుచో మండలఁ
భ్రమణంబుల్ బటుసింహచంక్రమణముల్ • పాటిల్ల నుద్యద్గదా
సముదారంభ విజృంభితోభయగదా • సవ్యాపసవ్యప్రభా
సమలంఘప్పదు లుప్పతిల్లభయదా • రావంబు నంభోరుచుర్. ౧౧౨

వ. మఱియు హరిగతి గజగతి వ్యాఘ్రగతి, సింహగతి, జంబుకగతి, మర్కటగతి, మార్జాలగతి, హరిణగతి, చటకగతి, తాండవగతి, మొదలగు ద్వాదశగతులు జూపుచు పరిఘాతంబు నావృతంబు నావిద్ధంబు నాపాతంబును విభ్రమణంబును మానుషంబును నిర్మర్యాదకంబును జిత్రికంబును భిన్నంబును సవ్యకరంబును దుంగబాహువు నాప్లుష్టప్రహారంబు వేల్లితంబును గురించతంబు నుప్వస్తికంబును మొదలగు ద్వాత్రింశత్ప్రకారంబులఁ బచరింపుచు. ౧౧౩

ఉ. మొనలు గనుంగొనంగఁ దల • ముప్పిరిగాఁగదియంగఁజొచ్చి నె
మ్మనములఁ గోపముల్ గదుర • మర్మవిభేదన మాచరించునే
ర్పున బహువిచిత్రమార్గముల • మూపులు వీపులు మోదిమోది తెం
పౌనరఁగ నేదడీర్చుకొన • గోపమువైపున నేపుజూపుచున్. ౧౧౪

శా. పాదద్వంద్వ సమాహతింగలమహా • భాగంబు గంపింపగా
హాసుల్ తద్భరమానిభేదమున ని • ర్వ్యాపారులై యుండపె
న్వేదండంబులు సింహముల్ శరభముల్ • ద్వీపుల్ మహాశైలంబులన్
భేదంబొందుచకేక పోరుగతిని • కీర్తిన్ విజృంభింపుచున్. ౧౧౫

వ. ఇవ్విధంబున. ౧౧౬

మ. చలవాదంబులరన్ స్వసంభృతగదా • సంఘట్టనప్రోజ్జ్వల
జ్వలనజ్వాల భవస్ఫులింగములచే • సంగ్రామరంగస్థ

స్థలదుద్వేషుణు లోక్కి పెట్టునఁ గలం • గంబార తద్గాత్రముల్
శలభాభంబులఁజేసి కాల్చి నిధన • స్థానంబు నొందించినన్. ౧౧౯

క. ఇనతనయుఁ డివ్విధంబున। తననెచ్చెలియైన వైశ్య • తనయుఁడు తోరన్
గనినీవు విశ్రమింపుము। ననుగనుగొను యుద్ధమిపుడు • నర్చెదననుచున్.

—రెండవతూరి భద్రాయువు శత్రుసైన్యంబుతోఁ బోరుట.—

ఉ. చండతర ప్రభా విభవ • శాతశరంబుల నేర్చి పేర్చి దో
ర్మండల కుండలీకరణ • మండితచాపలతా విశేషుఁడై
ఖండనభూమి శాత్రవుల • భల్లముఖంబు దెగటార్చి యార్చెనా
ఖండల దివ్యముఖ్యులును • కౌతుకమానసులై కనుంగొనన్. ౧౨౦

వ. అట్టిసమయంబున భీషణహేషావిశేషరంగదుత్తుంగతరంగసన్నిభంబులగు తురంగంబులు ప్రావృట్సమయోచిత పర్జన్యగర్జావిజృంభణ శుంభచ్చతుర్దంత కాంతంబులగు దంతావళంబులు దీర్ఘఘుర్ఘురనినదావక్ర చక్ర సుందరంబులగు స్యందనంబులును చటులాయుధ పటల సముద్భటులగు వీరభటులును; నిజాధిపతి పనుపున నడువ దచ్చతురంగ బలపదాఘాత భూతల సముద్భూత ప్రభూత ధూళిపాళి పిహిత కాంతిగలిగి మార్తాండ మండలంబు కళఁదొలంగ విశ్వవిశ్వంభరాతలంబు తద్రజోమయంబై వెలుఁగ ప్రతిపదవాద్య మానోద్యద్భేరీ పటహఢక్కా కాహళ ఝల్లరీ మర్దలాది వాద్యవిశేషంబులు మ్రోయ తత్పరాగ భరంబున మునింగి యొకరొకరు నెఱుంగక పేరెలుగుల మెలంగుచు కనకమణి మయంబులగు తమతమ ధ్వజంబులు గుఱుతుగా యుద్ధంబునకుఁ జొచ్చి భిండివాల మండలాగ్ర భల్లరాచకృపాణ నఖర ప్రముష్టి ముద్గర శూలముసలభుసుండిక ప్రాసప్రకూర్మ్యకంపనగద కుఠారోద్దండ కణయకుంత పరశుచక్ర పరిఘపట్టసంబులను వంకిణి సబళంబుల సెలకట్టెల చిరుతచేయమ్ముల గొరకలు నురియలు మొదలగు బహువిధాయుధంబుల నారాకుమారుంగప్పుచుఁ గదియుం గనుంగొని. ౧౨౧

క. ఆరథికులలో నొక్కడు। సారథుఁ డెదుటన్ వసింపక • నతిజవమున నా
త్మాస్వాధహయమునడిగి గరు। డారయమునఁ దద్రథంబు • నందుచుకడిమిన్.

గీ. సుసితాస్త్రంబుచే వాని • సూతుఁ దునిమి
తద్రథికు శిర మొక్కన • స్త్రమున నరికి
తా మహారథుఁడై యుండి • తనదు సఖుని
సారథిగఁ జేసి పరశరా • సనము బూన. ౧౨౩

వ. అట్టియెడ. ౧౨౪

ఉ. వారణవృత్తి మాగధులు • వక్రతసారథి కాథ్యు తేరు దా
జేరుచువచ్చి హెచ్చియిరు • గేవలఁ గ్రిందను వెన్క ముందరన్
నీరువుమీరనిల్చి యతి • నిష్ఠురశస్త్రములేసి రుజ్యల
ద్వారిధరంబు లొక్కమొగి • వారికణంబులు రాల్చుకై వడిన్. ౧౨౫

వ. ఇట్లు గదిసినం గనుంగొని.

సీ. ఆమహారథికుండు • వామదక్షిణపాద
జలజముల్ సవ్యాప • సవ్యములుగ
సాచిపార్శ్వద్వయీ • సంచరత్పంచక
శూన్యవర్త్యలమందు • స్రుక్కఁ జేసి
సమముగాఁ బదపద్మ • యమళంబు నియమించి
చరమభాగస్థాను • వపులనడఁచి
మంథానదండసం • భ్రమణంబు నొందించి
యాగ్రతస్సరసప • త్నాళిఁ గలఁచి

గీ. యంఘ్రి సరసిరుహములనా • యామములుగఁ
జేసి తన తేరు క్రిందటఁ • జెలఁగుచున్న
బలువిరోధి వరూథినీ • ప్రభలు దోఁచ
భూరిశరములచేత న • ద్భుతనియతని. ౧౨౬

కం. నమరథిక ప్రత్యాలీఢము నాలీఢంబు మునుగ • డల్గొనుచుండన్
సమపాదమండలంబున • కమనీయస్థానవాచ • కంబున బోరెన్. ౧౨౭

వ. ఇట్టియెడ. ౧౨౮

ఉ. కొండల మండకప్పగర • కూటవకూట విధంబుదోపగా
వండడిగాఁగ గూడి శర • జాలములన్ నిగుడించి మించనా
వండడి కయ్యమియ్యకొని • శౌర్యధురంధరుఁడైన రాట్సుతుం
డెంతయు జూడఁదానగుచు • నేపడిచెన్ రిపుకోటి నయ్యెడన్. ౧౩౦

వ. మఱియును, ౧౩౧

చ. సొగసగు కెంపుసొంపుగల • చూపులఁ బుట్టిన కోపవహ్నిగ్రొం
బొగలెగయంగ గాద్రరస • పూజ్యతరాజ్యము చేతఁ బైపయిన్
నెగడగఁజేసి యీసున న • నీకచరారులమీఁద దీపితా
శుగమరి, బోసియేయనది • సూరెలముట్టి దహించె వ్రేల్మిడిన్. ౧౩౨

ఉ. ముక్కులు చెక్కులుం జెవులు • మూపులు వీపులు జానుజంఘలున్
బక్కలు డొక్కలున్నలలు • ఫాలతలంబులు రంబులూరువుల్
వెక్కసపాటొనర్చు శర • వేగమెలర్పఁగఁ జక్కుచక్కుగాఁ
జెక్కుచు నుక్కడంచె రిపు • సేనల గ్రక్కున నుక్కుమీరగాన్. ౧౩౩

వ. ఇవ్విధంబున నయోధ్యాధవరుండు లయకాల కాలకరాళభీలాలిక కీలికీలా కలాపంబు మెఱసిన తెఱంగునఁ గాండప్రకాండంబులు నిగుడింపుచు నిజబలంబులఁ గసిమసంగినం జూచి కోపాటోపంబున హేమరథుండు దగ్గరి. ౧౩౪

మ. విలసచ్చాప విలాసకౌశల సమూ • విఖ్యాత తేజంబుతో
బలవద్బాణ పరంపరల్ గురియుఁడ • బాణంబు లావ్యోమభూ
తలమార్గంబులఁ బర్వి వైరి జనసం • త్రాసంబు నంబొల్చియు
జ్వాలుఁడౌ రాసుతుపై పయిన్ని గుడెగీ • బాణోత్తముల్ భీతిఁగన్. ౧౩౫

వ. ఇట్లు నిండిన, ౧౩౬

సీ. అమ్మహా వీరాధ్యుఁ • డాశీవిషాభంబు
లై హేమరథుఁడేయు • నస్త్రములను
దిలలంతలై పోవ • దీవ్రాశుగంబులఁ

జరగించి తచ్ఛత్రు • బలములెల్ల
జర్ఝరితాంగులై • సమరవిద్రావంబు
నొందంగఁ గుందించి • డిందుపరచి
చండకుండాకాండ • హిండితాంచితభుజా
దండకుండలితకో • దండమలర

గీ. సర సకరపద్మ సవ్యాప • సవ్యముక్త
నిబిడనిశిత శిలీముఖ • నికరములను
సమర సమయసముద్భూత • సాహసప్ర
తాపదీపితుఁడై రణ • స్థలినిగుడ్చె. ౧౩౭

వ. ఇట్లు నిగుడించి వేఁడిమిఁజూపిన. ౧౩౮

మ. జ్వలనాస్త్రంబరివోసి హేమరథుఁడా • శర్వప్రసాదోజ్జ్వల
ద్బలవద్వర్మ మహాప్రభావుఁడగునా • భద్రాయుపై నేయఁది
క్కులునిండన్మిను మంటమింట నెగయన్ • ఘోరస్ఫులింగావళుల్
గలయంబర్వఁజటచ్చటార్భటులును • స్తన్పట్టగావచ్చినన్. ౧౩౯

సీ. ధగధగద్దీప్తిసం • ధానా చిరప్రభా
దూరస్త గాఢాంధ • కారమగుచు
ఘుళఘుళధ్వాన ని • ర్గళిత నిర్ఘాతాప్తి
బధిరీకృతాజాండ • భాండమగుచు
ఫెళఫెళ స్స్వనగ • ర్జిత నిర్భరార్భటి
స్తనితభీయాభవ • త్స్వర్గమగుచు
గళగళన్నాదసం • కలిత కూలంకషా
పూరితాకూపార • వారియగుచు

గీ. ఝుళఝుళ స్వనభేదసం • జాతధూత
వారిధారాళ ధారాను • కారిఘోర
వారి వాహాంబుజనియించు • వారిదాస్త్ర
మేసె భద్రాయుఁడనలాస్త్ర • ముల గలంచె. ౧౪౦

ఉ. భూధర బాణమా మగధ • భూధవుఁ జేసిన సర్వలోకసం
బాధకరంబుగాఁగ బహు • పర్వతరూపము దాల్చి యప్పుడా
యోధన భూమి జృంభితజ • లోద్ధత రాట్సుతు మీఁదఁ బెన్శిలా
సాధనముల్ నిగుడ్చుచును • సత్వరవృత్తిఁ • గడంగ నయ్యెడన్. ౧౪౧

సీ. భద్రాయువంతటి • పర్వతాస్త్రంబై దనర్చిన
దంభోళిశస్త్రము • ద్ధతినిగుడ్చ
పదికోటి శతకోటి • యై తేజితస్వీయ
ధారాప్రభా ధాళ • ధళ్యమొనయ
చటులమాగధసము • త్సర్జితాస్త్రంబుపై
నిగుడి మున్నున్నంట • నెగయుచుండ
గండశైలములతోఁ • గదియంగ తత్పతు
ములదచ్ఛిలాదుల • ముందుముంచి

గీ. గిరులఁ దరులఁ బదుద్బుద్ధ • హరులగిరుల
జరుల గిరులఁ దదుద్యాన • తరులనిరుల
మూలహీనంబులై పోవ • నేలగలిపి
చనియె శత్రుబలంబులు • సంచలింప. ౧౪౨

శా. బ్రహ్మాస్త్రంబరివోసి యేసె నపుడా • ప్రత్యర్థినాథుండునా
బ్రహ్మాస్త్రంబు భముఖ ప్రపంచము భయ • భ్రాంతిస్థితిన్ జెందనా
జిహ్మప్రక్రమునై జసైన్యము నుతుల్ • సేయంగ సాటోప్తర
బ్రహ్మేశాన వరప్రసాదుఁడగు నా • భద్రాయుపై నల్కతోన్. ౧౪౩

శా. ఆవేళన్ శివవర్మధారియగు భ • ద్రాయుర్మహావీరుఁడా
ద్యావాభూములు ఘూర్ణిలన్ నిగుడు బ్ర • హ్మాస్త్రంబుపై దోర్బలా
సావిర్భూత కుతూహలంబడరఁ • బ్రత్యస్త్రంబు చేదానిని
ర్జీవంబై దనరంగఁజేసె సురలా • శీర్వాదముల్ సేయఁగన్. ౧౪౪

సీ. ప్రబలమాగధుఁడంత • బహుళమాయోపేత
రాక్షసాస్త్రంబేయ • రయము మీఱ
నతిఘోర శరభసిం • హవ్యాఘ్రసూకర

ఖరవృకోష్ట్రతరక్షు • ఖడ్గశల్య
ము ఖమృగాకారమై • నఖరదంష్ట్రాయుధం
బులుగల్గి నిజమాయ • లలరుచుండ
శద్గాత్రములబాధ • దనరంగఁ జేయంగ
మఱియు దుష్టవిహంగ • మార్గమునను

గీ. పక్షి చంచూపుటాదుల • భంగపఱుప
వెండియును చండ రాక్షసా • వేశములను
బడలిక నొనర్ప దలపోసి • భయానకముగుచు
కడగుటయుఁజూచి భద్రాయు • డడరకడిమి. ౧౪౫

చ. చటుల నిశాచరఘ్న మను • సాయకమేసిన రాక్షసాశుగో
ద్భట వికటాస్య దైత్యసము • దగ్రమహోగ్రమృగాండజాదిసం
ఘటనము బాపితచ్ఛరము • ఖండితమై పడఁజేసి మాగధో
ద్భటబలముల్ దొలంగఘన • భల్లములన్ వడితూరిపెత్తినన్. ౧౪౬

గీ• మగధదేశాధినాథుఁడు • నమ్రత్తచిత్త
వృత్తితో నంధకారాస్త్ర • మేయనదియు
నలుదెసల చీకటులుగప్ప • బలసి, రాజ
సుతుని పైరాగ నమ్మహా • శూరుఁడపుడు ౧౪౭

క. సూరాస్త్రంబేసినదుర్వారాఖర్వప్రభాభి • రామంబగుచున్,
భూరితమోమయమగు నా ఘోరాస్త్రమునుపశాంతమొనరించు • గురుతరశక్తిన్. ౧౪౮

వ- ఇవ్విధంబున • ౧౪౯

అస్త్రప్రత్యస్త్రంబులు నిస్త్రాణత నొందివైరి • నిర్వైరపడవా
క్యస్తిమిరబలంబునను రథస్త్రీశ్వర వర్మమహిమ • దనరంగననిలో, ౧౫౦

ఇటుల నిశ్చేష్టితుంజేసిన నమ్మగధేశ్వరుండు సకల యోధవరులం బురికొల్పు కొని తానగ్రేసరుండయి రోధసీకుహరంబు బగుల సింహనాదంబు సేయుచు భూరిభేరీరవంబులు చెలగింపుచుఁ శంఖకాహళంబు లొత్తుచు వేయుండు ఘోడు

వుండు పోనీకుండని యార్పులు పిడబొబ్బలు సలుపలు నింగిముట్టంజేయుచు బరిఘాది సాధనంబు లడరింపుచుం గవిసినం గనుంగొని. ౧౫౧

గీ. ఇటులఁ దనుఁజుట్టుకొన్నట్టి • చటులశౌర్య
ధుర్యులగు శాత్రవులఁ జూచి • ధైర్యశాలి
యైన భద్రాయుఁ డతికరు • ణార్ద్రదృష్టి
దనర హింసింపఁజాలక • తడయకపుడు. ౧౫౨

శా. అంభోజప్రభవాండముల్ బగులమా • ద్యచ్ఛాత్రపాలంభసం
రంభారంభ విజృంభమాణ విలయా • భ్రధ్వాన వద్భాంక్రియా
స్తంభీభూత జలేంధనాగ్నిభయకృ • త్సన్నార్గ వాగావకృ
చ్ఛుంభచ్ఛంఖము నెత్తె రాట్సుతుఁడువి • స్ఫూర్తి ప్రభావంబునన్. ౧౫౩

సీ. అట్టిశంఖారావ • మాత్మప్యాత్పుటములు
భేదిల్ల నత్యంత • భీతినొంది
ఘోటకరథరథ్య • కూబరాన్వితులై వి
సంజ్ఞచే భూమిపై • జచ్చినటుల
బడి మూర్ఛనొందినఁ • బరగఁ గన్గొనిదయా
భుత్వంబుతోనరి • జిత్వరుండు
వీతాస్త్రశస్త్రిల • విగతవాహనులను
నష్టచే తనులను • నయవిధిజ్ఞఁ

గీ. డగుటచేఁ జంపఁ గాదని • యాత్మఁ దలఁచి
హర్షమొసఁగ రథావరో • హణ మొనర్చి
సునయుగన్గొని పాశబం • ధనమునొందు
మజ్ఞనకుని గనుంగొను • మాన్యచరిత. ౧౫౪

ఎవంతమైనసర్పము। చలిచీమలచేతఁజిక్కి • చందంబునఁ దా
నయుతుఁడయ్యెను శాత్రవ। బలములచేఁ బడియెనైన • బలరహితుండై ౧౫౫

గీ. అదియుగావునఁ దొలిబాము • లందుఁజేయు
పాపపుణ్యము లనుభవిం • పకతొలంగ

వెంతవారలకైన ము • న్నిదినిజంబు
పీరి విడిపించుటేకీర్తి • విభవమొసఁగ. ౧౫౭

భద్రాయుఁడు హేమరథుని జయించి జనకుని విముక్తుని గావించుట

వ. కావున జననీజనకులు బంధనంబుల విడువుమనిన నటిండట్లు జేయుట. ౧౫౮

క॥ బాధాసంయుతకన్యా, గోధన ధానాద్యబాల • కుల,ముందుగనం
బాధంబు నొందకుండయు,శోధనుఁడగు రాజసుతుఁడు • సుఖులుగఁజేసెన్

గీ. మఱియు దక్కినబాంధవా • మాత్యమిత్ర
భృత్య భటదాసికాదుల • వేరువేర
విడువ నియమించి క్షణమాత్ర • వివశులగుచు
మూర్ఛఁదేరిన శాత్రవ • ముఖ్యులరసి. ౧౫౯

మ. అవినీతాత్మ వరోధకాంతలఁ దదీ • యశ్రీమనోమారుతో
జ్జవవద్ఘోటకముల్ గిరీంద్ర సదృశ • స్తంభే రమంబుల్ సువ
ర్ణవిధానేక శతాంగముల్ సురుచిర • ప్రాయస్థదాసీతతిన్
వివిధాలంకరణంబులుం గొనుచును • ద్వేగంబు వాటిల్లఁగాన్. ౧౬౦

మ. విరథుండై తగినట్టి హేమరథుని • ద్వీర్యుండునై యుండ దు
ర్భరపాశంబుల బద్ధుజేయుచును • ల త్రాణప్రియామాత్యత
త్పరసేనాధిప నాయకావళిని ము • న్బంధించి యున్నుక్తతో
నురుమంత్రీశుల దాపునన్నిలపి యా • య్యుర్వీశ పుత్రుండొగిన్ ౧౬౧

క. ఓమంత్రులార, యిపుడీ। హేమరథాదులను గొనుచు•హితవర్తనతో
మీమీ పురముల కరుగుఁడు। సామంతులతోడ ననిన • సంభ్రమమలరన్.

చ. ప్రతిభట సంహతిన్ మునుప • రాజితులై తగు మంత్రినాయక
ప్రతతులు, యోధముఖ్యులు, వి • పద్గతలేక, పునస్సజీవన
స్థితులయి రాకుమారుని, ను • తింపుచు విస్మయ మానమానసా
న్వితులయి వజ్రబాహుకడ • నిల్చిసమాహిత చిత్తవృత్తి చేన్ ౧౬౩

సీ. ఓ రాజ ♦ వినుమిమ్మ ♦ హా రాజ తనయుండు
భూమిఁజూడఁగవచ్చి ♦ పొదలుచున్న
యింద్రుఁడో చంద్రుఁడో ♦ యినుఁడోయుపేంద్రుఁడో
తెలియంగవలవదీ ♦ తేజఁగుమనకు
మనమహాభాగ్యంబు ♦ మనతపఃఫలమెన్న
నాశ్చర్య మయ్యెనీ ♦ యవనిలోన
ధన్యుఁడై తగినయా ♦ ధరణీశ సుతునిచే
విజితులై రిపులెల్ల ♦ వెగడుపడిరి

గీ. చెలఁగి,యితఁడు మహాయోగ ♦ సిద్ధుఁడేమొ
మఃశ్రితపస్సిద్ధుఁడో లేక ♦ సురవరుండొ
కానిచో నీయమానుష ♦ ధర్మమితని
చేవిజృంభించునా ♦ యింత జెప్పనేల? ౧౬౧

గీ, ఇతని జననీజనకులము ♦ న్నన్ని చూడ
పార్వతీ పరమేశ్వరు ♦ లుర్విలోనఁ
నిముషమాత్ర శతాక్షోహి ♦ ణీబలంబు
బలవదాశుగముల బయ ♦ ల్పడనడంచె. ౧౬౨

అని బహువిధంబుల స్తోత్రంబులొనరించి ౧౬౩

గీ॥ ఇవ్విధంబున నత్యంత ♦ హృష్టు లగుచు
మహామహాశ్చర్య సంయుతా ♦ మాత్యవరులు
తోషమలరంగ వరమహా ♦ త్ముఁడవటంచు
బలుకుచుండంగ నమ్మహా ♦ భావుఁడపుడు

సీ॥ విస్మయానందాను ♦ విద్ధుఁడానందాశ్రు
పిహితాత్ముఁడును ప్రేమ ♦ విహ్వలుండు
నై నట్టి జనకున ♦ భ్యర్ణమానటఁ జేరి
దండ ప్రణామముల్ ♦ దగ నొనర్చి
నా రాజ ప్రణయార్తి ♦ నభినాదన మొనర్చి
ధన్యునిఁగని గాఢ ♦ తరముగాఁగ

బరి రంభణ మొనర్చి ♦ బంహిష్ఠ మోహాంబు
నానరంగ నిట్లను ♦ నో కుమార

గీ॥ నువు దేవుడవో మను ♦ ష్యుఁడవో లేక
కింకరుఁడవో పరమేష్ఠివో ♦ హరివో తలఁప
నీదు జననీ జనకులెవ్వ ♦ రేది దేశ
మేది నీనామము వచింపు మిద్ధ చరిత. ౧౬౨

సీ॥ ప్రత్యర్థి వర్యసం ♦ బద్ధులై విద్ధులై
హతతేజులయి మృతు ♦ లట్లు యుండు
భీరుభావదమాత్య ♦ భృత్యాదుల సపుత్ర
పత్నుల గాంచి యా ♦ పరుఁడవగుచు
విడిపించితివి మహా ♦ వీర్యధైర్యోజ్జ్వల
తేజోబలోన్నతుల్ ♦ తేజరిల్ల
నీ విక్రమ క్రమ ♦ మెల్లు నీకు ఘటించె
మహిత దేవాసుర ♦ మానుషాత్త

గీ॥ మైనలోకత్రయముఁ గెల్వ ♦ నలవుఁ జలము
గలుగజాలిన నీవంటి ♦ ఘనుని ఋణము
దీర్చుకొనలేను ధరను, ముత్తితసహస్ర
జన్మములకైన దివ్యతే ♦ జప్రదీప్త ౧౬౩

సీ॥ తగునిదం పుత్రమి ♦ త్రకళత్ర పూజ్యరా
జ్యపురంబనక సర్వ ♦ మలర విడచి
ఘనమదీయాంతరం ♦ గము నిచ్చు నీయందుఁ
ప్రేమబంధంబునఁ ♦ బెనఁగ దలఁతు
ననఘ వచోయుక్తి ♦ ననువదింపుము నేడు
కథమత్ప్రియంభావు ♦ కుడవు నీవె
యలరు మదీయశు ♦ ద్ధాంత కాంతల నెల్ల
త్వత్తధీనత జరింప ♦ దలఁతు నిపుడు

గీ॥ తవిలి నీవు జితేంద్రియ ♦ త్వమున నునికి
తోఁచె నామదిగాననం ♦ తోష మొదవె

సర్వము వచింపుసను నీవు • నిర్వహింప
దేవుఁడవుగాక పరుఁడవే • ధీరవర్య. ౧౭౦

క. అని యివ్విధమున జనపతి। వినయంబునఁ బల్కి ధైర్య • వీర్యఘనుండౌ
జ్జనసుతుఁడగు భద్రాయువు। ననువొందగ నిట్టులనియె • నందఱు వినఁగన్. ౧౭౧

సీ. ఇతఁడు వైశ్యసుతుండు • కుతలాధినాయక
సునయాఖ్య మత్సఖు • స్ఫూర్తి నొందు
నేనితనింట వి • నీతమజ్జననితో
సతతంబు వర్తింతు • సౌఖ్యగరిమ
భద్రాయురాఖ్యచే • బరగుచు వర్తింతు
వెనుక వచింతు మ • ద్వృత్తమెల్ల
ఘనమదంబున విన్ను • గాసినొందించిన
పరిపంథి బలమెల్ల • బడలువడియె

గీ. మునుసభృత్యా సుహృన్మంత్రి • ముఖ్యుఁడవగుచు
నిజపురంబు ప్రవేశింపు • నిర్భయముగ
శత్రుసాధ్వస మొక్కింత • సరకుగొనక
సమ్మదంబున వసియించు • జనవరేణ్య ౧౭౨

మ. అదియుంగాక మదంచితాగమనప • ర్యంతింబు దుర్బుద్ధిభా
జ్యదమత్తాఖిల శత్రుతాచరదధ • ర్మప్రత్య నీకావళిన్
వదలంబోవక బంధనాలయములో • వర్తింపగాఁ జేయుము
ద్యదయప్రాప్తిని నేనుఁబోయెద మదీ • యాగారముం జేరఁగాన్. ౧౭౩

గీ. విశ్వజననాది హేతుత్వ • విభవమొందు
నమ్మహేశ్వరు కరుణనా • యందుఁగలదు
గాన శాత్రవులఁ దృణాయ • మానముగను
జేయఁజాలిన నేగల్గఁ • జింతవలదు. ౧౭౪

మ. అని యారీతినిఁ బల్కి యానృపతిము • ఖ్యాక్షిప్తిఁ బెన్నొందినం
జనితానంద మమందమై నిగుడసౌ • జన్యాత్మ భద్రాయుఁడా

గీ. అతఁడు భద్రాయువను సమా ♦ ఖ్యను వెలుంగు
నార్యసుత శీఘ్రముగ వివా ♦ హ కార్యమునకు
నిచ్చయింపంగఁదగునని ♦ ఋషభయోగి
నిజగృహంబున కేగె నో ♦ నిర్మలాత్మ. ౧౮౪

వ. పిదప సుఖ మందుండుచు నొక్కనాఁడు. ౧౮౫

సీ. శ్రీమంతుఁడైన యా ♦ ఋషభ యోగీంద్రుండు
భద్రాయుఁగనగ సం ♦ భ్రమమొలర్ప
వచ్చిన నయ్యోగి ♦ వరుఁగాంచి సాష్టాంగ
దండప్రణామముల్ ♦ దగనొనర్చి
ముకుళిత హస్తుఁడై ♦ ముందునిల్చినఁ జూచి
నవ్వి గాఢాలింగ ♦ నంబొనర్చి
యోపుత్ర మగధదే ♦ శోదీర్ణ బలముల
గెలచి వచ్చిననీదు ♦ బలిమి కలిమి
గీ. నెంతవర్ణింతు వినుము భూ ♦ మీశ్వరాగ్ర
గణ్య; చంద్రాంగదుని పుత్రి ♦ గలదు కీర్తి
మాలిని యనంగఁదగునది ♦ మానినీయ
నీవు పెండ్లాడవలయును ♦ నిక్కముగను ౧౮౬

*గీ. అతఁడు నీకిచ్చుటకు ♦ మది హర్షమొందె
నీసఖుండైన యొక ♦ విప్రు నీతిమంతు
గా విచారించి పంపుమ ♦ కన్యఁ జూచి
వచ్చునని చెప్పి చనియెన ♦ వ్వరయశుండు.

క. ఆ యోగీంద్రుఁడు చనభ । ద్రాయువు తనచనువు నెనయ ♦ నవనిసురునితో
శ్రీయుత తత్కన్యామణి । నీయెడఁ గని రమ్మనుచు మ ♦ హేచ్ఛతఁ బలికెన్

---

పాఠాంతరము *గీ. అతఁడు నీకిచ్చుటకు మది ♦ హర్షమొందె
నీసఖుండైన సునయుండు ♦ నీతిమంతు
డితఁడు మజ్జని తత్సమాచార ♦ మెఱిగి నీదు
కోర్కె సఫలంబుగా జేయు ♦ గుణయుతవసునను. ౧౮౭

సీ. అమ్మహీసురుఁ డలరించ ♦ బ్రాంగజాధి
నాయకునిగాంచినాతఁడు ♦ నర్చు భక్తి
కలరి యాకీర్తి మాలినీ ♦ కలితరూప
లక్షణంబు లనరయుచు ♦ దక్షణంబ

క. వచ్చి ధరణీశతనయుని । గ్రుచ్చి కవుంగిటను జేర్చి ♦ కొని వినయముతో
నచ్చు పడతద్విలాసము । నెచ్చరిక వచింపఁ దొడఁగె ♦ నీహితవృత్తిన్

ఉ. చూచితి దేవతాసతులఁ ♦ జూచితి యక్షపయోజనేత్రలన్
జూచితి నాగకన్యకలఁ ♦ జూచితి సాధ్యవధూలలామలన్
జూచితిఁ గిన్నరాంగనలఁ ♦ జూచితి సర్వజగల్లతాంగులన్
జూచితిఁగాని యీపడఁతి ♦ జోడగుచేడియ గాననేకడన్ ౧౯౨

సీ. తలిరులు తాబేళ్లు ♦ కమలగర్భంబులు
కదళీకాండములు సై ♦ కతముసుడియు
పనుతరగలుకను ♦ పీనుల జాడరి
శైలముల్ బిసములు ♦ సారసములు
దరము దర్పణముకుం ♦ దములు ప్రవాళంబు
కనకంబు మీనముల్ ♦ కార్ముకములు
సిరులర చందురుం ♦ డారసైన తేటులు
కటిమొగుల్ కమలంబు ♦ మొలవురీగ ౧౯౩

తే. లనుదొగలనువ్వు బువ్వును ♦ వనజవైరి
శిలలు నవసంఖ్యలును పూగ ♦ ములునులతలు
వనటుల సిరేఖకూపంబు ♦ లనటులుకరి
కరములును గాళెలును మేను ♦ లలరబోలు ౧౯౪

సీ. పారజోని మేఘంబు ♦ పొలివోని చందురుం
డలిగాడ్పుపోకని ♦ జల జములును
జిగిబిగి ఛాయని ♦ సొగసు సంపెగమొగ్గ
నిద్దంపుటప ధంజ ♦ యొద్దములును
చిలుకముట్టని బింబ ♦ ఫలమంచ లంటని

రంజిత మౌక్తిక ♦ పుంజమనంగ
నించిదిక్కులచుముఖ ♦ ప్రాంచత్ప్రమోదినీ
రసపూరకోరక ♦ విసరమనంగఁ

గీ. లలిత రదనాంశు కారణ ♦ ఫలకలిఖిత
పంచబాణప్రతాప ప్ర ♦ పంచ విజయ
శాసనాక్షర సంతతి ♦ చందమమరఁ
గాంత కాంతామణీదంత ♦ గణము వెలసె ౨౦౧

గీ. వరుసమై మెక్కువల్లుతళ్కు ♦ వలుదలంగి
యొక్కతీరునఁ బెంపొందు ♦ చున్నదంత
పద్మరాగాళిఁ బెనగొని ♦ పరగినట్టి
తావిస క్షళాళితనుకన ♦ మోవిదనరె ౨౦౨

సీ. కన్నుల విలుకాని ♦ యెన్నికజాలువా
జంజాళి యనసొప్పు ♦ సకియనాస
చక్కరవిలుకాని ♦ చక్కని తోలుటి
చిలుకల నాఁగవెల్గుఁ ♦ జెలియకనులు
రాచిల్క నెక్కెడు ♦ రాయని తీరైన
విండ్లనఁగను నట్టు ♦ వెలఁది బొమలు
సింగారమైనట్టి ♦ సిరిపట్టిబంగారు
పలుకయనం దోచుఁ ♦ బడఁతి నొసలు

గీ. మరుఁడు శ్రీపుత్రుఁడనుమాట ♦ యెఱుకపడగ
జేయుచందము దోపస ♦ చ్చెలియవీను
లగుచు శ్రీలుమెలంగనో ♦ ననుచుఁబొగడ
భ్రమరకుంతల జూపట్టు ♦ సుమశరమన ౨౦౩

గీ. అలరువిల్తుఁడనెడు గేస్తు ♦ డతిశమైన
లలిత శృంగారలక్ష్మి వి ♦ లాసములను
లలిపినిర్మించుటోఁ దాలు ♦ దాల్పుతళుకు
నిల్వుటోయన దనరారె ♦ కలికిగళము. ౨౦౪

సీ. అనురాగకల్పకా • కనకశైలములన
మకరాంక కన్యకం • దుకములనఁగ
వరదేహ జన్యలా • వణ్యపుంజములన
స్వాంతసరోజకో • శములనంగ
మదనమోహనభూతి • పదకరండములన
గంతునిర్వక్రచ • క్రములనంగ
హారమృణాళసం • చారకోకములన
భవమహీరుహమూల • ఫలములనఁగ

నధికలోక జిగీషాప్ర • వర్తనప్ర
భవపరిశ్రమలాలన • పంచబాణ
సుఖనివాస గృహములన • సుందరాంగి
కులుకుగుబ్బలు దనరారెఁ • జాలుమీఱ. ౨౦౫

క. గ్మకాంచ నాచలాచల। దళదురు సంజీవనీల • తాఫలములనన్
విలసిల్లెన్ దదురోజయు। గళమనఁదగు లీలచేవి • గానము దవరన్. ౨౦౬

చ. మెఱఁగుదొరంగు తుందమను • మేలిమిబంగరు రంగుటాకునన్
మరుఁడు తదీయరూపమహి • మాతిశయంబున కన్యమీఁదుగా
దొరయదటంచు కజ్జలము • తో లిఖియించిన నాగరంబనన్
సరసిజాక్షి చక్కనగు • శ్యామలరోమగణంబు సొంపగున్ ౨౦౭

క. చూపట్టినట్టి పొక్కిలి। లోపల విలసిల్లు కనద • లోలమనోభూ
దీపపు కొడియన నాగా।రాపూర్ణ శశాంకవదన • కందంబమ్మెన్ ౨౦౮

గీ. అంశుక వ్యాప్తిచే మధ్య • మాస్తికత్వ
ముగిపరామరిశించిన • యొనరుననుచు
నంబుజాక్షి మనసుపట్టు • ననుటగాని
తలఁచిచూడఁ గృశత్వంబె • దానికరవు. ౨౦౯

చ. ఉరుకుచ కుంభపాళిమున • కోర్వకనో! యటుగాక భావిన
త్స్వరుచ కరోరుపాశమునఁ • బుట్టిన ఖేదముచేతనే మొ? యా

సరసిరుహాక్షి నెన్న [illegible] ము ♦ చారుకృశత్వముబూనెఁ గాని-చో
[illegible] ♦ [illegible] ౨౧౦

మ. [illegible]
ద్యల సద్భావహు [illegible]క్రమ క్రమము పాం ♦ థప్రాణికోటిం జలా
చలవృత్తింభజియింపఁ జేయఁగ జయ ♦ స్తంభంబులన్ నిల్పెనాఁ
గలనన్ భీతమృగీ విలోచన తొడల్ ♦ గన్పట్టెనో పట్టుగాన్. ౨౧౧

క. అంగజుఁడనిగొెడు సామరి ♦ బంగారపు రంగులన్ వి, భాగింపుచు మున్
రంగాయించిన గుదెలన ♦ సంగన జంఘికలు దనరె, సద్భుతరీతిన్. ౨౧౨

గీ. జంఘికాగతలావణ్య ♦ జలధి జనిత
శుక్తులయ్యెఁ బదంబులు ♦ స్ఫుటిత తత్సు
ముఖవినిర్యన్మణులు చంద్ర ♦ ముఖి నఖములు
గాని సుమతారకలు పోల్కఁ ♦ గానవయ్యె. ౨౧౩

గీ. తారకలు సరిగాఁజేయఁ ♦ దగదు నఖస
మాస మొసరుట కనిబ్రహ్మ ♦ యమృతబిందు
తతికి నిల్కడవన్నియు ♦ దగనొనర్చి
వెలఁదినఖములు నిర్మించె ♦ జెలువుదనర. ౨౧౪

ఆ. అంగజేభ శిరమ ♦ నంగ వక్షముదోచె
గుంభయుగమురీతి ♦ గుచములలరెఁ
గరముపోల్కరోమ ♦ గణము జెన్నొందెడ
దగ్రముగతినాభి ♦ యలరుచుండె. ౨౧౫

చ. అతివ విలోచనంబులు శి ♦ తాబ్జములంచుఁ గనీని కామిష
స్థితి నిరుమేనులందు నరి ♦ శ్రీ హరి నిల్చినఁ జూచిలక్ష్మితత్
స్థితి నెడఁబాయలేక కను ♦ పాపల నేనెపమొప్ప నుండెన
ప్రతిహతవృత్తిఁ జెందునన ♦ పయినిగాభువి నెన్న నిచ్చలున్. ౨౧౬

గీ. ఉదరము దరంబనందగి ♦ యొప్పుచుండ
మధ్యము ను మధ్యమంబయి ♦ మలయుచుండ
బొమ్మలలతుంట వింటికి ♦ బొమ్మగట్టి
బిరుదు చాటించుఁ జెలియపా ♦ బిరుదు లెపుడు. ౨౧౭

చ. చెలువగు తావి మోవిరుచి ♦ చేఁ దగు కెంపులసొంపు పల్కుపై
నలరుల వింటిదంట విర ♦ హాత్ములై చరియించు పాంథులన్
గెలిచి జగంబునన్ బిరుద ♦ కీలితనైజ జయాంక నాక్షరం
బలలిఁ గ్రేలుకొల్పెననఁ బొల్చెల ♦ సన్మదిరాక్షి దంతముల్. ౨౧౮

క. కందర్పగజాలానపు । పొందునఁదగు గర్తమనఁగఁ ♦ బొక్కిలి మెరసెన్
సుందర తచ్చరణాగ్రస । సుందుకమన్నరోమరాజి ♦ యాలవాలె దగన్. ౨౧౯

క. సొగసగు నగుమొగమనియెను । తొగరాయని దండనుండి ♦ తోచిన
బలుకెం । జిగిఁదగిన సాంధ్యరాగపు । వగయనఁ జిగురాకుబోడి ♦ వా
తెఱవెలసెన్. ౨౨౦

సీ. చేతో గృహాంతరా ♦ సీన మానాంబక
వీక్షణోత్సవదగ ♦ వాక్షులలన
వదన సంపూర్ణలా ♦ వణ్య స్రవంతికా
విహారదంజననామ ♦ విహగములనఁ
గమనీయ దరహాస ♦ కలశాంబునిధిభాస
మానసీలోత్పల ♦ సూనములన
లసమానసృష్టిలీ ♦ లాకుంద మాలికా
కలితద్వి రేఫయు ♦ గళమనంగ

గీ. మహితదృష్టి యొప్పగ ♦ మానవిరోధ
కత్రివణకూప కృతకోప ♦ కద్రుమరూప
లోహితోపాంతముల జగ ♦ లోభనీయ
మగుచుఁ దనరారుచున్న నే ♦ త్రాబ్జయుగము

క. అలికంబరనెలఁ దెగడిన । నలికంబునఁజూపు దెగడు ♦ టది చిత్రముగా
దలకంబు మొయిలఁ దెగడిన । నలకంబును గళము దెగడె ♦ నౌరతలంపన్ ౨౨౮

క. వలమురిగళమైతగఁ గలు । వల మురిఁగొనుతే తనగవు ♦ నసుధాస్థలిపై
గల మహిళామధ్యమమే । కల మహిళా మధ్యమంబు ♦ కమనీయంబై. ౨౨౯

క. ఆవర వర్ణినియధరం । బావరవర్ణిని సుధాస ♦ మన్వితి మగుచున్
భావిదితమైన యూసతి । భావిదితయన గ మిగుల ♦ భాసిలుచుండెన్. ౨౩౦

క. సరమాతను వసితోర । స్సర మావేనలి సుధావ ♦ సరమానుడిమేల్
సరమాపాక్కాలి రత్నవి । సరమారదనాళి చెలిసు ♦ సరమాఁ బొగడన్. ౨౩౧

క. ఆరమణిరో మగణకబ । రీరమ్య కుచంబు లలరె ♦ శ్రీదన రారన్
ధారాధర ధారాధర । ధారాధరములు తిరస్కృ ♦ తములై దనరన్. ౨౩౨

ఉ. జంబుగ దేకచంబు, జలఁజంబుగ దే మొగమా మణీసమా
జంబుగ దేర దావళిగ ♦ జంబుగ దే నడలార హేమపుం
జంబుగ దే రొండల్ మలయ ♦ జంబుగ దే మయితావి చంద్ర తే
జంబుగ దే స్మితంబునని ♦ జంబుగ దే నడుమెన్న బోటికిన్. ౨౩౩

వ. అని యివ్విధంబున వివరించి. ౨౩౪

గీ. ఋష భయోగీంద్రుఁ డెప్పుడు నా ♦ హృదయమందు
స్ఫురణఁ బుట్టించుటయుఁ జేసి ♦ భువనములను
గలుగు కన్యలఁ గంటినా ♦ క కివంటి
చెలినిఁ జూడంగ లేదయా ♦ శ్రీదవిభవా ౨౩౫

వ. అని యివ్విధంబునఁ గీర్తిమాలిని సౌందర్యాదిగుణంబు లేకతంబునఁ దెలియం
జెప్పిన నారాజ సూనుఁడు సంతుష్టాంతరంగుఁడై యుండె నట్టియెడ. ౨౩౬

గీ. అంతనక్కడఁ జంద్రాంగ ♦ దావనీశుఁ
డాప్తులన్జూచి పలికె భ ♦ ద్రాయువునకుఁ
గీర్తిమాలిని నొసఁగినేఁ ♦ గీర్తిశాలి
నైతి మాకంపె ఉకనేది ♦ హర్షముగదా. ౨౩౭

క. అనవారలనిరి జనవర। యనుపమ సౌందర్యధుర్యు ♦ డార్యుఁడు భద్రా
యునికంటెవరుఁడు లేడీ। వనధిపరీతమగు భూమి ♦ వలయములోనన్, ౨౩౫

వ. అనివారు సమ్మతించిన నంతఃపుర స్త్రీలలో సాధ్వీరత్నంబగు సీమంతి
నికి భద్రాయురభ్యుదయాది కావ్యంతంబు వృద్ధబ్రాహ్మణ ముఖంబున
వివరించిన నాకీర్తిమాలినివిని తనమనంబునకు భద్రాయువు సాక్షాత్క
రించి నట్టయినఁ గరణత్రయంబు నతని యధీనంబు జేసియుండు సమయం
బున. ౨౩౬

సీ. ధారాలసితవారి ♦ ధారాలసిత్తసరా
ధారాలసితహంస ♦ ధరమగుచు
ఘదన నిర్యత్సుధా ♦ సదన మానసదురా
సదన వార్తికవిద్య ♦ దుదయ మగుచు
భావ జరితహావ ♦ భావ పల్లవికాధి
భావ కృత్సనితపుం ♦ భావ మగుచు
హాల హాలేత్యగుతాప ♦ హాలవిలాస భృతిదో
హాల భుజాబల కృషీ ♦ వలము నగుచు

గీ. దేదివర్ధాతు భూతలో ♦ ద్ధితతలాగ్ర
వితత సీపద సీపసీ ♦ పతదసమక
సుమస ముద్గీర్ణ ఘుమ్మఘుమ ♦ త్సురభీభూత
లంబుఁదగ ♦ నంబు డాడంబ ♦ రంబు దోచె. ౨౪౦

చ. పలుతాపంబుల నావసోపములు జూ ♦ పట్టంగ నిట్టట్టుగా
సినలసె న్బంటవలంతి దీనికిఁ గశై ♦ త్యప్రక్రియల్ జేయగా
వలె నంచున్ ఘనుడంత వృష్టిజనిత ♦ వ్యాపారముల్ జేయఁగా
బులకల్ మేనజనించిమించెనన మున్ ♦ బొల్చెన్ దృణాంకూరముల్. ౨౪౧

చ. కతల భూముఖస్థలుల ♦ జెందుచుముంతు వివిక్త రక్తకీ
టకము లసహ్య తాపవిలు ♦ తస్మహితత్వమయుండు పొందుఁటా
చుక గిలిగింతఁ గొల్పఁదరు ♦ ణారుణదీధితి మత్రపవాళపా
ళికల సరుల్ ఘటించెనస ♦ లీలఁగనందనరారె నత్తటిన్. ౨౪౨

చ॥ మిసిమిమిసిమబ్బునన్నదసరు ♦ ముత్తెపుటెత్తులనందనౄ కాంతౌసర
వసదురు శీకరంబులన ♦ వద్యుత దంతర కీలితంబులై
మిసిమిపసిండి కెంపులన ♦ మించుమెఱుంగు పురుంగు లొప్పనొ
ననిగలచోట గాటముగఁ ♦ జాలుపు వానలులేని వేళలన్. ౧౪౩

మ॥ వినుతప్రాప్త యథాక్రమ స్తనితమై ♦ విద్యుల్లతామూర్తియై
తను మార్గాగత వృత్తి మచ్ఛ్వసనమై ♦ ధారాప్రవాళైకమై
కనదుత్తుంగ పయోధరోల్లసనమై ♦ కమ్రాంబరోపేతమై
ఘనసంగంబున వృష్టిఁజూడఁదగె లో ♦ కంబుల్ మదిన్మెచ్చఁగాన్. ౧౪౪

క॥ అహమహమికా వివాదం ♦ బహర హమా స్తనిత విద్యు ♦ దంబునికరస
న్నహనములకు రావకమున ♦ తహతహఁబొందించె సకల ♦ ధరణులనెల్లన్. ౧౪౫

మ॥ అలరున్ జానపదస్థలంబులు స ♦ ముద్యద్బాష్ప ధూమాలయా
జ్వాలదాచ్ఛాదనముల్ నిరంతరజలా ♦ సారంబునన్ నందు. నం
దుల ధూమాంకురముల్ జనించి మును ముం ♦ దుంజారు ధారాకరం
బులుగాఁ దజ్జరరంబులంబుదములై, భూమిన్ దివిం జేయఁగన్. ౧౪౬

సీ॥ ప్రతిపదా దర్శాను ♦ మితవర్తులాద్యంత
రంబులై రుచిరగ ♦ ర్తంబులలర
సర్వతస్థాపితా ♦ ఖర్వదుర్వర్ణ పా
త్రంబులై పద్మాక ♦ రంబులలరఁ
బరితస్న మర్త్యోక ♦ స్థిరదు కూలాచ్ఛాద
నంబులై తోటి సీగ ♦ ణంబులలర
విష్వక్పరిప్రేక్షయా ♦ విఖ్యాత తారహా
రంబులై కుల్యాది ♦ కంబులలరఁ

గీ॥ బంటవలఁతి యా నేడువాలు ♦ గంటతోడ
వింటి తెరువరిదరటవా ♦ ల్గంటనంటి
గంటకుండిన నివియెల్ల ♦ నొంటియొరడఁ
దెలియ వటియుంపనలవి యే నలువకైన. వ॥ తదనంతరంబు ౧౪౭

సీ. కలితప్రకాశసం • ఘాతంబు వెలయంగ
గల హంసకస్ఫుర • ద్గతులు దనరఁ
బటుతర రజతకుం • భపయోధరములొప్ప
ధవళాంబరము ధళ : ధళ వెలుంగ
వేణీప్రదేశంబు • విశదమై గనుపట్టఁ
జంద్రరేఖా విలా • సంబు దోప
సరలోచనము లకానందంబు ఘటియింపఁ
దారాళి • నిర్మలత్వంబు గొండ

గీ. శాలిసుకృత ఫలమహాత్మ • మాలికాళ
యంబు విలసిల్లగాఁ బ్రభవి • ణాశుకవిల
సితని నాదంబులదర నా • శ్వినపువాస
రంబునను పీకశరదాగ • మంబు దోచె. ౧౮౮

మ. హరిదుగ్ధాంబుధి నిద్రితుండగుట చో • ద్యంబెట్లనన్ వైద్యశా
స్త్రిరహస్యంబతఁ డేర్పడం దెలిసె దృ • క్కాంగోప భోగ్యస్థితిం
జొరలేవన్యములైన రోగము లటం • చున్ లేని చో క్షేమ సా
గర వైకుంఠ ముఖ్యప్రముఖ్య పురలో • కంబుల్ దగన్ లేవకో. ౧౮౯

వ. తదనంతరంబ ౧౯౦

సీ. ఇందూప లాగార • బందీస మ్యాచార
మంబు ష్ట వోచ్చార • ణాపవాద
ముద్యాన యానప్ర • యోగభాగవిలాస
మైందవా తపసేవ • నాప్రసక్తి
పన్నీరగంధ సం • బంధ నిర్గంధంబు
కోమల వ్యజన వి • శ్రామకథము
సరసాంబు జాతావ • సానప్రకారంబు
పత్యర్థిరచితప్ర • పావిరహిత

గీ. మగుచు నెగడొంది సేమంతి • కాంతిలగ్నాళి

హరిధారాళతుహినధా • రావతార
మిళిత నక్తందివ ప్రసవ • న్నిహిక నుగుచు
వసుధఁదుహినాగ మో • ... ౨౫౧

చ• ఒనరనయోమయాంతరస • ముజ్జ్వలితజ్వలనంబు ...బో
ల్చినఁ బ్రవహంతి కాగ్రములఁ • జేతులు నిట్టటు విప్పుచుందురా
జనముల దెల్లనక్ హిమము • సర్వజగంబుల నీవలావలన్
జెనచు నటంచుఁ దెల్పుగతిఁ • బేర్చిన యా హిమవాసరంబులన్• ౨౫౨

మ• తనరెక్ సాంద్రతరాంతి కాన్తలల స • ద్వాసోష్ణవాః కుంభ సం
జననంబిష్ట ఘనేష్ట కోపచితవా • సస్వాపనాట్యప్రవ
ర్తిన నిర్నిద్రకళావతీ కృతపరీ • రంభస్పృహోద్యద్వయో
జనమాక్రందిత దుర్గతాధ్వగనధూ • జాతంబు నీతిం బలన్• ౨౫౩

సీ• పాదంబు లగ్నిలో • పలఁ జాపఁగాఁ జేయుఁ
బూని మున్నిసునంత • వానినైనఁ
గరములు జల్లగాఁ • దిరుగంగ నొనరించు
వసుధలో రాజంత్ర • వానినైనఁ
మేనెల్లఁ దెలిడాలుఁ • బూనఁజేయఁగనేర్చు
వహిసదా శివునంత • వానినైనఁ
నిలువెల్ల నల్లనై • మెలగంగ నొనరించు
వజలు శ్రీహరియంత • వానినైనఁ

గీ• నితరు లననెంత యీ హిమ • ప్రతతికనుచుఁ
దనకు నిలయితె వదన పా • దముల విడచె
నగ్నియటుగాక తెక్కి... • వన్నియుండ
నదియుఁ జలినొందునని జనులనుదు రెపుడు. వ• తదనంతరంబ ౨౫౪

సీ• విలసద్ఘనేష్టకా • విరచితాంతర్గృహ
నిద్రాభిలాషిత • నిరసనంబు
మేదురాగరుకుంకు • మాదినమ్మిశ్రిత

గంధిలాలేప ని • ష్కా సనంబు
సద్రక్త మృగరోమ • జప్రచ్ఛదాచ్ఛాద
నేచ్ఛావిచారణా • హింసనంబు
స్థాపితాహార్ని శో • ష్ణక దుష్టనా: కుంభ
సంభూత కాంతాను • శాసనంబు

గీ. తప్తకాంచన కవదవ • ధ్వస్తశస్త
భూమధూమజ్వలన పరి • స్ఫురణచరడ
హోమయు హసంతి కాదిసం • హోగ జనిత
సుఖనికారణవృత్తిచే • సొంపుదనరె. ౨౫౫

సీ. సాంద్రచంద్రోపల • స్థగిత ధారాధర
సౌధాగ్ర కేళికా • సౌఖ్యకరము
మహనీయ హిమవారి • మర్దిత శ్రీగంధ
చర్చానుమోద ప్ర • సక్తిదాయి
సతత ఘుమఘుమ • త్సౌరభోద్దీర్ణ కా
సారహారి విహార • కారణంబు
శీతలా నిలజాల • ధూతప్రసూనసం
వాసితో పవనప్ర • వాసనేవ

గీ. నాస్పదంబును జంద్రికా • పాభిరామ
మందిర ప్రాంగణాంభోజ • మార్గణప్ర
థనగ తాన్యోన్య పరిరంభ • జనన సమ్మ
దావహంబై వెలయుచుండె • నట్టియెడల. ౨౫౬

గీ. మథిత సజ్జాతి యగుచును • మధుపనికర
మెనసి కొలువంగమే నెఱుం • గనివిభునితో
నేస్త మొనరించు ... • నీచగుణము
గాని యిటువంటివారలు • లోకమునం గలరె. ౨౫౭

వ. అట్టియెడ. ౨౫౮

క. మలయు వలరాచ వానికిఁ। బలువిడిదలుగ ననుశ్వేత ♦ పటకుంటములన్
వెలయించె ననెడిపగిదిం। బొలుపుగఁ బుష్పితనికుంజ ♦ పుంజము లలరెన్. ౨౬౨

సీ. మొలఁగు సహస్రార * ము లబంధ్లనమరించి
కలువకాడల నిరు ♦ సులుగఁజేసి
సొగసునాళంబుల ♦ నొగలుగా సవరించి
పెలుచ గేదఁగిరేకు ♦ పలుకఁజేసి
మంచి సంపెగపువ్వు ♦ మద్దిగంబానరించి
పొగడ మొగ్గల చీల ♦ లొగినమర్చి
మొలుదానిమ్మల ♦ మేల్గల తామర
నూలుచే సేటులు ♦ గీలుకొలిపి

గీ. పువ్వుఁదేని ము క్రందనై ♦ పొలుపుఁజేసి
పగడముల తీగలను పల్పు ♦ లుగనమర్చి
రాచిలుకలును గుఱ్ఱంబు ♦ లై చెలంగ
రాజహంసలు జులుమతీ ♦ తేజులుగను ౨౬౩

సీ. అళుల మొత్తంబులు ♦ కలగానము లుజేయఁ
గ్వలసికోవెలలు కా ; హాళములూద
సారసంబులు మృదం ♦ గారవంబులు సేయ
గలరవంబులు తాళ ♦ గతులు నెఱపఁ
బుడమిపుట్టువుగుంపు ♦ లెడనెడ జడియంగ
మెరయుగాడ్పులు బరా ♦ బరులు సేయ
నేపైన తీవియ ♦ లింపుచేడియలెల్ల
బలసి పేరంటపా ♦ టలఁ జెలంగ

గీ. జొట్టుపులుగులు నట్టువ ♦ పిట్టపరవ
పరపులగు మావితావుల ♦ మొరకత్రోవ
రహిలతా కోరకాళితో ♦ రణములలర
మరునికి విహారయోగమా ♦ మనిరచించె ౨౬౪

సీ. పూఁచెనశోకముల్ ♦ బున్నాగకు లుబూరు
గలుకలి గోట్లులు ♦ తిలకములును
కాచెనామ్రకపిత్థ ♦ కదళీకాకంటకీ
ఫలజంబు జంబీర ♦ పాదపములు
నేచెసాలతమాల ♦ హింతాల తృణరాజ
నారికేళ పలాశ ♦ భూరుహములు
తోఁచెఁ గైరవసిత ♦ తోయజేందీవర
మాధవీమల్లికా ♦ మహితలతలు

గీ. పటలెమటి మాతులుంగల ♦ వంగలుంగ
హింగుదీభుజ పత్రనా ♦ రంగగంధ
సారఘనసార సహకార ♦ సరళవకుళ
కురువకసితాసితాగరు ♦ కుజచయంబులు. ౨౬. గీ

సీ. తొలుదొల్తఁ దేనియల్ ♦ దొలుకుచుఁ దాడిమంచి
ఫలజాత మదయించె ♦ విలసితముగ
నాఫలసంతతి ♦ కన్న ముందుగఁ దోఁచెఁ
దోరగాయలపింకు ♦ మేరమీరి
యాదోరగాయల ♦ కాదియై మునుదోఁచె
బువ్వుపిందెలగుంపు ♦ నివ్వటిలుచు
న పువ్వు పిందెల ♦ నలరించి ముందుగా
ము కుళ సందోహంబు ♦ ప్రకటమయ్యె

గీ. తిన్ననగు మొగ్గ గమికన్న ♦ మున్నెయగుచుఁ
బల్లవము లుదయించె శో ♦ భాప్రకార
మందు ముందుకు ముందుని ♦ ష్యందమాన
మధుర మధురస మొలయంగ ♦ మహివనమున. ౨౭

సీ. ననలదట్టములోఁచ ♦ సంబులై కనుపట్ట
నళులగుంపులకసీని ♦ కలుసుగాఁగ
లలిజిగురులు ప్రవా ♦ ళంబులై విలసిల్లఁ
గలికాతతులు మాక్తి ♦ కములుగాఁగ

మంజరుల్ స్తనభార • మహిమచే వెలయంగ
నరుణపల్లవములు • హస్తములుగఁ
బండుటాకులుపట్ట ... ...ంప
శాఖలు భుజములై • సంభ్రమింప

సీ. పొలిచె వనలక్ష్మి మాధవ • స్ఫురణమునకు
నుచితవేషము ధరియించె • నో యనంగ
నలరుచుండిన యవ్వేళ • నఖిలజనులు
సమ్మదంబునఁ బొదలిత • స్సమయమునను ౨౬౭

వ. మహేంద్ర వైభవుండగు చంద్రాంగదుండు భద్రాయువునకుఁ దన పుత్రికార త్నంబైన కీర్తిమాలినిఁ బెండ్లిసేయదలంచి సకలమంత్రి జనానుమతంబున కా ర్తాంతిక నిశ్చిత పరిణయోత్సాహంబున నుండెనని శౌనకాది మహామునులకు సూతుండు జెప్పిన. ౨౬౮

మ. పురజిన్మార్గణ మార్గణాళిసుమ మన్మో • భూజాతమిథ్యామత స్థిరధీవారణ వారణాసినగర • శ్రీవిశ్వనాథాంక శ్రీ కరపాదాన తదాన తత్పరసదా • కల్యాణ కల్లోదయా వరసన్మానస మానసప్రభవద • ర్పధ్వంసకృల్లోచనా! ౨౬౯

క. క్రీడాకిరాతమాయా! క్రోడీకృత దాశరథ్య • గురుమోక్షదమా పీడిత క్రతువలోడిత! తాడితపూషాభిధాన • దశనవిలసనా. ౨౭౦

మా. అభ్రాంత భ్రమదుత్కట వ్యతికర • వ్యత్యస్త లోకాంధను శ్శుభ్రాంశుద్రుత విశ్వసృడ్గృహపద • స్ఫూర్జన్మహావృత్తితా విభ్రాదాసవిభావదాన్యశశభృ • త్రీతద్యుమన్నిమ్నగీ శుభ్రాదభ్రతరంగ సంగతజటా • జూటప్రియంభావుకా. ౨౭౧

స్రగ్విణి. విశ్వకద్రూభవ • ద్వ్యేదవేదాదివ
ర్ణాశ్వతోత్రక్రియా • ధ్యక్షదక్షాంతకా
వైశ్యరూపానుభా • వప్రసిద్ధిప్రభా
వేశ్వరీ నాథవా • గీశముఖ్యస్తుతా. ౨౭౨

మ. ఇదిశ్రీభద్రాద్రిపరిష్క్రియా కలితబం ♦ హిమప్రతిష్ఠాగరి
ష్ఠదిగంతస్తుత పారమేశ్వరకళా ♦ సంకాశ కంజాంగనా
హృదయానంద దరాజశేఖర హిత♦శ్రీమూర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమున తృతీ♦యోల్లాసమై సొంపగున్. ౨౮

—: *గద్య* :—

ఇది శ్రీమత్శ్రీరామారెడ్డిపేట రాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద
ప్రశస్తాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుల్లగోత్ర పాత్ర
కామినేనివంశపయః పారావార రాకాసుధాకర రాజశ్రీ
జన్ను దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్ర గీర్వాణ
కవిత్వతత్వ చాతుర్యధుర్య పరాశరగోత్ర
రాపాక లింగనార్యపుత్ర లక్ష్మీపతి
ప్రణీతంబైన భద్రాద్రియు
గభ్యుదయంబను మహా
ప్రబంధంబునందు
తృతీయోల్లాసము
శ్రీ శ్రీ శ్రీ





శ్రీరస్తు

# చంద్రాంగదాభ్యుదయము



## చతుర్థోల్లాసము



శ్రీతరుణీమృదుమధురర
సాంచితవచన రచనాస ♦ మంచితవీణా
పాతన రామ్నారేడ్విధ
రాతల పతిపురనివేశ ♦ రాజమహేశా. ౧

వ. అవధరింపుము, నిఖిలపురాణవ్యాఖ్యాన సమేతుండైన సూతుండు శౌనకాది మునీంద్రుల కిట్లనియె. ౨

గీ. అవ్విధంబున శ్రీవసం ♦ తాగమంబు
కరము సర్వజనానంద ♦ కరముగాఁగఁ
దనరు సర్వేశ కీర్తిమా ♦ లినివిరహాని
రసిత డోలాయమానమా ♦ నసమునొందె. ౩

సీ. శ్రీమంతుఁడైనట్టి ♦ బుషభయోగీంద్రుండు
మిహిరప్రకాశుఁడై ♦ మిటికివచ్చి

స న్నొగా కేమి స • ద్వంద్వ భద్రాశ్రయువు
ఖ్యాత శౌర్యంబేల • బ్రీతినుడివ
సుతువుగా కేమి సం • తుష్టుండై మాతంద్రి
హితమదుద్వాహంబు • నేలదలంచె
దలచంగా కేమి శా • త్సౌందర్యముఖములు
ముందునా మదియందు • నెందుకలరె

గీ• నలరుగా కేమి దుస్సహుం • డనమశరుడు
కుసుమశరముల నన్నింత • మసలజేసె
నేమిసేయుదు విరహార్తి • కెటులనోర్తు
తాశలేనింక నేనని • తలకి తలకి• ర

సీ• మేను వేదనపాలు • గా నొనరించుచు
నెరజవ్వనంబు క• న్నీటికొసంగి
తేనెజాల్గల్లు వా • తెఱసోయగంబెల్ల
వేడినిట్టూర్పుల • తోడ గలసి
సొగసుగుబ్బలమీది • పొగకెల్ల జాలు
పసగల పయ్యెద • పాలుజేసి

గీ• బయలు కౌగిట జేర్చుచు • బ్రకటమైన
ధైర్యమంతయు గడుదీన • దశకొసంగి
తలకి యుస్సురనుచు మది • దల్లడిల్లి
బెగ్గిలుచు మన్మథాయని • పేరుగొనుచు ౫

క• వినుగుంబయ్యెరసోకిన కసిగందెడు వేళనేల • గదియింపుచు సొ
మ్మసిలంబోవుచు లేచుచు। విసుగుచు వేసరుచు మసలె • విరహాభరమూచే• ౬

సీ• తొలుతకాయక్లేశ • మలవడగాజేసి
యచలాసనాభ్యాస • మలవరించి
ఇంద్రియార్థంబుల • నెలమివిసర్జించి
కనుగవ తారమోడ్పు • గా నమర్చి

చూపులొక్కటఁ జేసి ♦ శుద్ధమనోవృత్తి
తదధీనముగఁ జేసి ♦ తమ్మునడంచి
సకల వస్తువులను ♦ త్వన్మత విడంజేసి
ఖేచరీముద్రను ♦ గీలుకొలిపి
గీ. తనకొకటి దోచుచున్నది ♦ తానొకటికిఁ
దోచుచున్నది లేకయు ♦ తోయజాక్షి
విరహ యోగంబుతోఁగూడి ♦ విభునిపదము
లక్ష్యముగఁ జేసె నాత్మీయ ♦ లలనలదరా.

క. అభిలాషవిప్రలంభ। ప్రభవస్తంభాద సత్వ ♦ భావము లెదలోఁ
బ్రభవించిన నిర్వేదా। విభరమ ... దేట। తెల్లమిగాఁగన్ ౧

గీ. స్థిరవిభాను భావనా ♦ త్యాగ సుఖముల
నలరు రసమంబు జాతాయ ♦ తాత్వీ మేనఁ
జెలఁగుచుండె నవసాత్వి ♦ శేషములను
నవవిధములఁ బర్యస్వర ♦ భవములగుచు

క. గరమాయె నోగిరముసా। గరమాయె వియోగమలిక ♦ గతకస్తురినా
గరమాయె రేబగలు జా। గరమాయెం జెలికి విరహ ♦ గతియెట్టిది సూ ౧౦

వ. మఱియు మందమందాందోళిత కలశ జలనిధి కల్లోల జాలధవళిత హాసచ్ఛవి తాధరంబు పూర్ణిమా శశాంకసంకాశ ముఖంబు కోటికందర్ప లావణ్యాధిక్యము ద్రామణీయకంబుగల భద్రాయువు సురూపంబు హృదయంబున ధ్యానంబుఁ జేయుచు నేత్రగోచరుం డైనట్టులైన నలుదిక్కులం జూచుచు యమావన సాగర చంచలాభంగ తరంగ పరంపరాం సహితయు, ననురాగ రజ్జుసమావృతయుఁ గుసుమశర శరకీలితయు నభిలాష విప్రలంభశృంగార భావనా పరిభూతయు నిజరూప పరిభావ శల్యకీలితయు మలయానిలావధూతయునై ప్రియసఖులంజూచి యో యనంగ రేఖా విరహ పరితాప దుస్సహంబైన నాహృదయంబునఁ బాణిపద్మంబు జేర్పుము, ఓ మదనమంజరీ, నాయవయవంబుల శ్రీచందనోదకంబులఁ దడుపుము, ఓ వసంతతిలకా, నా

కళ్ళరీభరంబుఁ జక్కం జేయుము. ఓతరంగవతీ కేతకీసుమపరాగంబు పయింజల్లుము. ఓ కందర్పమాలినీ, శైవాలజాలకలిత వ్యజనంబుల విసరుము. ఓ చిత్రరేఖా నా చిత్తవిత్తాపహారకుండైన పురుషరత్నంబు చిత్రపటంబు లిఖింపుము, ఓ విలాసవతీ ముక్తాఫల చూర్ణంబు నిక్షేపింపుము. ఓ సఖీ నళినీ దళచయంబున నా పయోధర యుగళంబు గప్పుము, ఓ సంచారికా కనకకదళీ పర్ణంబునఁ జల్లనివాయువు సంచరింపఁజేయుము. ఓ కాంతిమతీ బాష్పంబుల పనయింపు మనుచుఁ బలికి నిరుత్తరయై యించుక నిదురించి యులికిపాటున మేలుకని పరిజన ప్రియత్నంబున గృహీత జీవితయై యున్నంత. ౧౧

మత్స్య కూర్మాంగ విలసన ♦ మహిమఁదనరు
సరసిజానన లావణ్య ♦ సరసిలోన
శంబరాహితుఁ డడరి జా ♦ లంబువేసి
కలయఁ దజ్జీవనంబెల్లఁ ♦ గలఁచి కలఁచి. ౧౨

చః కరువలి తేరుతేరరయు ♦ గారడిలేఁదలిరాకు బాకుచేఁ
జరజరలాడు నయ్యెదఁగ ♦ జిక్కనఁ గాటువు పోటొనర్పబి
త్తరి తడియింపరానిబలు♦తాప నితాంతదురంత చింతనా
శరవిరహార్తిఁ బెగ్గిలిన ♦ కేశవఘాతతి నేమరింపుచున్. ౧౩

సీ. అనవరతానిలో ♦ ద్ధతరజో భరచూత
నూతనస్మరభూత ♦ భీతయగుచు
కోరకచ్ఛురికాగ్ర ♦ కార్కైతకమూర్తి
మహితగర్వోద్వీర ♦ మహిమకలసి
వితతకుట్మలకింశు ♦ కతతిపాంథామిష
సహిత నఖవ్యాఘ్ర ♦ సరణికులికి
నితతోర్ధ్వ భాగసం ♦ చలపరాగస్థల
నలినీతలజ్వాల ♦ నునికి జడిసి

గీ. నికట కింజల్క పుంజకం ♦ టకచయంబు
కుసుమ రసదీర్ఘికాకూప ♦ విసరములను

దనరుచున్నట్టి యుద్యాన ♦ వనముఁ జేరి
తద్భయంకర వృత్తికిఁ ♦ దల్లడిల్లి. ౧౪

గీ. మఱియు శుకపిక ముఖసము ♦ చ్చరిత విరుత
భరితపరిలసదుపవనాం ♦ తరము శ్రవణ
కటుతఁ జేసిన నీసున ♦ కంప మొంది
సుందరీమణి వలవంత ♦ సోలిసోలి. ౧౫

వ. తత్ప్రదేశంబున శిశిరఘనసార విసరాపగాపులిన తలంబునఁ దుహినమహిలతా జకృత కసరిత్పరిసరంబునఁ గనత్కనకారవింద బృందసరస్తట చంధనవిటపి చ్ఛాయలనని లాందోళిత కదళీకాననంబునఁ బూర్వరచిత ప్రసూనతానమాన శయ్యలందు పారసంభూశ శిలాతలంబుల వసింపుచు విలహాదహాన బంధ్య మానమానసయై సంచరింపుచున్నంత. ౧౬

ఉ. అయ్యెడ నెయ్యపుం జెలులొ ♦ యారపుటారమణిం దలంచితా
నెయ్యెడ కేగెనో సకియ ♦ యేకతమేకత మానురాఘియై
పయ్యెరసోకినన్ వనరు ♦ పాయపు పువ్వుల మేనులాడితా
నెయ్యెడఁ దియ్యవిల్తు వన ♦ మెయ్యెడ హాయని తర్రింపుచున్. ౧౭

క. రోయుచు నిదియేమని తల। పోయుచుఁ బెగడొందికుంది ♦ పూఁబొదరింటిం
డాయుచు లతికలఁ బాయం। దోియుచుఁ బొగలెగయువగల ♦ లోఁబొరలంగన్

గీ. మంజుకుంజాంతరసమేధ ♦ మానమాన
నీయరమ్యఘృణీమణీ ♦ నిబిడమైన
వేదిమీఁదను వసియించి ♦ విరహఘూర్ణ
మానమానసమునఁ నుండు ♦ మగువఁ జూచి. ౧౯

మ. పడతీ; సాహసముల్ వియోగభరము ♦ త్పాదింపగా మమ్ములన్
విడనాడిట్టులఁ దియ్యవిల్తు వనమున్ ♦ వీక్షింపగావచ్చినన్
జడుపింతైనను లేక భీకరశరా ♦ సారంబు ఘోరంబుగా
వెడవింటన్ బరఁగించునించు విలుతు ♦ న్వేడంగ మాశక్యమా.

శా॥ రోలంబాలక; మానినుల్ జగతిలో ॥ రో. నీవలెన్ వేదనా
లోలత్వంబునకోర్చి పుష్పిరిగ నీ ॥ లోఁబాయకున్నట్టియా
బాలామన్మథుఁడై ధరాతలమునన్ ॥ భద్రాయువన్ రాట్సుతుం
డీలోనన్ బచరించుగాన వగనీ ॥ కేలేకురం గేక్షణా ౨౧

చ॥ తెలికనుమీలు వేడిగను ॥ తేకువవచ్చిన నీటివెల్లితోఁ
గలయనుడింగి మిట్టిపడ ॥ గామరుఁడాత్మజ యాంకముల్ చలా
చలతనుఁబూననోపవని ॥ సారెకుఁ గోపము జేయునంచు నె
చ్చెలు లుపచారభేదములఁ ॥ జేయ దొడంగిరి యానెలంతకున్. ౨౨

తే॥ బిసకిసలయ భుజపాణులు॥ బిసకిసల ప్రముఖవస్తు ॥ భేదంబులనా
బిసరుహనేత్రకు మృగనా॥ భిసురభిపాత్రకు నొసంగ ॥ భీతిలి తమలోఁ ౨౩

సీ॥ జిగిపెంపు గలకెంపు ॥ చిగురుటాకులసొంపు
పొంగారములరంగుఁ ॥ లావహింప
నడరువీచోపుల ॥ నడలెడు తెగనియా
దుడు క్రొవ్వుల తెరంగు ॥ దొలుతఁదెలుప
నెనయజొబ్బిలసంత ॥ టనలందు గంధంబు
మొగివెలిగారంబు ॥ సొగసుఁజూప
మేదురస్వేదోద ॥ కోదయసంతతి ॥
కలయఁజల్లిననీటి ॥ చెలువుఁజూపఁ

గీ॥ గనలునన సెజ్జయు హసంతి ॥ కళలనీనఁ
జెలియ యుడుఁగుందసప్తమున్నెఁ ॥ జేసికొంచు
సతిమనఃసును స్వర్ణ కారకుం ॥ డనుచు వగచి
రింతులొక్కింత చింతదు ॥ రంతమునను. ౨౪

వ॥ మఱియుఁ జిత్తజాయత్త చిత్తయగు బిత్తరి యుత్తరుణీమణు లొనరించు నొ
ఱపుఁ గఱపు విరివరప్పుపైఁ బొరలుచు జిగురువిలుతుమగంటిమి సెగపొగలెగ
యు దిగులుకొని మిగుల నగలఁబొగిలి నొగిలి కన్నీటి మేటియేటి వరుద బరువై
యుల్లలదా ద్యుల్లికజ్వర ప్రతప్త కార్త స్వరమణిగణప్రభామండిత కుండలం

బులఁపై నావరించి చూతాత్కృతులు నిగుడింపుచు సిరులకరవగు కుచగిరులపైకి దేరవారి తోరంబులగు తారహారంబుల వికారంబు నొందించి పులకలమాంకురాంబులకుఁ దన్నీరుచందంబు నొందుచు నందముగనలందు గందమునఁ జొందుపరచిన మెకవు గోవజవ్వాజి యొప్పిన కప్పురంబు కుంకుమ మొదలగు ప్రశస్తవస్తువులు కరంగి కుర్వంగట దొరంగు మకరికలాపంబుల జిగిబిగి బాయ గండమండలంబఖండ పాండిమ పిచండిలంబై తోచరుఁ జిరచికుర నికురుంబంబున దొరయు విరిసరంబులు పరిసరంబు మొరయ మిసిమిగల పసిడి మేనులు కసిగంద నడుగడుంగున కుడుగని జడివిడిన పుప్పొర నొడలి చిరుచెమట నిగుడుచుండ వియోగావస్థ నవసిన నల్దెసల గుసగుసలఁబోయి ఘసలుచు బిస రుహాలోచనలు తటస్థోద్దీపన వేపమాననూననయగు నా చిగురకుంబోడిం జూచి:

సీ. సంతత సురసాల • కాంతఫలాహార
సమయంబుగల శుక • సంచయంబు
వరసుమనప్రియా • చరణ సవనభూమి
గలయవర్తిల సాధు • కరగణంబు
మధురసాయన నియ • మచ్ఛదస్వాదనం
బ్రమరస్మనువన ప్రి • యవ్రజంబు
సరసీ భువన దేశ • జంఘాలగతులఁ బేఁ
బెను పొందుఁ బరమహం • సనివహంబు

గీ. విభవ యోగాగమోల్లస • ద్వివిధఫలద
మాధవాలోక నామోద • మహిమఁదనరి
పరగు నివియెల్ల నీకేల • బాధఁదలఁచు
నింత చింతిలనేటికి • వంతనొంది. ౨౭

సీ. శృంగార రసమొల్కు • చెలికొప్పు మొయిలను
గనిడాయవచ్చుశి • ఖావళములు
రాగవిస్ఫూర్తితో • రంబులౌ కుచమంజ
రుల నటింపగఁ జేరు • నళులగములు

మధువినోదము దెల్పు ♦ మహిమ మనీగతి లోచ
నాబ్జముల్ గనవచ్చు ♦ హంసతతులు
నతిమధురతఁ జూపు ♦ సధరబింబము దారిఁ
గెరివచ్చునుదార ♦ కీరవార

ఆ. మలర నింపుసొంపు ♦ హావ బు భావంబు
వహి దలిర్చునీయ ♦ వయవరుచులఁ
గొసరి దెసల మసలు ♦ ననను బాణబలంబు
లేలఁజాలిఁ జేయు ♦ లోలనయనా♦ ౨౬

సీ. శంబరారియటన్న ♦ జడియంగ నేటికిఁ
దగ సరిత్వము ముందుఁ ♦ దలఁచనపుడు
కుముద బాంధవుఁడన్న ♦ తమకింప నీకేల
విగత బాంధవముగా ♦ వించినపుడు
కుసుమాకరుండన్న ♦ నుసురునందఁగనేల
దోలినిరాకరవృత్తిఁ ♦ దలఁచినపుడు
చెలి వనప్రియమన్న ♦ నులుకంగనేటికే
ప్రియమార్గమున దానిఁ ♦ బిలువనపుడు

గీ. కాంత నామాంతరంబుతోఁ ♦ గలిసియుండు
శంబర కుముదకుసుమవ ♦ నంబులకును
వనిత యొక్కింత వలవంత ♦ మనములోన
నిలుపకుము నీకు మేలగు ♦ నిక్కముగను♦ ౨౭

చ. నెనరునఁ జిత్తగింపురమ ♦ ణీరమణీమదీయ వాక్కులన్
దనుతవహింపనేల వని ♦ తావనితాంత తనూవిలాసయీ
వనటలఁ జెందనేల మగువా ♦ తగవావనజాస్త్రశస్త్రముల్
వెనకొనవేగనేల పద ♦ వేపదవేగమెలర్పు ముంగలన్♦ ౨౮

చ. తెలసినదానవౌదువుర ♦ తిప్రయునాజ్ఞల మీరనట్టి రా
చిలుకలు కోవెలల్ మనకు ♦ క్షేమము నేమముగాఁ గోరునీ

వలయుకుమమ్మ సొమ్మసిల । కమ్మ శుభంబగునమ్మ నెమ్మదిన్
దలఁకక నమ్మవమ్మ రుచి ♦ ధాళధళీ వికచాబ్జలోచనా 30

క. అనియూరార్పుచు నుపవని మునవనితాచుణికిఁ బ్రొద్దగ ♦ బుత్తమనుచునే
పూనకై దండల నిడుకొని । వనజనయన లిట్టులనిర ♦ వారణ గరిమన్. 3౧

సీ. చూచితే కొమ్మకొమ్మల ♦ సొంపులింపు
లతల జతలను బుష్పసం ♦ తతుల రుతుల
వెలయు నళులను శుకపికా ♦ వళులచెలుల
శోదలఁ బొదలెడు పొదలసం ♦ పదల నిచట. 3౨

చ. అలవియె కాంతకాంతలతి ♦ కాంతనితాంతచర స్ఫురన్మరు
చ్చలదళ జాలజాలనివ ♦ సన్నివ సత్కలికా కలాపసం
వలయిత నూతనాతనువి ♦ మానసమానర మావిలాసవ
త్సలలిత కాయమాన ల ♦ సంచులమించు మతింనుతింపఁగా♦ 33

చ. కనుఁగొనవమ్మ [illegible] ♦ కావలియుంచిన మించు తేటులీ
వనజమరంద బిందువుల ♦ వైష్ణులఁ జక్కగ మెక్కి సొక్కుచున్
వనిఁ గలయన్మెలంగుచు న ♦ [illegible]గదగు గేదఁగి బోదులందు వి
చ్చలవిడిఁగూడి యాడెడు వె ♦ సన్ వికచోత్పల పత్రలోచనా. 3౪

ఉ. చూచితివా వనీగమన । సూచితరేచిత కీరవారవా
వాచలితావనీజ జని । తాంచిత సంచితమా పరాగపున్
రోచదుదారమారజయ । సూచికసధ్వజ చేలలీలగా
నోచెలి యాదిశాసరణి. నోరగవారుట మంచిదేజుమీ♦ 3౫

చ. చెలి!కలయంగఁ జూడుమిదె ♦ శీర్యదుదార రసాలపల్లవోత్పత
త్ఫలవిలసద్రసప్రసవ ♦ పంచమరాగ పరాగభాగభా
గలిపిక శారికీరసము ♦ దంచితపద్మ మరందబిందుతుం
దిలజల పత్రచిత్రితవి ♦ నిందితవారి సరోవరంబునన్♦ 3౬

క. లలనా, కలకంఠవ, ధూ। లలనాకలనాదగీత, లహరీవిహార
చ్ఛలనాత్మాత్మజ విశిఖాం। చలనానాసూనముల వె, సంగనుమించటఁ. 32

సీ. అల్లిబిల్లిగ నల్ల, సిల్లుమల్లియ తీవ
లెల్ల మొల్లలఁ గూడి, యింపులెసఁగఁ
బజ్జపజ్జలనున్న, గుజ్జుగొజంగుల
తావిమావుల తావు, లీవుకొనఁగఁ
జాలుగా మేల్తైన, యేలకిచాలుపుల్
గొప్పకప్పురముల, నుప్పతిలఁగ
జెంతల వింతలా, బంతిసేవంతులు
గున్నపొన్నల వెన్నె, లెన్నుకొనఁగ

గీ. నెలకువలిగలిగిన వేల్పు, టేటినీటి
తోటిపీటయి సాటమూ, తేటనీటి
జిలజిలననేలఁ బలుచలు, సలను దనరు
దోనలఁ బెనుఁగొను తెలిలాక, లనువుగను మీ. 33

సీ. కొమ్మ నిమ్మళపులేఁ, గొమ్మలఁ గదలించి
యింపు నిద్దంపుపూ, జొంపమరసి
తొగరుచేఁ బొగరెక్కు, జిగురుపండుఁగలంచి
విప్పుకప్పురముల, కుప్పలెక్కి
మొల్లమూ వటల్వేళ్ల, చల్లపందిరులంది
వెలివలి, తొగలను, గలసిమెలసి
గనిగట్టు కొసటట్టు, పునుగుపట్టరయుచు
నల్లబిల్లగుమల్లి, యలనుజూచి

గీ. కలకలను పులుగులఁపడ, గలనుకాలను
లరసి బలుగొమ్మలల మొకంబు, రమరుచెక్కు
చెమరులల్లార్పుచును గుమ, గుమను వలపు
వెలయుదక్కిన పూదెమ్మ, రలనుగంటె.

క॰ కమలము ఖాళియగుచుహిమ।నమితవనగుమనకుసొంపుఁ • జూపఁ దగదె యా
రమణీరతి రాజుకాబీ। రము గా నదు విరహిణు ను • రా పొనరించుర్ • ౪౫

గీ॰ నిబ్బరంబై రవిలిసయి • గబ్బిమలయ
మారుతంబిచ్చటఁ జరించు • మారులేక
విశ్రుతానంద భైరవ • విభవుఁడైన
మారునకుఁ దేరగుచునిది • మలయుచుండు॰ ౪౬

క॰ విరులంటగ వల*దన్నా। సరి*యని కోపంబున్నయ • సమకట్టితివి
త్తకిమారువేడి తూపులు। నిరతము శాసించకున్నె • నీరేజముఖీ.

సీ॰ అతివ; కన్నడ *గౌల* • లతివదనంబునను మ
మ్ముల్ల విడనాడిట్లు • మొలఁగి తేని
యబల; *నీలాంబరి* • వైరియొంటిపాటునఁ
జతియింప నేటికే • విరహమునను
చెలియ; *సావేరి* • తులయూధి కాతతుల్
చలియింపుచున్నవి • నెలవువలన
పడతిరో; మారాచ • పట్టివై యీ వేళ
ధైర్యమించుక లేక • తలఁక నేల

గీ॰ చూచితె వ లి యిప్పుడే • యోచి చెవులు
చెవుడు దడ్రమోయుచున్నడ • చిగురుఁబోడి
తరుణి యిచ్చోట పున్నాగ • తరులు కుసుమ
వినరములు మించెఁ గనుగొంటె • విశదమతిని.

సీ॰ సకియరో నాగేమ • ల్లికను జూచినశంక। రాభరణంబున • సలరుచుండు
ఘనవసీపదము మో • హనమై కనుంగొను। వారికిన్దోపుగా • మీరుచుండు
నీ*తోడి*రాచక • న్నెలఁ గాంచితినిగాని। విరహార్తి నిటువలె • వెగలేరు
*రేగుప్తి*తీపవే • జోగుచు నీచక్ర • వాకదంపతులుండు • వనతి గనుము

గీ. సుహాసినయి మను*కల్యాణి* • సొంపుమీరి
రవనిఁలోపలఁ గల్యాణి • నై మెలుంగు
పూరిత మనోరథస్థితిఁ • బొలిచియుండు
నెంచునూ రార్చి రత్యంత • వినయమునను

క॥ వినుసహసావేశ్యతో। చిన వారినివిడువవలయు ♦ సేవకధర్మం
బునవర్తించిన వారిని। వనితామణివీడఁదగదు ♦ వసుధాస్థలిలో. ౫౦

సీ॥ *కేదార గౌళాంధ్ర* ♦ కేరళా దిక దేశ
ములనైన నిటువంటి ♦ ఫలితవనము
జూడలే దెచటనీ ♦ *సురట*కోకిలకీర
ములఁజెందు మాకంద ♦ ములఁదలిర్చి
*సారంగ* నయనవే ♦ సారంగనేటికే
ఘనవిప్రలంభశ్రీం ♦ గారమునను
బహుళకన*కాంభోజ* ♦ పద్మాకరంబులఁ
జూచితే యిచ్చట ♦ సుందరాంగి

గీ॥ కాయజుఁడు *కానడా*విరహా ♦ గమున నొంటి
వై చరించిన నిన్నేచె ♦ నంబుజాక్షి
ధవళ సుమములు కురువక ♦ తరులవెలసెఁ
గలతఁ జెందగ నేటికే ♦ లలితగాత్రి, ౫౧

క॥ పడతీ విరహభరంబేఁ। గడఁదేర్చెద నాయటంచు ♦ గళవళపడుచున్
బడలికఁ జెందఁగఁ దగదీ। యెడ,మావచనమ్మునమ్మ ♦మిందునిభాస్యా. ౫౨

గీ. చెలియ, యీవనీ శ్రీరాగ ♦ కలనఁజెంది
చూచువారల కిష్టమై ♦ సొంపొనర్చు
నతను ఘంటారవంబుల ♦ ననుకరించి
పికసమూహంబు మ్రోయు – నుత్సుకత జెలఁగా. ౫౩

సీ. కుంజముల్ మాలతీ ♦ పుంజముల్ తీరభూ
కంజముల్ వేష్టిత ♦ గుంజములును
సాలముల్ కుందాల ♦ జాలముల్ వితతప్ర
వాళముల్ విలసద్వి ♦ సాలములును
పూగముల్ కల్పసం ♦ యోగముల్ శ్రీచంద
నాగముల్ మల్లికా ♦ భోగములును
కీరముల్ భృంగప్ర ♦ చారముల్ కలకంఠ
వారముల్ మధువారి ♦ పూరములును

సీ. కీరవాణియొకర్తు ♦ సారెసారెకుఁజేరి
బింబాధరాయని ♦ పిలువఁబోఁడొకతె
కలహంసయానయొ ♦ క్కతె ప్రమోదంబున
బిసరుహాననయని ♦ పేరుకొనియెఁ
కలకంఠనినదయొ ♦ క్కతె మేలమునలించి
పల్లవశయయని ♦ పలుకరించె
సింహమధ్య యొకర్తు ♦ చెలఁగుచుఁ జనుదెంచి
గజగతియని పిల్చెఁ ♦ గౌతుకమున

గీ. కమలగంధి యొకర్తువే ♦ గ న వచ్చి
యలినమానకచాయని ♦ పిలచి నిలిచె
నిటుల నన్యోన్య నామంబు ♦ లెంచియొంచి
చెలఁగి యారామ లారామ ♦ సీమలోన ౬౦

వ. విరహవేదన నొందు నా రాజసుందరికిఁ బ్రొద్దుబుచ్చఁదలంచి. ౬౧

క. దరహాసమొనర్ప మహా। దరమునఁ బొన్నలుదలిర్ప ♦ దరమాకనశ్రీ
దరమోప వనోదరసుం। దరగతిసీవనముజీవ ♦ నము మనకతివా. ౬౨

గీ. రమ్య పరిరంభములను కు ♦ రంటకంబు
లేచి చూచి రసోచిత ♦ రోచిదనరె
మనము బెనుగొనఁ గనుగొని ♦ కోనలనలఁ
దనివిగ నొసంగ ననమయ ♦ మన్నఁగవలదు. ౬౩

సీ. ప్రసవస్థలంబులఁ ♦ బలుమారు దిరుగుచు
ద్విజపంక్తి మిక్కిలి ♦ తేజరిల్ల
గణికా సమూహంబు ♦ కడనుండి పల్లవ
సందోహమానంద ♦ మందుచుండ
గంధోత్తమావనిఁ ♦ గదిసి నృత్యము సల్పు
మధుపవ్రజము సంభ్ర ♦ మము వహింప

గమనీయ భూవరా • గంబులను వహించి
గంధవహుఁడు మంద • గతులఁజూప

గీ. విమలభువనస్థలీ • వధూ విభ్రమంబు
దనరఁ బద్మిను లతిముదం • బునదొలంగ
సార్వకాలిక వైభవా • స్థానవిపిన
వాటిలోపలఁ దిరిగిరాఁ • బోటులపుడు. ౬౫

శా. ఆశ్వాసంబు లొనర్చినన్ బొగడలా • హారోమనన్ వచ్చినా
విశ్వాసంబులు నావిలాసములు నా • విఖ్యాత దాతృత్వముల్
శశ్వత్సుందరదివ్యగాత్రల మహా • సంతోష మొందించెనా
విశ్వాసః ఫలదాయకో యనెడు ను • న్నిన్యుక్తముందప్పునే. ౬౬

ఉ. గానము సింధువారనగ • కల్పితపల్లవ పుష్పసంపదా
దానముతాన నంచయని • దానము రాగవిశేష మిశ్రసం
ధానము శ్రోత్రసమ్మద వి • ధానము చంద్ర శ్రీ సుఖోదయ
స్థానము నైకనందగెని • తాంతముతద్వన సీమలోపలన్. ౬౭

మ. అదలించుచున్మదమొంది ప్రేంకణము ల • త్యంతంబు కాంతాతతిన్
బొదలించున్ సుమపల్లవాదుల లతా • పుంజాంత రేలాతతిన్
మెదరించున్ మధుపాళిపాళికలన • మిశ్రాభూత పీరుత్తులన్
గదలించున్ దదుదారకైశికలన • త్కల్యాణ భూషావళిన్. ౬౮

చ. జిలజిలఁ దేనియల్ వెలికిఁ • జిల్కఁగఁ గుల్కెడు ముద్దువల్కులన్
గలయుజనింప సంపగలు • కమ్మని నెసనలానినింపుసొం
పులుగల పువ్వు జొంపముల • ముందుకు ముందొనరించి మించుతా
తల నలరించె నారప్రమ • దంబున *నాసుర కన్నెలెన్నఁగాన్

గీ. భాసి ముఖవాసనావాపి • తాసవంపు
తావులంటుచుఁ గేసర • తరువరముల
విరులనువగు పరవులు • దొరలనొసఁగె
నసమ కుసుమాంగుళకు విహా • రానుగతుల. ౬౯

*నంబర వాసునెన్న గా

క॰ ముదకాలుదవ మదవతులకుం। బదతాడన పీడనములఁ ♦ బల్లవముకుళా
స్పద రక్తాశోకములు వి।శదకళలంభొదలి కుసుమ, ♦సంతతి నొసఁగెన్, ౭౧

క॰ అంటినవెంటనె పువ్వులు। నొంటుగఁగం కేళికేళి ♦ నొనరింపుచుఁబూ
వింటను గెంటనిబంటగు। దంటను బుట్టించుచతుర ♦ తెన్ విలసిల్లెన్ ౭౨

వ॰ ఇవ్విధంబున దోహదక్రియలొనరించి ౭౩

క॰ ఆరామాక్షులు లయ్యెడ। నారామమునందుఁగడునొ ♦ య్యారంబుగసం
చారంబొనరించిరిసము। దారూఢిన తానతాన ♦ తానతముఖులై ౭౪

చ॰ లలిత కళావిలాసపిక ♦ లాపకలాప కలాపకుంతలల్
స్ఖలితమరంద కందళిత ♦ సాలరసాలకిసాలఖాదసం
చల కలకంఠ గానసుఖ ♦ సారససార ససారసాళులన్
నెలకొను భూతలంబులగ ♦ ణింపుచు నింపుజనింపఁ బోవుచోన్. ౭౫

క॰ హేలావతులై ఁ దగినమ। హేలాతతు లుపవనోప ♦ హితవిహితవిధా
నై లాతత ఖేలామతి॥ ఖేలారతలగుచు నగుచుఁ గేరుచుఁబోవన్. ౭౬

చ॰ సవిధగ ధాతకీతరుజ। ♦ జాలకజాలక జాలకాంతి మ
త్ప్రవిమల మానసంభృతప ♦ రాగ పరాగ పరాగతాళిసం
భవకలనాదమే దురిత ♦ మానస మానస మానసంతతి
ప్లవనదముల్ సదేశజక ♦ దంబకదంబ కదంబులై చెలన్. ౭౭

క॰ లలినీ పవనాంతస్థిత। ఫలినీలతి కారతిప్ర ♦ పదభవవికస
న్నలినీపత దలినీయుత॥ మలినీకృత పదము ముదము ♦ మదిఁబొదలింపన్ ౭౮

క॰ ఆ రామాంతస్సంచరి। దారామలు మాలమాని ♦ లాప్తిమరందా
సార సుమాసారలతా। సారగృహాంతర గతాళ ♦ చయములఁగనుచున్. ౭౯

చ॰ వలదురు మీనచంచదని ♦ వారితవారిత వారిజాకర
స్థలక మలాళిచెంత నత ♦ తంబు తతంబు తతంబుగాఁగ నం

సీ. హరిహయోపలకుట్టి • మావనితలములు
కాలాగరుజధూప • కళవహింపఁ
బద్మరాగప్రభా • ప్రాజ్య స్థలములుసీ
రాజనభాజన • తేజమొనరఁ
శశికాంత కాంతభూ • సరణులు శ్రీగంధ
బంధుర పాత్ర ప్ర • భావమొంద
సురభికుంకుమ నీరజో • భరధరాభాగంబు
సాక్షితచ్ఛదపుటం • బగుచు వెలయ

తే. బహువిధాగమ కుసుమ సం • భవపరాగ
నికర మవ్యక్త పరిమళ • నియతిఁ దనర
రమ్యరమ్యని కలకల • రవవిహంగ
రుతినొసంగించె నొక్క స • రోవరంబు. ౮౯

క. చూచి తదోచితవృత్తుల। కాచిలుకల కొలుకులలరి • యంబుక్రీడా
ప్రాచుర్యసౌఖ్యమునఁద। త్సేచనమునఁ దనరి తద్విశేషమరయుచున్ ౯౦

వ. చనంజన వసంతలక్ష్మీ మాధవ సంభోగ క్రీడాసుందర మందిరాయమాన మానాశ్రితనూతన లతావితాన సమంజస కుంజంబును తదీయ హంసతూలికా కేలికానల్ప తల్పసూచక రోచదుపాంతకాంత ద్రుమాంత లతాంత పరివ్యాప్త సాంద్రచంద్రోపలస్థలంబులునునలయ వలయీభూత సదేశరిరం సుహంస కంబులును, తత్సమయ జన్యాన్యోన్యస్య గళరవాయిత కలరవ కోకిల ముఖసుఖ ఖీకార విహగరుతంబులును, వితతరతికూజిత యాచ్ఛాన్యర్థ ముహుర్ముహురాభా షణాయమాన కపోతజాత హుంకృతులును, తద్రభమ జలకనత్కోకానేకంబును కుచకుంభల మండిత కుంకుమ సంకుముద మృగమదాది బంధురగంధ రసా యిత సుగంధ వివిధకుసుమ విసరానర్గళ నిర్గళన్మధూదకంబును, ఇతతస్తత్పతిత విలులితాలకజాలాయమాన పరితః పరిభ్రమద్భ్రమరసముదయంబులును భా

మరాశ్వాసా నిలీకృత మధుపానార్థ సంచరచ్చంచ్చంచరీక కానే గరున్మరుత్ప్రసరణంబులును, ఘనస్తనసమ్మర్దపీడలూనతారహారాయిత సమీరకుమారాందోళిత సుమితలతా వితానంబులును, మధ్యే మధ్యేరతి ఫలమధుసంగత భృంగాదూభవన్మరంద బృందభరిత పత్రపుట పాత్రనికరంబును గలిగి చెలువొందుచు విప్రవర సేవ్యంబై సుమనోంచత్సవన భూమి తెఱంగునఁ గాంచనప్రభాభిరామంబై భూరిధరాధరంబనఁ జందన పల్లవ విలాసాస్పదంబై గణికానివాసంబుగతి నతివిచిత్ర పత్రరథపాలన శీలంబయి విగ్రహభూతంబు పోలుపున నుత్కలికా సమన్వితాంతరాధారంబయి శ్యామానికరంబనమించి జడాశయప్రసాదకృదభిరామంబయి దేశికోక్త మహావాక్యం బనంనగి, సమీరకుమార విహారంబై యయా రామపద సాన్నిధ్యంబనందగి దేశోపలక్ష్యమాణశంఖచక్రసుపర్ణ విష్వక్సేనాది సమన్వితంబై మాధవలోకంబు వడువున వశీకృతరాజ హంసమండలము కరచ్ఛప కుంచాద్యలంకృతంబై శ్రీదవైభవంబురీతి సుగంధ బంధుర సుమనోని వహంబై దివ్యనికేతనంబు భాతినరుణ హరిత్పత్రి విలసనంబై లోకబాంధవు పథంబుచాడ్పున నిగమాంతామోదచరద్వ్యాస ప్రియాలాపకలాపంబై కమలభవసదనంబన మించి భద్రశకుని బాలవకు లోపేతంబై కరణప్రదేశంబురీతిఁ గర్కటమీన సహితంబై రాశివిలాసంబుగతి బుష్పవతాంతే తస్థలంబైన ప్రదేశంబుపక్కి బహుళరజోభరంబై గంధవహాగారంబనఁదోచి స్వభామృతాధరంబై శుద్ధవస్తు విధంబున మెరయు సరోవరంబు రికసి రుదంచుచు సుందరదలులు ముదంబున. ౯౧

స్థాపితతరణి హరిహయువి: ధూపల ఘనకనకనికష • సోపా- శేఖారోపణ సోపానోపల । కోపరిభాగ్దాగధగ్య • సౌగమరయుచుఁ ౯౨

సీ. లాలిత మణిమయా • లంకృతుల్ సడలించి
పంచాస్త్ర దివ్యప్ర • భలవహించి
శాలిచోలనిచోల • జాలంబు వెడలించి
సుమబాణ బాణపం • క్స్ఫూర్తిఁ జెంది

ప్రస్ఫురత్కాంచనికా ♦ భారముల్ వదలించి
కందర్ప ఖేటక ♦ కళలఁదాల్చి
హేమమౌక్తికపుష్ప ♦ దామముల్ సడలించి
కందర్ప తెరవారి ♦ గతులఁదాల్చి

గీ. వలిపె పావడలను గట్టి ♦ వరహారిద్ర
మేనులనలంది భృంగవి ♦ తానమలర
తవిలి, జానుద్వయసకటి ♦ దఘ్ననాభి
మాత్ర నీరంబులోనయ ♦ మ్మగువలలిరి. ౯౩

చ♦ చివురుమెఱుంగు బోండ్లుసర ♦ సీజసమాజ్యపరంపరాజవం
జవ భవనత్సరోవరస ♦ సంభ్రమ సంభ్రమ దండజాదిసం
భవవిభవంబు లారయుచు ♦ బోయుచు డాయుచు వేయుచున్నదు
ద్భవనవ కేళిలాలసతఁ ♦ బల్మరు నోలయుటంచుఁ బల్కుచున్. ౯౪

గీ. సారకాసార సంచారి ♦ సారులేక
కాలమునఁ గ్రుంకి లేచిన ♦ గాననయ్యెఁ
దత్సరశ్రీది దృష్టాగ ♦ తద్విరోసస
రాజరాజాన నారత్న ♦ రాజయనఁగ ౯౫

చ. వెలఁదుకలంత కంటెకున ♦ ఎనవినోదము తీర్పడంగ ద
జ్జలకలితాంగ శృంగములఁ ♦ జక్కఁగ కొక్కు మొగిన్బహిస్థలీ
కలనను జెందఁజేసినను ♦ గన్పడెఁదజ్జ వియుక్త మౌక్తికం
బులు వెలిబుచ్చు దేవతల ♦ పోలిక జోడులుగూడి వేడుకన్ ౯౬

ఉ: శంబర నేత్ర యోర్ధ్వరభ ♦ సంబున నంబుజరాగ యోగ శృం
గంబునఁగంబులుంచి కల ♦ కంతులనొంచిన సాంద్రచంద్రికా
డంబర హాసభాసురత ♦ టంబులఁజేరి ముఖేందుబింబమా
ర్గంబులఁ దద్విలాసము మరల్చిరి ♦ సప్రమదాత్మ చిత్తలై. ౯౭

చ. సరసిజపాణిపాణిగత • చంద్రశిలామయ శృంగసంగత
స్ఫురదుదకంబులంజెలుల • ముద్దుమొగంబుల పైఁ జిలికించినన్
దురుసుగఁ జూపి దీపిత వి • ధుంతుదశంకనొనర్చినన్ భయాం
తరమును జెందుచందమునఁ • దత్కరసారస ఘర్మయై తగెన్. ౯౮

శా. ఆలీలావతులాసరోవర విహా • రానంద సందోహవా
చాలీలావ్రజ మాత్మనందంత వసన • స్వాయన్మధూ క్షేత వ
క్త్రాలోలాంబుజపాళిఁ గన్గొనుచుఁ దా • నాసక్తిఁ రాఁ జూచినా
సాలీలన్ మరలించి రంచిత విలా • సప్రాభవోదారతన్ ౯౯

మ. లలనారత్నములంబు జాకరగనా • శ్రేణి ఖండంబులన్
జలదంభోజ సమానహస్తములచే • సంధించి తద్రంధ్రసం
కలితాంభః కణముల్ మరాళములపైఁ • గప్పంగనాటంబలెన్
గలిగెన్ నాళమరాళసంతతికి లోక • ఖ్యాతి స్వైరంబిలన్ ౧౦౦

చ. చలమున రేఁబగల్ దపము • సల్పుచు మోముల తోటిసాటి రాఁ
దలఁచెను సారసంబులని త • ద్దళముల్ హరియించి వాహినిం
గలపఁగ వద్దువద్దనెడు • కైవడి క్రౌంచము లిమ్ములైనతీ
రలలిత సాలజాల శిఖర • మ్ములనెమ్మది మ్రోసెఁ జెచ్చెరన్ ౧౦౧

గీ. సారసంబుల వాడలు • దూరితూరి
సారసంబులు వేడుకల్ • సలుపుచుండఁ
గలువగుంపుల వీక్షించి • కలువగుంపు
లగుచు జక్రంబు శోకవంక • సొగసొనర్చె. ౧౦౨

క. కంజాతనయన కటువలెఁ • గంజాతానయనలీలఁ • గనఁ బట్టినచో
మంజులవంజులకుంజస • ముంజన సింజానభృంగ • మండలి పొదలెన్. ౧౦౩

సీ. హంసయానయొకర్తు • హంసడగ్గరఁజేరి
హంసయానవ నటంచు • నటమటించి

గమలపాణియొకర్తు • కమలంబు జేబూని
కమలపాణి నటంచుఁ • గరము మురిసెఁ
చంద్రానన యొకర్తు • చంద్రవాటికఁ జేరి
చంద్రచూడ నటంచు • సంభ్రమించెఁ
గీరవాణియొకర్తు • కీరంబు దరిఁజేరి
కీరవాణి నటంచుఁ గేరుచుండ

గీ. మఱియు రంభోరు వొకతెరం • భలనుడాసి
రంభ నేనని సమ్మోదా • రంభయయ్యె
నిట్టుల సద్దివ్య భూమిసం • ఘటనమునను
ద్రిదశభావంబు దలఁతురా • సుదతులెల్ల ౧౦౪

చ. కరము నటించుచాభ్రమర • కంబులు పత్త్రము లుల్లసిల్లఁగన్
సరసవయోవిలాసములు • చక్కఁగ గన్పడఁ బద్మినీస్థితిన్
దొరసినమమ్ము సమ్మదముతోఁ బురణించుకమించు పద్మినుల్
సరసి వసింపఁగూడదని • జాడదలంచిరి ప్రౌఢ చేడియల్ ౧౦౫

మ. లలనారత్నము లంతకంతకు నవై • లామాధవీమల్లికా
ఫలినీజాతక జాతడోలికలలోఁ • బాంచాలికాపాళికా
విలసల్లీలల దోడఁగూడుకొనియా • విఖ్యాత మోదంబునన్
జలముప్పొంగగు భాలునన్ దుముకుచున్ • సారప్రచారంబులన్. ౧౦౬

క. దరివిరివిన్నైన తీవియ। దరివిరి పొదలంటి కుసుమ • తరణివిలాసా
దరలై తగిరాజకృశో। దరులా సరసిన్ వినోద • తత్పరలగుచున్ ౧౦౭

. ఒకరొకరి మేనులంటుచు। వికవిక నవ్వుచువిలాస • విభ్రమ దచక
చ్చకితాక్షులు కాసార। ప్రకట విహారంబుసలిపి • బహుళశ్రమలై

గీ. తీరములఁ జేరఁగుచతటో • దారగంధ
సారమసృణ ఘుసృణహారి • ద్రోరుమృగమ

దమిశదుదక సరోవర । మమరినపుడు
జాహ్నవీయము నానర • స్వతుంగతుల ౧౦౮

క. కుసుమ శరశరద్విసరుహా। లసితాత్మ్యను బంధగంధి • లజలాకృష్టి
ద్వ్యసరః వరిసర సరదురు। భసలవిసరసర మొరసిసె • బహువిధగతులన్ ౧౦౯

సీ. తడసిన పావడల్ • వెడలించి చెందిర
వన్నెమిన్నగు వలు • వలుధరించి
వెడద్రొమ్ముడులముల్ • సడలించి ముత్తెంబు
జడియనంబడు చిన్కు • తడలువూన్పి
నెగడుమానికములం • బాగడల సౌరముల్
కబరీభరములలో • పొంగొనర్చి
విలసిల్లు మేనిచా • యలకు చాయలొసంగు
జిమిలితున్కలరవ • ణములు బూని

గీ. తట్టుపునుంగున వాసన • లుట్టిపడంగ
నలరు మేనుల సిరిగంద • మలదివదన
కమలముల కుంకమేవుబా • ట్లమరంజేసి
నిలిచిరింతులు మరునివ్వా • ములుకులనంగ. ౧౧౦

సీ. గండస్థలోల్లస • న్మండిత నవరత్న
తాటంక రుగ్జాల • ధళ్యములును
సకలాంగ కవిశ్లేష • సంభూతలావణ్య
యోగ్యరోచిర్నిగ • నిగ్యములును
కరపద్మ భాసుర • కంకణ మణిగణ
చారువిభాచాక • చక్యములును
వ్యాలోల వరహార • లీలామనోహారి
తరదంత రుచిభాగ • ధగ్యములును

గీ. పలుకులను దేనెచిలుకులు, దొలుకజెలుకు
జెళుకనేడు చూడ్కులతళుకుల౯ ♦ జెలఁగుచుండ
దనరి వనరుహ లోచనల్ ♦ వనజశరుని
పూవుఁ దోరినంప నెమ్మదిఁ ♦ బొదలిరపుడు. ౧౧౧

సీ. గుజ్జుగొజ్జంగులు ♦ గున్నపొన్నలుకలి
గొట్టుచెట్లులతోడ ♦ గూడియుండఁ
మల్లికావల్లికా ♦ మందార మాకంద
కుంద బృందంబులు ♦ సందడింప
మాతులుంగలవంగ ♦ మాధవీ లతికలు
బంతిసేవంతులు ♦ బలిసియుండ
ఘనసార చంపక ♦ గంధసారంబులు
పున్నాగ వకుళముల్ ♦ బొదలుచుండ

గీ. సాంద్ర చంద్రోపలస్థల ♦ స్థగితదివ్య
కుసుమితలతా వితానజ ♦ ప్రసరదచ్ఛ
రస సరమధుఝరాళి ♦ భ్రాజమాన
గంధఫలి దీవకళికలు ♦ తళ్కులీనఁజేయు. ౧౧౨

క. ఎన్నికఁ గన్నియ లప్పుడు। తిన్నని పన్నీటమొదపి ♦ దిద్దినకపురం
పున్నిడుద తిన్నెమీదను। గ్రొన్నన లన్నియును దెచ్చి ♦ కోరికలలర౯. ౧౧౩

చ. పరిపూరించి దానిపయి ♦ పాండుర పంకజమున్ రచించి తచ్ఛదాం
తరముల మంచికస్తురిని, తామరసాస్త్రుని వ్రాసివానిముం
దర ఋతురాజు వ్రాసిరతి ♦ దాపలగా వెలయించి క్రేవల౯
బరిచరుల౯ లిఖించి లలనా ♦ జనము ల్పటు సంతసింపుచు౯. ౧౧౪

సీ. ధాన్యంబు మానసా ♦ యతనసంచరునకా
సాహసం బమితోగ్ర ♦ సాహసునకు
నాసనం బబ్ధిక ♦ న్యాతనూజాతుని
కర్ఘ్యంబు శంబర ♦ హారణునకును

సీ॥ చిగురాకుఁ బోడిమైఁ • జిగురుటాకు కటారి
నారవాయఁ బెరకనీ • కుచితమగున
ముద్దులగుమ్మపై • మొగిలి పూతరవారి
చేఁ బట్టిజళిపింపఁ • జెలువమగున
మొగుడ మీఁదటను సం • పెగ మొగ్గ గదఁ బట్టి
నిగుడించఁ దలఁచుట • తగుననీకుఁ
జోర్వ్యాలి మీఁద మో • దుగపువ్వు జాతుల
జొత్తుహత్తిన కత్తిఁ • జూపఁ దగున

ఆ॥ మిక్కుటంపు సాఁవు • చక్కెర వింటను
వెక్క సంపు కోల • లెక్కబెట్టి
స్రుక్కఁ జేయుమదిఁ జు • రుక్కనఁ దాకెంపు
ముక్కు జక్కనెక్కు • నొక్కు తేఁడ ౧౧౮

సీ॥ కలువముల జవరాలి • చెలికాఁడునీతొల్లి
టమ్ములఁ గన్నుల • నద్దుకొనియె
సామేనుపైఁదలి • సామినీ యానతీ
చెలికాని సోఁదల • నిలుపుకొనియెఁ
దల్పు కీట మెలఁగు • పోలఁతి సేలినవాఁడు
నీబలఁబుల మీఁద • నెనరుఁజేయు
జంటారు మోములఁ • సామినీయాజ్ఞప్తిఁ
దిసగనిచోటులం • దిరగుచుండు

క॥ బోడులను జలపట్టెపూ • బోడులందు
మనసుగల వారిగాఁజేయు • మతికరిపిగఁ
దిగబోడులనఁగ నీకు • ద్విణసమాన
మలరు విలుకాఁడ; యీరీతి • చలమువలదు. ౧౧౯

చ. నలతల దారిదారిమును • నేరమి వేరముఁ జేయురీతినీ
నెలతల దారిదారికడు • నేరమి వేరముఁ జేయనాయమా

వలపులరాయ బాగా మొదల • వంబయినందయుతేమనీషు వే
వలఁబుకించెమే సలిక • పల్లవంబుపంటి • కనిపించనూల్గొనెంత్

క. అని యిటుల నిటలతటఘటిత నిజహస్త జలజ పుటములు • దనరఁగ వనితా జనము ముదంబున నుండఁగ। దినకరబింబాంబుజము దిశెఁ • జెన్నొందెన్ ౧౨౧

సూర్యాస్తమయ వర్ణనము

గీ. సతత రాజాభిరక్షిత • స్వచ్ఛకువల
యస్థిత శ్రీలహరియించి • యూప్తచక్ర
మలరఁ జేయుచుఁ బాపాత్ముఁ • డగునినుండు
వారుణీసాంగ మగ్నుఁడై • మీరియుండె. ౧౨౨

సీ. కుంజాంతర శయాన • ఘోరసత్వంబులు
పలకింకఁ బల్లవ • పటల మొనఁగ
గైరిక ఝురకేళి • కాకిన్నరాంగనల్
కుతిజేహఁ దప్పరి • నరములంటఁ
జెంచుముద్దియలు సు • మాంచత్పరాగంబుఁ
గుంకుమ శంకచేఁ • గొనుచుఁబూయ
సరసీచరద్విజ • సంచయం బాహాస
కాంతను గింజల్క • గణముఁ గదియ

గీ. శీతలోదక మృత్పత్తి • హేతుభూత
కుసుమితలతావితానాగ • కుంజపుంజ
ఛాదిదృషాగతాబ్ధిశ • భాసమాన
రాంకవపటంబనఁగ సాంధ్య • రాగమలరె. ౧౨౩

తే. మఱియును. ౧౨౪

సీ. అరుణాశ్వఖురపుటా • హతఘూతభూతల
జాత రజోభర • వ్రాతమనఁగ

వ॥ మఱియుఁ బ్రదోష సమయనటన పాటవనీలకంఠ కంఠ నీలిమంబనఁ బ్రకుపిత తారకదైత్య బలమన, నిఖిలకాష్ఠాపహారక కృష్ణవర్త్మ మార్గంబనఁ గామినీ కేశసంస్కారధూప ధూమ సమృద్ధింబై, మధుకరని కరమేచకితకరివరకపోలగళిత దాన ప్రకారంబై, వితత తమాల కాననలీలామయంబై, పాంసులా కలితౌషధంబన పృష్ఠ...తాపత్యంబన, రజనీసమరమిత్రంబనఁ బ్రత్యక్షదర్శి...వహన బౌద్ధసిద్ధాంతమన, యింద్ర నీలమణీ మృదితంబై సంకుచత్కువలయ దినకరోదయారంభంబై తిరస్కృత కంథాంతరాళ సన్మహత్త్వంబై, అంధకారంబు దోఁచిన॥ ౧౨౭

సీ॥ పదములఁ దొట్రుపా ♦ టొదవనస్ఫుటములై
వాక్యముల్ వెలయుఁజ ♦ వంబులేక
సారస్యాలంకార ♦ చాతుర్యమెడలంగ
విగ్రహంబులసౌరు వెడలుచుండ
విగత సంశ్లేషల ♦ విలవిలఁ బోవుచు
వృత్తిశూన్యత యొక్క ♦ వింతఁదెలుప
సుహిత శయ్యాళి ♦ ధము లేర్పరింపక
యెదుట విపాకముల్ ♦ బొదలుచుండ

గీ. విరసరీతులు దోఁచంగ ♦ విమలినాంత
రాళ యాభావమునమెప్పు, రాకుకవి
నిర్మితంబౌ ప్రబంధంబు ♦ నెలవుగలిగెఁ
సందులను గొందులనుదూరెఁ ♦ జక్రకుకవి

గీ. మొదల సద్వ్యాహార ♦ మునుద్వ్యాజసంతాప
కరమునలత మోపి ♦ కారమగుచుఁ
గాలక్షేపమవుడు ♦ గనన రాజకమైన
నేమిదెలియవచ్చు ♦ నిలజనులకు ♦ ౧౨౮

చ. తొలిగలవైరముల్ దలఁచి ♦ తోరవుచీకటి మూకలెల్లనా
వెలుగులజేనిచుట్టముల ♦ వేమరుఁబుట్టి కలంచిమించియా

గలతలలన్వహింపుఁడని • గేలిగొనన్ మలినప్రభానసం
బుల నలచక్రదీపచయ•ముల్ చిలుకజేరెఁ గప్పహసించుచుఁ దొలఁగెన్•

క, ఆమోదంగులటులు జీకురు। వాయుసుభోగసంగ ద్రోవ• ట్టుచుఖద్యో
తాయాకేరుచులు దివి నలు•గానగణికలగుచు వెడలె • గౌతుకమలరన్

చ• మొగులను పల్కుటికి దను బ్ర•మోదముతో నజదేశికే ప్రుడి
చ్చుగగణితాదితార్థగతి •సంఖ్యయొనర్చి తదన్వయక్రమ
ద్విగుణితమైన యొక్కనిడి• తేకువతో గుణియించిసున్నలం
డగనొనరించునోయనగఁ • దారకలుల్లసిలెన్నమహోన్నతిన్ ౧౩౦

వ• మఱియు సంధ్యాసమయతాండవ డంబరోచ్చలిత మహానటజటాజూటవర్తి తరంగిణీ తరంగ లింగత్పృషత్పరంపరలన, దిఙ్మాతంగకరనిర్ముక్త తుషార నికరంబులన నభ్రభ్రమణ ఖిన్నదినకర తురగముఖ విక్షిప్తఫేన కణంబులన, వియత్సరోవర ప్రకట వికసిత కుముదసందయంబన, జగత్త్రయ జిగీషామనీషా నివర్గతానర్గళ భుజార్గళ మకరకేతన శిరః ప్రసారిత రతిసతీ కరతలాగత లాజలన, ఖస్థలకలశపారావార డిండీర ఖండంబుల నవ్యోమపదలక్ష్మీవక్షోవిహారహార తారముక్తాఫల నిచయంబులన నాకాశ మహాస్థాలీభజ్యమాన లాజలన, విహాయస్స్ఫాటిక ఫలకవిలిఖిత మదనవిజయ శాసనాక్షరంబులన తనరె• ౧౩౧

గీ॥ గరుడ గంధర్వకిన్నర • సురముఖాగిబు
ధాసనాసిత మస్తక • న్యస్తకుంద
మల్లికాఫుల్లసుమనస్స • మాజమనఁగ
సురపథంబునఁ దారకా • భరముదోఁచె ॥వ॥ ఆట్టియెడ॥

వేయిమోములతో గంగ • డాయుటయును
దదభిముఖముగ వచ్చు• ప్రాగుదధి మకుట
తటఘటిత హీరవరవిభా • పటలమనఁగఁ
దొలుత దెసవెసఁ బలువైన • వెలుఁగుఁ దోఁచె॥ ౧౩౨

సీ॥ సరసీవరులసంకు ♦ జవ్వాదిమెకములు
క్షీరసృహన్ వారి ♦ పూరమానఁ
గలిత భిల్లాంగనల్ ♦ కైతకధ్రాంశచే
నెలమూవిచిగుసేటా ♦ కులఘరింప
ముదితని షణ్ణేభ ♦ ములుకుంజములఁగాంచి
హరిశంకచే మహా ♦ దరులదూర
సౌరకామినులు వృ ♦ క్షచ్ఛాయలనుఁ జూచి
యూరకు లేతెంచి ♦ రనుచుఁ దగ

గీ॥ వేలుపులతోర్మి వసిరిపొండ్లి ♦ వేళసకల
దివిజులైడ తెగకుండ సం ♦ ధించినట్టి
మహిత కళఁ దగు వెన్నెల ♦ మడుగులనఁగఁ
నిండు రేయండ జగముల ♦ నిండియుండె॥ ౧౩౦

క॥ చెలులార చూడుడిదెమన। చెలులారం సవిలసదచ్ఛ ♦ సీధురసమువె
న్నెల రారాల్గలగెన్నెల। నలరారం దెచ్చిరనుచు ♦ హర్షంబెసఁగన్

క॥ పానము సేయఁ దగుపయః। పానముదధి పానమమృత ♦ పానముహాలా
పానమునకు సరిగాదను। మానముమానససమునందు ♦ మలయుచునుండన్

వ॥ అట్టియెడ హింతాళీతాళీనారికేళీ ♦ ఖర్జూరీ ముఖవృక్ష సంభవంబైన గంధో
త్తమాధానంబునన్ దనరి ౧౪౧

సీ॥ పాణిక్యతైలాచూర్ణ ♦ భరితసద్యోఘృత
పక్వసంస్కారపూ ♦ పములఁగొన్ని
మరిచమి శ్రీకృష్ణ ♦ త్రగుణమేషాజాది
రమణీయ పలలహా ♦ ర్యములుగొన్ని
గంధిల ద్రవ్యాను ♦ బంధబాలశిరంగ
శిరసమస్కృతపా ♦ యసములఁగొన్ని
సమ్యక్సితోపేత ♦ శష్కులికాధార
క్షీరమార్గ మృదుబన్న ♦ క్షములుగొన్ని

క. నలవణార్ద్ర కపిశ్వేభే ♦ షజన మేత
ధన్య దుగ్ధయణిపుండ ♦ దధిసమృద్ధ
శాలితండుల భక్తంబు ♦ సంగ్రహించు
కొనుచునారామలవ్వేళ ♦ వినయమలర ౧౭౨

క. సుమలతకదంబకదంబక। కమనీయపరాగ వేది♦కాస్థాన్నుశ్రీ
రమణీమణినర్చించిరి। సమబుద్ధిని షోడశోప♦చారవిధులచే ౧౭౩

సీ. నవరత్న ఖచితపీ ♦ ఠా దన వినోద
సంగీత రసికశ్రీ ♦ సారసాక్షి
లలితలీలాశుకో ♦ ల్లాసిని బింబోష్ఠి
సరసయావక యుక్త ♦ చరణనఖర
అంచితాకీర్ణకే, శాళికహృద్యాంగి
శితశంఖ తాటంక ♦ యుతసుకర్ణ
కమనీయ మణిపరి ♦ ష్కారసముజ్జ్వల
సస్మితాధర పూర్ణ ♦ చంద్రవదన.

గీ. లరుగుమహా లక్ష్మి కుపహార♦ముగ నొసర్చి
వలయుకస్థితిచే మధు ♦ వారమునకుం
దారతమ్య విశేషత ♦ త్వరతఁ దనరి
గోష్ఠినలిపిరి యామునస్థ ♦ గుమ్మలప్పుడు ౧౭౪

వ. ఇవ్విధంబున మధుక్రమంబునందవిలి కాండ జకాకడప్రకాండ పుండ్రేక్షుకో దండ కాండాసన పాండిత్య హిండితంబైన చంద్రమండలంబు వెలుంగ నెలచ లుపలుగఱఁగి జలజల జాలు గాఁ నీరంబు పన్నీరంబునం గలసి తోరంబులైన యారంబులందగు కుసుమ సముదయంబులవలన వలపుఁజెందు మరంద బ్రం బునొందుచు స్ఫటిక ఘటితంబులైన పడకల నపరి గంధేభయానలకుగంద

ధౌత్తమ భ్రాంతినిఁ బుట్టింపుచు సజ్జసజ్జలనజులగు గొజ్జఁగుజ్జంగుల వలని చలి
జలంబు సొంపుసంపాదింపు కెంపుజొంపములుఁగ చోటుల నిలచి నగాశ
మధ్యంబని మదవతు లెదగు కరిన కుచంబుల గ్రోలఁ గమకించి స్వప్రతిబిం
బులగు నిజనేత్రంబులు సంస్కారాక్ష ప్రతిష్ఠాప్తల దళంబులం కరంబు మనంటి
న నవి యంటకుండుటం దెలిసి నవ్వజవ్వనులును హారిహాయోపల విపులాల
లంబులఁ దొట్టిన తేటచలినీటిం జాచి ద్రాక్షాఫలరస విసరంబుల జనించుమా
ధవకంబని కొందఱు ముగ్ధాంగన లుపభోగింప బోగింపఁ నిజాననంబుల
యందు బ్రతిబింబించినఁ దద్వాసనార్థంబుగా నాసించు కమలంబులని భ్రమ
జెంది రిత్తయగుటకు నబ్బురంబు నొందువారును గలిగి జిగిగరగరి పచ్చల
విచ్చలవిడి గ్రచ్చుకొనవచ్చు నచ్చంపు పన్నీరు చెఱకు రసంబున జనించు నా
సవంబని యానగమకించి స్వీయనాసికలందుఁ దోఁచిన గంధసార కలికలని వి
చారించి నిశ్చయింపనివారును బుష్యరాగంబులుగల చోటుల పాటంబుగా
నిండిన సేవంతి కాసుమ సముదయ గళన్నీరపూరంబు తేనియ వలన సంభవిం
చు మధ్వాసవంబని తలంచి దవ్వుదవ్వులం బోవు చెలులఁ బిలచుకొని కలసి
యాస్వాదింప దదభావంబగుట కరుదందువారును గోమేధికంబుల నెలవున
నలముకొనిన పుష్పరసంబు ధాతకీప్రసూన మిశ్రితగుడసహిత ధాన్యాంబుకృ
తంబైన మైరేయంబని గ్రోలంబోయి సిగ్గునొందువారును సొగసుగలమగమా
నికంబులని గనిగనులోయల వెన్నెల తేటనుదీటుకొను వలినీరు పైష్టికంబైన
మాధ్వీయని తలంచి తారసిల్లి తెలివినొందువారును వైడూర్యంబుల విలసిల్లు
కలుగుల నలరు తెలిసలిలంబు బాలతృణమూల సంజాత హాలావిశేషంబని
కదిసి పిమ్మట॥ బోవువారునై సాంద్రచంద్రాతపక్రీడా వినోదంబుల సుప్రస
న్న ప్రసన్నోష్ణపదశ ప్రత్యవస్థానంబులం దలితరువుల కాంతలంగని లాతివారు
చనుదెంచిరని భయంబడి నిశ్శబ్దంబుగాఁ బానశాలా పురోభాగంబున నెదు
గువారును, నస్మృతి విశేషంబున భూషాంబరాదుల వ్యత్యయస్థితిఁ జేర్చువా
రునై యుండ చంద్రాంగద దర్శనార్థ మహాముని తపస్సంకల్పితఁ బగు నుద్యా
నవనంబునందిరుగు మెఱుంగుఁబొఱుగు బోడ్లం గనుంగొని యా కీర్తిమాలిని
యాలబన గుణంబైన రూప యౌవనాదికంబును యౌవనోద్భూతంబులైన

హావభావాదికంబులును దదలంకరణంబులైన నూపురాంగద హారాదు ను
దటస్థోద్దీపన ప్రవర్తకులైన మలయానిల చంద్రాదులును స్ఫురించి నంతకంత
కు వలవంత యగ్గలంబై తోఁచ విరహాభరంబున నొక్క మంజరీసంజాత సిం
జానమధుకరీ పుంజరంజిత కుంజాంతరంబున నిజసఖుల గన్మొరంగి వసించిరి.

సీ. కన్నవ యీక్షణా • కాంక్షచే విలసిల్ల
చిత్తమభీప్సితా • యత్తమయ్యె
సంకల్పము తదేక • సరణి బ్రవర్తింపఁ
గృశతనెమ్మేనున • విశదమయ్యె
నరతిమిక్కుటమై దు • రంతమై కనుపట్ట
హ్రీత్యాగమధికమై • యేపుఁజూపె
నున్మాద మవ్వేళ • నుద్వేలమైయుండ
మూర్ఛము నొప్పదలియు • దృబ్ధమయ్యె

గీ. సంత్యమూర్తియు సందేహ • మైతలిర్చె
ఘోరతర విప్రలంభశృం • గారమునను
దగుననంగ దశాదశ • స్థానమాన
సమునఁ జింతాభరంబునఁ • దేమలితేమలి. ౧౮౩

వ. మఱియుస్తంభప్రళయ రోమాంచస్వేద వైవర్ణ్యకంపాశ్రు వైస్వర్యంబులను
సాత్త్వికభావంబులు నిర్వేదగ్లాని శంకాసూయామద శ్రమాలస్య దైన్యచిం
తా మోహస్మృతి ధృతివ్రీడా చపలతా హర్షావేగ జడతాదులగు సంచారి
భావంబులును మనంబునందోఁచినఁ జింతాసంతాప సమ్మోహ నిశ్వాసభరం
బునొంది యుండునట్టియెడ. ౧౮౪

క. పెనఁగొనిన విరహబాధను । మనలందిగ నాడికీర్తి • మాలినియటకే
గనొ యరయవలయుననినె। ష్మనములఁగని కరముఁదోప • మగువలు వేగన •

శా॥ రాకేముద్దులగుమ్మలార వెదుకన్ • రాకేందు బింబాస్యయా

శ్రీరాజన్యుని స్వాత్మలో నిడి కృశిం • చెఁజూడ రే నేఁడు ను
ర్వ్యారాకార విహార మారకృతసం • శ్రాసాధిక వ్యాధిమ
చ్ఛారీరాదృతినోఁగన శ్రమజలా • సారంబు తోరంబుగాఁ ౧౭౬

వ॥ అని వితర్కించి

శా॥ నానా సూనర సాతిరేకమధు పా • నల్ చేత నాచేతన
జ్ఞానానూనలు వ్యత్యయావయు వసం • ధానాంశు కాంతల్ గిళ
న్యాసధ్యాన వితానతైన నవలా • లున్మత్త మత్తేభరా
డ్యానాన్వేషణ భాషణంబులఁ దదా • యత్తైకచిత్తంబులన్ ౧౭౭

సీ॥ తరుల లోపలఁ దీవ • తలతావులనేటి
దరుల త్రోవుల వింత • లరసి యరసి
తొగలచాయలను నం • పగల పాయలనుగం
పుగలలో యలను వెఁ • దగిలి తగిలి
సరములన్ విరిదం • తరములన్ మకరంద
ఝరములన్ మిక్కిలి • మొరసి మొరసి
విరుల గుంపులను గ • ప్పురపు పెంపులను చ
ప్పురపు వంపులజాలఁ • దిరిగి తిరిగి

గీ॥ దారువుల సా వులమీఁదఁ • దడసి తడసి
నేలలో మాలలోఁ జొచ్చి • నెమకి నెమకి
గారముల తీరముల పట్టు • లెక్కి యెక్కి
రేవులను బావులను జల • రేగి రేగి ౧౭౮

సీ॥ మదనాగ చూడవే • మదనాగయానను
కుచచూడవె పర్తు • లకుచనిపుడు
కరవీరచూతా భీ • కరవీరపుత్రికన్
జీవక చూపుమ • జీవకసఖిఁ
బాటల మాయాట • పాటల వింటివే
చంద్ర చూడగదె మూ • చంద్రముఖిని

సీ. పోవఁబోవఁగఁ దోఁచెఁ • బుడమిఁ గస్తూరివాసనల్
లడర బెడంగైన • యడుగుజాడ
లరయనరయఁబిఁ • దంతరాంతఃపాతి
తఃప్రసవంబుల • తలలుమెరసె
జూడఁజూడఁగ నొక్క • చోటఁగాటంబైన
యాట తేటులపాట • లమితమయ్యె
వినివిని తారిన • విద్రుమాధర వేణు
వీడ్యంపు సనల్ • వెడదయయ్యె

గీ. దరియఁ గదసిన నొకతీవ • దరివిరిగాద
క్రింద నందముగాఁగఁ గ్ర • క్కందనాదు
లందగుల్కొను కురువింద • పందిటందుఁ
జొక్కమైనట్టి కపురంపు • టిక్కదండ. ౧౫౯

మ. సవిధోదీర్ణ సుధార్ణవీభవదన • శ్యాయోంద కావాలభూ
లవలీచూతల తావితాన సహితై • లామల్లికావల్లికా
భవనాంతద్రజనీకరోపల తల • ప్రాయః ప్రవృత్తప్రసం
భవశయ్యాగత గంధవాహకృతస • న్మానం బపేక్షించుచున్. ౧౬౦

వ. వసించు చెలిం జూచి. ౧౬౧

క. వికవికన?. సకియరోసీ। వకటాని కటాద్రిరూఢ • హరిణాంకమరు
న్మకరధ్వజ మధ్వాదులు। తుకతను పుడికించునిటులఁ • దూకొననగునా ౧౬౨

చ. తలకవదేమి వింతగల • దాకల నాపరమైన మేలిదే
వలదని పల్కనల్కతగు • వామగువాచల పాదియైననీ
పలుపుల కేనిరీతి విన • నాకనవాయిటువంటి చోటులన్
నలవొసరించమించు మతి • నీకగునా తగునాది మోసిని ౧౬౩

శా. తాపం బేపగిదిన్ వహించితినిరా • తంకాంకగాపాదిత
వ్యాపాదుల్ దురరుంతుదోన్మద వచో • వక్త్రద్విరేఫోదితా

టోపుల్ కోపులుమన్మథ ప్రభృతులై ♦ ట్టోకాన్నినుః సైచుటల్
భూపాలాత్మజవైనవైన మనయుం ♦ బున్మించిదూహించినః. ౧౬౪

క॥ అనవహారహార్వి రహాజద హాసవహానాసహానచిత్తు ♦ మైప్రకటపునః
పునరంగ నాప్రచోదిత। మనమునసోకరీతిభీతి ♦ మల్లడికొనఁగా ౧౬౫

చ॥ నెలతల మూపులాపులుగ ♦ నీడలనీడల నాపకాడకున్
నిలచియొకింత చింతిలుచు ♦ నెవ్వరగందుచు గుందుచున్మయిన్
బులకలు జెందడెందమునఁ ♦ బొక్కుచు వెక్కుచునుస్సురంచుహా
యలరుల వింటిదంటవెగ ♦ టాయగదే జగదేకసూరుఁడై ౧౬౬

వ॥ అని యాచేడియలలోఁ బ్రోడయగు నొక్క పూఁబోడిఁజూచి ౧౬౭

మ॥ నెలతా వెన్నెలవేడియై మొయికడా ♦ నిఃవేగరంగించెనో
మెలతా కోమలతాంచితా వినవదే ♦ మేమన్మథుండేయున
మ్ములకుః దాళ నతాఖిలావయవనై ♦ పుంస్కోకిలాలాపముల్
గలతా నాకలి తాళిసంతతి మ్మెలం ♦ గః గంటివేనెచ్చలీ ౧౬౮

గీ॥ ఏమిసేయుదు వీరహార్తి ♦ నెట్టులోర్తు
గామువలెడాయుఁ గాము నే ♦ కరణిగెలుతు
నేమొడలనైన నీమాటఁ ♦ ద్రోయలేనె
నెలతరోయని పలుకన ♦ వ్వాలఁతవినిచె ౧౬౯

చ॥ రహివిడనాఁడఁగూడ దన ♦ రాళమురాళక రాళ భావనా
సహానము చేతమారనకు ♦ సాయకదాయక నాయకాఖ్యుఁడా
బహుళ తరప్రకాండ సుమ ♦ భారవనార విహారచైత్రచేఁ
దహాతహానొంద నేలిముది ♦ తావిదితా దివితం బెటులఁగ కన్ ౧౭౦

మ॥ అని యీరీతిధరామహేంద్ర సుతలో ♦ నాలేఖమున్మల్లెమొ
ల్లనసేర్పొప్పన సామవాక్యములుదె ♦ ల్పఃస్వాంతజాయల్లకం

బను వేలానల కీలజాలముగద్ది ♦ వ్యాపార సీమాంతరం
బునఁ జెన్నొందిన ఖేదభేద ♦ మలరంబుంజీ భవత్తాపమై ౧౭౧

మ॥ లలనారత్నము నింపువెన్నెలకుఁ ♦ దాళన్ లేక పైతా కం
చలమాస్యంబునఁ జేర్చియేడ్చును మన ♦ శ్యామాకరాంగోమహా
కలిత గ్రామ విశేషక శ్రుతకళా ♦ కాలక్రియామాళవ
ద్విలసత్కన్నడ గౌడమేళకలనా ♦ వీణాను కారధ్వనిన్ ౧౭౨

కం॥ అనివగచిను నుప్పొమొనచే దనరినగేదంగి సురియ ♦ దరినదర్శించన్
గనికరములఁ గరములనార్చకనకాంగులు గ్రుచ్చిగ్రుచ్చి కౌఁగిటఁజేర్చున్ ౧౭౩

కం॥ వలదని వనితలు లవలీ। వలదనిలచల తలతోఁ ప్రవర్తనమునఁగ్రే
వలద విలినిలువరింపక। వలఁదవిలిన మీనురీతి ♦ వనితవడంకెన్ ౧౭౪

గీ॥ ఇటులవడికిన నన్యథా ♦ వృత్తివర్త
నములఁ దవులని యిందిర ♦ నటనలైన
తనువలగ్నల్ లోకించుక ♦ తడవునుడువ
నాలుకాడకనాడాడు ♦ జోడుగూడి ౧౭౫

గీ॥ విప్రలంభార్తి చేఁ జిక్కి ♦ వెలఁది స్రుక్కి
దీనికొక్క యుపాయంబు ♦ బూనవలయు
ఫలకవిలిఖిత తత్స్వరూ ♦ పంబుజూపి
శాంతి నొందింత మీవంత ♦ కాంతదీర ౧౭౬

గీ॥ అనివిచారించు నిశ్చయా ♦ వశవిలాస
వర్తియైనట్టి యాతని ♦ వర్ణనీయ
ఫలకతలమునఁ జిత్రరూ ♦ పముగ వ్రాసి
మోలనిలిపిన యారాచ ♦ ముద్దుపట్టి ౧౭౭

కం॥ చూచితలయూచి తత్సమ। యాచరితాయత్త కార్తి ♦ నా ఫలకంబా
లేచితదృష్టింగనుఁగొని। రాచూలివి రాలిఁ జేలి ♦ రాపడిపలికెన్ ౧౭౮

ఉ. ఏలరయిప్పుడింత చల • మేలర మారుని కేళిలోనన
న్నేలర యీవిరాళిఁ గొన • నేలరనాఁ దగువంతదీర్పనా
భీలర సాలసాల సుర • భీకృతభీకృద నూనసూనవా
చాలవిశాల మాఘుకర • శబ్దఘులన్ విన జాలనేలరా ౧౭౯

వ. అనిపలికి యాచిత్ర ఫలకంబక్కునం జేర్చి పలుకరించినం బలుకవని చిత్తంబున జడియుడి పడుచు సారెసారెకు దూరుచు విరిపరపునం బొరలుచు నంతలోఁ జెలివొంది శిరఃకంపం బొనరించి కన్నీరు మున్నీరయి పయ్యెద దడియ నెత్తఁగుందికుంది యాశయ్యను మేనుజేర్చి నేత్రాబ్జంబులర్ధముకుళితంబుగావించి ప్రాణనాథుండు పురోభాగంబున నిలచెనని విచారించి లేకున్న విన్నదనంబుడొంచ విరహమోహ సాగరమగ్నయై యేదెస కేగెనో యని నలుదెసలం జూచి లేచి సౌందర్య చంద్రాతపంబునఁ దిరిగి పరవశాయత్త చిత్తయై దేహంబుగంపింప నెచ్చెలి మేన గ్రాలియొక్కింత సేపు నజ్ఞాతచేతనయై నిదురించిన నీవలవంత కొంతదీరునని తలంచి యూరకుండి కలవరంబునొంది పలువ పలఁ జెందుసుందరితలంకి ౧౮౦

లయగ్రాహి

బంగరు మెఱుంగుల తె • రంగు లలితాంగముల
సంగునిడుబీరపు సె • గంగరఁ గినీరై
పొంగి వలిగుబ్బల బె • డంగులఁ దగంగదరి
యంగదలి పొక్కిలి మ • తంగు నఁ బడంగఁ
ముంగురులు చెంగలు వ • రంగుల కనుంగవకుఁ
జెంగటనటించుచుఁ దొ • లంగకనియుండఁ
ముంగర జరంగిపెద • వింగదియ సొంగలియ
నంగుచెలు లంగను చ • నంగనవడం కెన్ ౧౮౧

మాలినియును ౧౮౨

సీ॥ ఏమీఁ బలాత్కాళిఁ ♦ గలసిన వానికి
మధుసంభ్రమంబున ♦ మసలుకొంత
మధుసంభ్రమంబున ♦ మసలినవానికి
చండాలులను గూడి ♦ చలఁగుకొంత
చండాలులరఁ గూడి ♦ చలఁగిన వానికిఁ
బుష్పవతులఁ గూడి ♦ పొంగుకొంత
పుష్పవతులఁ గూడి ♦ పొరలెడు వానికి
నలకుజన్మప్రాప్తి ♦ నలరుకొంత ౧౯౩

గీ॥ యొకటి కంటెనొకటియుచ్చ ♦ రికము సేయఁ
బద్మసిద్ద్విజగోహతుల్ ♦ బరఁగఁ జేయఁ
గడఁగువారలలోపల ♦ గలసిపోలసి
సంతసించెదు మద్గుణ ♦ సదసమపస ౧౯౪

సీ॥ దాహంబుగొనినీరు ♦ దాగవచ్చినవిప్రు
ధరఁ ద్రెళ్ళనేసినీ ♦ తాతయెన్న
చనువుతో శిశువని ♦ స్తన్యంబొసఁగవచ్చు
దానివధించెనీ ♦ తండ్రియెన్న
యోగాలంబున వశించి ♦ యోగిరం బిడునట్టి
దానిఁ ఖండించితివి నీ ♦ వరుసదలఁప
జాతిపీతుతెలుంగ ♦ జాలగంతట నిందు
గానియుండె నారనీ ♦ జననియరయ

గీ॥ నిలను స్త్రీభ్రంశ మానసం ♦ బులగలంచి
పెనఁగఁజేసిన నినుబట్టి ♦ కినుకతోడ
గట్టివిల్తుండు పనియించి ♦ కరుణఁదిరుగఁ
బుట్టఁజేయుట కేమాదుఁ ♦ బుష్పధన్వా. ౧౯౫

—:౦ చంద్రభూషణ ౦:—

సీ. లలితసంపూర్ణక • ళావేది యనఁదగి
విష్ణుపదాసక్తి • వెలసినావు
సన్మార్గముసమించి • సంచారమొనరించి
విబుధసంగతిఁగని • వెలసినావు
ఘనసంగమంబున • ననమంబు విలసిల్లి
యాతనుమిత్రఖ్యాతి • నలరినావు
చెలఁగుచు సర్వజ్ఞ • శేఖరతవహించి
ఖచరతుష్ట్యర్థతఁ • బరగినావు

గీ. తరుచు బహుపోకలనుబోయి • తిరుగుచున్న
గంధవహునితో నేస్తంబు • గలిగియేచ
నేలయీవేళ నేముద్ర • రా ననఁగ
నందమానీకు చంద్రమా • చందమామ ౧౯౬

సీ. దోషాభిముఖుఁడవై • దురితంబు నొందుచు
నలసదాచారుండ • ననుటకొంత
మ్లేచ్ఛానుమోదివై • మేదిని విహరించి
ద్విజరాజననుకొంట • వెఱ్ఱిగాదె!
కువలయాధ్వన్యులఁ • గుందింపుచుండియుఁ
గువలయాప్తుఁడనను • కొంట కొదువ
విషసరిత్పతి నుద్భ • వించి యమృతవార్ధి
వెడలితినను మాట • కడమగాదె

గీ. నేరముల పారములు గల్గి • నీరిసేరి
నందియము లేకయిపుడు మి • న్నందినావు

నీదునకుమంత్ర పుంగల్మి ♦ వాదులేల
సారెసారెకు వినరోరి ♦ సారసారి

సీ ॥ ...గుకళాదుండను ♦ ధన్యనామముఁ జెంది
మును క...దు...దన...♦ ...రినావు...
తతనురాహా నాక్షా ♦ తవహించి రతెసు...
హానాక్ష...సహించి ♦ ప్రబలినావు
గురుపరి గ్రహము పైఁ ♦ గో...ఁ బీసింపుచు
గురు పరిగ్రహమునఁ ♦ గుందినావు
ద్విజవర్ధన ఖ్యాతిఁ ♦ దేజరిల్లుచునుండి
ద్విజవర్ధన ఖ్యాతిఁ ♦ దేలినావు

గీ॥ బహుళ పాపంబుల భరించి ♦ పరఁ గునిన్ను
ముందుగా రౌరవ స్థితిఁ ♦ జెందకున్న
మెలమిఁ గీలాలజన్ము నఁ ♦ కేలగల్గు
సద్గతులు భువివినరోరి ♦ సారసారి ౧౭౮

సీ॥ భర్గుఁ డధ్వరములో ♦ పలనీకరంబులు
దరగంగ ఖండించఁ ♦ దలఁచఁడయ్యె
రావణుని దంష్ట్రాంత ♦ రంబునని మిడించి
కసిగంద కుండంగ ♦ మెసవఁడయ్యెఁ
వపసి...న్ పాండురు ♦ క్ష్మానుఁ గానొనర్చెను
గ...డస్సి పోవంగ ♦ నుడువఁడయ్యెఁ
జడదారి నినుగంట ♦ వెడలించెఁగానివే
గర్భస్థుగాఁ జేయఁ ♦ గానడయ్యెఁ

గీ॥ నార నీవంటి దుర్మార్గుఁ ♦ డ ఖిలమునను
గలఁ డనవలాలనే చరగఁ ♦ దొలుతకడిమి

నిన్నుబుట్టించి మున్నొక్క ♦ జన్ని గట్టి
పాపతాడనము వహించెఁ ♦ బంకజారి ౧౯౯

॥ పల్లచేతులవాఁడని ♦ జనులుబొగడ
వేడికరముల వాఁడవై ♦ చేడియలను
జలతనొందింపఁ జేసితి ♦ జడభవంబు
గలుగువానికిజ్ఞానంబు ♦ గలదెచంద్రా ౨౦౦

## మలయమారుత దూషణము

సీ. ఎనసిచూచిననిల ♦ చినచోట నిలువక
భువనావిలత్వంబు ♦ బూనినావు
భువనావిలత్వంబు ♦ బూనుటయేగాదు
ఘనుల నిల్వఁగనీక ♦ కలఁచినావు
ఘనులనిల్వఁగనీక ♦ కలచుటయేకాదు
తవిలి రజోవృత్తిఁ ♦ దాల్చినావు
తవిలి రజోవృత్తిఁ దాల్చుటయేకాదు
సోకుసంగతులచే ♦ సోలినావు

గీ. బుడమి పాశ్చాత్యసరణుల ♦ బొందువారు
తవిలి దాక్షిణ్యపదమున ♦ దారుటరిది
సుందరీజన బృందంబు ♦ గంధఁజేయు
వలదు వలమాన పవమాన ♦ మలయానిలయ

ఆ. విరహిజనుల్లక్ష్యల్లాద ♦ వేడిమిఁ దరికొల్పు
సామివగుట కగ్ని ♦ సాక్షియయ్యె
నలినకారణం వి ♦ నాక్కార్య ముత్పద్య

తేయటంచు నీతి ♦ తేటపడియె. ౨౦౨

సీ. కనకసంచయముప్పెఁ ♦ గాంతి జెన్నొందుచు
గంధోత్తమూవనిఁ ♦ గలయనిరిగి
ద్విజసంతతుల మింటి ♦ తెరువ్రునఁటగఁజేసి
గోచయంబుల తెల్పిఁ ♦ గొఅతఁజేసి
బలముచే సరసుల ♦ భంగపాటొందించి
సుమనః ప్రపాతన ♦ స్ఫూర్తిమించి
పరరజోవత్తులైన ♦ పద్మినులఁగలంచి
యుత్పల ప్రీతిచే ♦ నుల్లసిల్లి

గీ. మహినిస్థావరములజంగ ♦ ములఁగల్లంప
ముండజేసి పిశాచాది ♦ యోగ్యవృత్తి
మేనులభరించి దర్పించి ♦ మించియున్నవు
మలయవలదుర నామీఁద ♦ మలయపవనా. ౨౦౩

క. పవనావన్నికః కరుణింపవనాపవనాళిసగర ♦ భారగమలయో
పవనోదర భవనాకర। జవనాకుసుమాళుగాంగ ♦ జాలశతాంగా. ౨౦౪

—:వసంత దూషణ:—

క. శివిరిమదన యానమవై! తివిగాభవనాయమాన ♦ దీవ్యన్మలయా
పవనాగురుపవనాజరు। పవనామకుబారిని గుడి ♦ పైరాకుండఁ ౨౦౫

గీ. పకలజాతుల కెల్లన ♦ సహ్యావృత్తి
సంచరింపుచు నుండు వ ♦ సంతనీవు
విరహిదశనొందు చున్నట్టి ♦ వెలఁదులందుఁ
గరుణలేనట్టి కాయఁజు ♦ గదియఁదగునా ౨౦౬

వ॥ అని పలికి పికశుకమధుక రాదుల నిందించి నివ్వెరఁగందు యాసుందరింగని
చెలులవుడు ౨౦౭

చ. కదియఁగఁ జేరిచేరి బిగి • కౌఁగిటఁ జేర్చి యదేమి దేమి నీ
వదరునఁ జెందనందము లె • యౌనవునేమన నింటికేగిసం
గొదువ యొకింతలేక యొన • గూడుశుభంబన! నమ్మనమ్మకం
బాదలెడు విప్రలంభ పరి • పూరితమానసయై రయంబునన్. ౨౦౮

వ. ఇవ్విధంబున బోధితయై సఖీజనంబులతోడ నిజాంతఃపురంబు ప్రవేశించి యొ
క్క సూనశయనంబునం బవ్వళించి మిక్కుటంబగు చక్కెరవిలుకాని చిక్కు
లఁజిక్కి నొక్కి కళవళపడుచు నలుదెసలంజూచుచు నాచిగురాకుఁబోఁడి విరహ
వేదనా ధూయమాన మానసయై యుండు తఱిఁ దత్సఖీజనంబు వగచి తద్వి
ధంబుతెయుఁ దజ్జనకున కెఱింగించ నతండు శైత్యోపచారంబులు జేయ ని
యోగించిన. ౨౦౯

క. నెలరాలనలుఁగిన్నెల! జలజిలయని బాలు నారు • శీతలవారిన్
పలిపె ముత్తామరనూల్గల! తెలివలువలు ముంచిమించి • తేకువతోడన్ ౨౧౦

గీ. కప్పురంబును బన్నీరు • గదిసినట్టి
గంధమందంబుగాఁ బూసి • కంజపుంజ
కేసరంబుల వ్యజనంబు • జేసివిసరి
శాంతి నొందింపుచుండిరి • సంభ్రమమున ౨౧౧

వ. అని శౌనకాది మహామునులకు సూతుండు జెప్పిన ౨౧౨

మ. అసమాశేష విశేష పాశుపతయో • గాధేయగాధేయతై
జసవృత్తి ప్రదవిశ్రుత శ్రుతిశిర • స్సంధాన సంధానమ
ల్లసమాన ప్రమథాధి నాయకసదా • లంకార లంకారసా
రసదింద్రాది నుతాంఘ్రి పద్మహృతపా • రావార రావారయా

క. ర్ణవిజి తలాంకజృంభణ! చణకాంచదనంతకోటి • సరసీరుహాభూ
గణితాంధక హారదృంభా • ఫణిమణి ఘృణిలసితకర్ణ • ప్రత్యర్పూర్ణ ౨౧౩

పంచచామరము

చరాచర ప్రపంచరూప ♦ సజ్జటాట వీనట
స్మరుత్సరిత్త రంగసంగ ♦ మప్రశస్త మస్తకా
సురాసురాది వందనీయ ♦ శుద్ధశైవ భక్తిమ
ద్ధరామరప్రధానధీని ♦ ధానముక్తిదాయకా ౨౧౫

మ ఇదిరాజేశ్వర పాదపంకజ సప ♦ ర్యైతప్రభా ప్తసం
పదుదీర్ణత్వ విధుత్వ ధర్మసుగుణ ♦ ప్రాల్భ్య సంయుక్తసం
మ్మదరాజన్న నృపాలకాభిహితశుం ♦ భత్కీర్తి భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము చతు ♦ రోలాస మొప్పార్ధరన్ ౨౧౬

గద్య

ఇది శ్రీమద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణారస కటాక్షవీక్షణ ప్రసాద ప్రా
పాశేష భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్ల గోత్రపాత్రి కామినేనివం
శపయః పారావార రాకాసుధాకర రాజద్రాజన్న దేశాయిసార్వ
భౌమాజ్ఞా పితాంధ్ర గీర్వాణ కవిత్వతత్వ చాతుర్యధుర్య
పరాశరగోత్ర రాపాక లింగనార్యపుత్ర లక్ష్మిపతి
ప్రణీతంబైన భద్రాయురభ్యుదయంబను
మహాప్రబంధంబునందు
చతుర్థోల్లాసము



శ్రీ శుభ

# భద్రాయురభ్యుదయము



## పంచమోల్లాసము



శ్రీమత్సువర్ణ పూర్ణమ
ణీమయసంతత సువాసి ♦ సీపూజితల
క్ష్మీమందిర పరితోషిత।
రామారెడ్డీంద్ర నగర ♦ రాజమహేశా. ౧

వ. అవధరింపుము ♦ శౌనకాది మునీంద్రులకు నిఖిలపురాణ వ్యాఖ్యా ఖ్యాతుం డైన సూతుం డిట్లనియె నట్లు నారాజకన్య నిశాంత సమయంబున శీకృత శైత్యోపచారంబు లొందుచుండు సమయంబున ౨

సీ॥ ఎడనెడఁ గన్పట్టు ♦ నడుతత్తుల్ ముత్తెంపు
గుత్తులు గలపువ్వు ♦ టెత్తులుగను
తొగరుడాల్గల మొగుల్ ♦ తెగలు లత్తుకనుబె
డంగైన చీరచ్చె ♦ రంగులుగను

కొమరుఁగారు కలికిమొగుల్ ♦ తెరతెరల్ నలుసైన
యగరు ధూపంబుల ♦ పొగలుగాఁగఁ
బలుచనై వెలయుచు ♦ వెన్నెలపిండు లందంపు
గందంపుకోరల ♦ చందములుగఁ

గీ॥ బూడలచాయలు కపురంపు ♦ మసుపులుగను
గుంపు రేమెండ దీపంపు ♦ సొంపుమీరఁ
బొలిచె నానాయికానాయ ♦ కులకుఁ గలయుఁ
కేళికా తల్పమనఁగన ♦ వ్యోళమింట

సీ॥ శ్యామానుమోదంబు ♦ సమకూర్చి కలజీవ
నములకుఁ జల్లద ♦ నంభోనర్చి
సంపూర్ణ కళలచేఁ ♦ బెంపువహించి కు
ముద్వతీ వికసితా ♦ మోదమొనసి
బహుళరశ్మిస్ఫీతిఁ ♦ బలుమారు బుధకోటి
కర్పించినట్టి మ ♦ హానుభావుఁ
డనుదిన శ్రీవ్యయా ♦ వ్యయమునఁ దనరారి
కువలయంబుల ప్రేమఁ ♦ గోరుచున్న

గీ॥ సరసుఁ డైనట్టి రాజు ద్వి ♦ జప్రభువుల
స్వపదస్థులసంచె యామత్ర ♦ యపరిమితప
థంబు గతియని పలుమరు ♦ ధర్మదేవ
తలు బలుకురీతిఁ జరణాయు ♦ ధములు మ్రోసె

ఆ॥ సకల చక్రపాల ♦ నకుతూహతేనుండు
శార్వరప్రకాశ ♦ శాసనుండు
కదిసిరాఁగ నెదుట ♦ కాహళంబులు మ్రోయు
సరణి కుక్కుటములు ♦ తఱచు మ్రోసె

ఆ॥ ఇఁక మరుద్విజాళి ♦ వృత్తులొనఁగు గొర
వచ్చెనని త్రిశుద్ధి ♦ వాచకముగ
నమ్ముఁడనుచు సజ్జ ♦ నమ్మ దెల్పఁగ తిఁగు
క్కుటములొక్క చక్కిఁ ♦ గూయఁదొడఁగె ౬

గీ॥ వీర్యవృద్ధికరంబుగా ♦ విశదపాద
రసఘుటిక ప్రక్కటనుబెట్టి ♦ రాజసమ్మ
దోత్తరాది సతీకేళి ♦ నొనరిమరల
నుమియుగతి వేగునక్షత్ర ♦ ముదయమయ్యె ౭

చ॥ బలువియ దాలయంబునన ♦ పారసరంపరలైన పూసరం
బులగతి వెల్గుతారలను ♦ బొల్పుగ వేకువ యాదికెంపుతో
య్యాలిలలిమించు శోధినిబ ♦ యల్పడనూడిచి యొక్కరాశిగా
నలరిచెనోయనంగ జల ♦ జారిగనంబడె సారెసారెకున్ ౮

మ॥ క్షమనీయారుణ వాసరంబను వనా ♦ కంబానభోవృక్షమిం
పమరన్ప్రాకిని శాఖ్యశాఖలనుమ ♦ న్నట్టిట్టు గానూచబు
త్తుములఁ బువ్వులు పల్చనై కనఁబడెన్ ♦ చంద్రాండనే పండు ప
శ్చిమపుంసంద్రములోన వ్రాలెననఁదో ♦ చెన్ సంధివేళన్దగన్ ౯

వ॥ మఱియును ౧౦

గీ॥ యామినీ కామినీపీత ♦ హస్తసార
సీరుహచ్యుత పతెయాళు ♦ శేషమధుభ
రస్ఫురద్రాప్య పానపా ♦ త్రింబనండఁ
జరమ భూధరమునశీత ♦ కిరణుఁడలరె ౧౧

గీ॥ ద్విజపతియునై ప్రవృద్ధసం ♦ దీప్తవారు
ణీసమాగమమునసుండి ♦ నిశ్చయముగఁ

బలితుండగునని నవ్వెన • పగిదిదూర్పు
దెసను తెలిడాలు • గనుపట్టెఁ • దెలివిదనర

శా॥ అంధీభూత నిరంధ్రమంధతమసా • హుంకార శూరంబసం
బంధేందీవర గంధమంబురుహాసం • బంధానుసంధానతా
బంధూభూత మహార్యమాఖిలాగ్నిముఖసం • ప్రాప్త ప్రభంబుజ్జ్వల
ద్బంధూకస్తబకాభిరామము జగ • ద్బంధూదయంబొప్పినన్ ౧౩

వ॥ మఱియుఁ బ్రాచీకుమారీలలామ లలాటతటఘటిత కుంకుమ తిలకంబనఁ బ్రా
గ్దిశా విలాసినీ కనకకుకురంబనఁ దప్తలోహ కుంభంబన మంజిష్ఠారుణ పట్ట
సూత్ర పిండంబన ప్రాగ్ధర ధాతుధారా ఘణదిగ్గజ పాదతలంబనఁ దిమిరచో
రుండైన దివాకరుండన సంప్రాప్తతారకుండైన కుమారుండనఁదగి ఉల్లసిత ప
ద్మిండై పద్మనాభుండనఁదగి గోపతియై శంభుండనఁదగియుండె నరుణ కేసరి
ఖరనఖరహతాంధకార కరీంద్ర రక్తధారలై యుదయగిరి గైరికధాతు భూతి
లపరాగంబులై హేమారవపరి కుపితకానన సెరి భభయచకితపూష శతాంగ
తురంగ ఖురపుటీపాటిత పద్మరాగోత్కటత్కాంతులై ప్రాగ్గిరికూట కోటిప్రి
రూఢజపాకుసుమద్యుతులై యరుణ కిరణంబులు వెలయ జలధరచ్ఛదాంతరేం
ద్ర ధనుఃకాంతి లేపంబన శాక్యాశ్రమశాఖిశాఖాంతాండ వితకాషాయపటంబ
న వ్యోమసౌధాంగణ లిప్తకుంకుమ రసంబనఁ గామమహానటన నటనయో
గ్యారుణ యవనికాపటల మనఁబ్రవాళ భంగారుణంబైన బాలాతపంబు ప్రస
రించెఁ గ్రమక్రమంబుఁ జక్రవాక హృదయసంతాప హరణంబువలనఁ దహ
నప్రవేశ ప్రభాగ్రహణంబువలన సూర్యకాంతోపల సంగమంబువలన సుష్ణత్వం
బు వహించిమించిన ౧౪

చ॥ పలుచని నా తెజిల్ మెఱుఁగు • పట్టుల గన్పడు చుండ బేరురం
బులవలిచన్నులన్నెలల • పొందలి నందపుజూఁపగందపుం
దళుకులు మేనదంతురిత • ధామముఁబూన నిజాంగణంబులన్
వెలచెలులట్టిమెండలను • వేడ్కఁ జరింపుచు నుండిరింపుగన్ ౧౫

వ॥ అట్టియెడఁ గీర్తిమాలిని విరహసాగర నిమజ్జనోన్మజ్జన సజ్జీభవదంతరంగయై నిజమనోహరుం డా దృగ్గోచరుండుగాఁ దలంచి మనోవృత్తిఁ జక్కఁజేసిన నది సంకల్పమాత్రంబై తోఁచ జాగరావస్థాధీనంబై కృశత్వంబు సంపాదించి యర తిప్రకారంబు లజ్జాభావంబు మూర్ఛోన్మాదంబులు జిత్తంబునం బేరంబులు వారవిమోగావస్థ నొందిన ౧౬

క॥ ఆసమయంబునఁ గుసుమశ। రాసనుఁడా సుదతిహృదయ ♦ మట్టిట్టుగను దాఁ ఖసిశరములను సారెకు। గాసింబడఁజేయ సకియ ♦ కళవళపడుచున్ ౧౭

క॥ చెలులార; మరునిబారిం। గలఁగితి నేనెట్టులింకఁ ♦ గడ తేరుదు నా వలవంతఁదీర్చ రేయని। యలరుల పానుపునఁ బొదలి ♦ యలనుటనొందన్ ౧౮

క॥ వనితవిరహార్తిఁ బలికిన। వినిరుత్తరుణీలలామ ♦ విధమంతయుఁద జ్జనకునికిఁ దెలియఁజెప్పినఁ। దనయపయింగూర్మిచేత ♦ ధరణిపుఁడంతన్ ౧౯

గీ॥ నిఖిల సుగుణరత్న ♦ నీరధియైనభ
ద్రాయువల్లుఁడైన ♦ నంతకంటెఁ
బుణ్యమేమియనుచుఁ ♦ బురము చాటింపఁగఁ
బనిపినిజపురోహి ♦ తునికిఁ దెలుప ౨౦

మ॥ వినయంబేర్పడ మంచిలగ్నముమనో ♦ వృత్తిన్విచారించి యా
జనపాలాగ్రణి; శోభనావసరమా ♦ సన్నంబుగన్వచ్చెరా
ట్తనయుండోడఁడని రాగ మంత్రివరువే ♦ డ్కంబంపు మీవన్నసం
జనితానంద మమందమై తనరఁగాఁ ♦ జంద్రాంగదుండర్మిలిన్ ౨౧

క॥ తనమంత్రివరులలోనొక। ఘనగుణమణిరాజకార్య ♦ ఘటనాచతురా
త్ముని వాయువేగ జవవా। హనరథమున ననిచిపనుప ♦ నాతఁడు గడిమిన్ ౨౨

సీ॥ భూరిలిర మోదమున నైశ్య ♦ పురములోప
సించు భద్రాయుఁగని ప్రేమ ♦ దలిచిరత్న

నికరముతో నుచ్చముగఁ జేసి ♦ నిఖిలరాజ
మంత్ర తంత్రాంగములఁ దెల్పి ♦ మదిఁ గరంచి ౨౩

క॥ స్వామీ; చంద్రాంగదుఁడను। భూమీశుఁడు తనదుకూర్మి ♦ పుత్రికనుబహో
ద్దాముఁడవగు నీకియ్యఁగ। సేమంబొనరించెనిపుడు ♦ నియతాత్ముండై ౨౪

ఉ॥ కావున నీవువచ్చుటయె ♦ కర్జమటంచు వచించియున్మహా
భావుఁడు వైశ్యవర్యుఁడు స ♦ బాంధవుఁడై చనుదెంచి దీప్తర
త్నావళిమైన వాహనము ♦ నందు ముదంబునఁ దల్లినుంచిపుం
భావపరాక్రమక్రమము ♦ బర్వ సహానుఁడై రయంబునన్ ౨౫

క॥ వచ్చిన నెదురేగఁ జనియును। గ్రుచ్చి పరీరంభ ముంచి ♦ కూరిమితోడన్
విచ్చల విడివిడిదలలో। నచ్చుపడన్ విడియఁజేసి ♦ యతిమోదమునన్ ౨౬

వ॥ పురాధికార పురుషుల రావించి వివాహకార్య ప్రయత్నోత్సవం బవలంబించుండని నియోగించిన శుంభద్రంభా స్తంభంబులు నిలిపి గరికపచ్చల తోరణంబులు గట్టువారును బ్రశస్త కస్తూరి కలనసలికి యొప్పిన కప్పూరంబున ముగ్గులు పెట్టువారును. మృగమద సంకుమద పరిమృదిత హిమాంబు సంచయంబుల నెల్లకడలం జల్లువారును వివిక్త ముక్తాఫలరంగ వల్లీసంగత శృంగాటకంబుల హాటకమయ వర్ణనీయ పూర్ణకలశంబు లుంచువారును నిటుల బహువిధ శోభనకార్యంబు లొనరించి యాభద్రాయువును శిల్పకళామర్మ పారగ నిర్మిత భర్మమయలక్ష్మీవిలాస మందిరంబుల వసింపఁజేసిన ౨౭

గీ॥ అటుల వసియింపఁ గూతురు ♦ ననుగుచెలుల
కలరఁ జేయుండనుచుఁ దెల్పి ♦ నంతకంత
కభినవవ్యక్త లావణ్య ♦ మమరఁగాఁ బ్ర
సాధికలు తత్సమయకృత ♦ సాధనముల

సీ॥ తతపయోధరనిరోధంబుగా నంబరం
బలరించఁ దగనొక్క ♦ తలిరుఁబోఁడి
ఘనసువర్ణపరిధిఁ ♦ గన్పట్టునంజనం
బమరించఁ దగనొక్క ♦ కమలవదన
హృదయరంజకముగా ♦ మొదపి కుంకుమగంధ
మలరించఁ దగనొక్క ♦ జలజనయన
నేత్రాంతకాంతితో ♦ సూత్రపట్టినరీతి
కస్తూరి బొట్టొక్క ♦ కలికిదిద్దె

గీ॥ విమల గోరోచనాచిత్ర ♦ కములురోజ
గల్లసీమల యుందొక్క ♦ కాంతనిలిపెఁ
జరణతలముల లాక్షార ♦ సపరికార
ముంచి చెలరేగ నందొక్క ♦ చంచలాక్షి ౨౯

ఆ॥ మెఱుఁగులీనుచున్న ♦ మేలిమి సంపంగి
విరుల మెఱుగుత్తురుము ♦ తరుచుమెఱసె
మెఱుపు విడుముకొన్న ♦ మేఘమో యనఁగను
వెలసెఁ జూమవారు ♦ వెరఁగుపడఁగ ౩౦

క॥ ఫుల్లుగడిగినట్టి ఘుత్తియ। ములచే రొకసకియదిద్దె ♦ ము...గు...కు ము
వెలసె నలత్తురుము తారో। జ్వలదంతుర మైతనర్చె ♦ జలధరమనఁగ ౩౧

ఆ॥ చెలియయొకతె సకియ ♦ చెలువై ననాసను
గొప్పముత్తియంపు ♦ నొప్పనుపప
నాస్యమునఁ దలిర్చె ♦ నధరామృతప్రతి
బింబమైనరాజ ♦ బింబమనఁగ ౩౨

గీ॥ సుదతి యొక్కతె కరములఁ ♦ బదతలములఁ

గంకణంబులు ఘనహంస ♦ కములు నిలుప
మెఱసెఁ దద్దేహలావణ్య ♦ సరసిలోన
నవి వినోదింపు టాశ్చర్య ♦ మవునె తలఁప ౩౩

చ॥ చెలియ యొకర్తు బోటికటి ♦ సీమపయిన్ రతనంపుసొంపు బి
ల్లల మొలనూలు నిల్పిన సు ♦ లక్షణమై కనుపట్టె నెట్లనన్
గలికి విలోచనంబులు మృ ♦ గంబులనన్ విలసిల్లుచుండఁగా
నాలయును దారమూరమృగ ♦ యుండొనరించిన జాలమో యనన్ ౩౪

సీ॥ తీగబోడి యొకర్తు ♦ త్రెంపుసరులు
గలికి కుచసీమ వెలయింప ♦ వెలసెనవియు
వెలఁది వేసవి మేఘంబు ♦ వలనఁ దొరఁగి
గిరుల జాల్గొను ముక్త ప్ర ♦ కరమనంగా ౩౫

గీ॥ పొంకమై తగుపజ తా ♦ టంకయుగళ
మొకసరోరుహ లోచన ♦ యుంచనలరె
మంగళాంగతి డంగనా ♦ పాంగశరము
సానబట్టెడు కంతుని ♦ శాణములన ౩౬

క॥ చెలియొక తెరుచిరమౌక్తిక। ములచే లు నుదుటఁ జేర్పఁ♦ ముదమలరించెన
య్యలికార్ధ విధుఁడు తారా। వలయవిలాసంబుదోఁచ♦వఱలెననంగన్ ౩౭

క॥ తెరుణియొక తె సవరపరిచె। నురమణిగణ ఖచితఘంటి♦కౌఘ్యాణముపై
మెరసెనభోంతర్గతమై। నుడుగుల నెడ తెగకనిలచు ♦ మెరపోయనఁగాన్ ౩౮

గీ॥ పడఁతి యొక్క తె తళుకుల ♦ పద్మరాగ
మణుల పదకంబు సవరింప ♦ మహిమ నలరె
సరసతఁ దలిర్చు కుచసీమ ♦ గిరులనడుమ
డంబుమీరిన బాలార్క ♦ బింబమనఁగా ౩౯

సీ॥ లలితాకంబున వహాన ♦ గళమందు నేకమై
భాసిల్లు ముత్యాల ♦ పట్టెఁగట్టి
సుందరదోఃకాంతి ♦ కందళ్ప్రపసములా
సందిటి తాయెతుల్ ♦ బొందుపరచి
పొగరెక్కి బిగియైన ♦ జిగిగబ్బిగుబ్బల
సవరించి జాలీల ♦ రవికఁదొడఁగి
కస్తగోరోచనా ♦ కస్తూరికాసంకు
మదకుంకు మాగరు ♦ మలయజాది

గీ॥ వస్తువుల విస్తరించిరి ♦ వలయునెడల
మణీయుక దేహాభి ♦ రామసీమ
నలరఁజేయుచు దృష్టిదో ♦ షాభిహతిగ
మంచి సామ్రాణి ధూపము ♦ ర్పించి చెలియ ౮౦

గీ॥ తరుణియొక్కతె నిలువుట ♦ ద్దంబుదెచ్చి
యెదుట నిల్పిన నారాచ ♦ సుదతిఁజూచె
నంగళ్ళంగార రసభేద ♦ మమరనపర
లక్ష్మియనిమన నాత్మీయ ♦ లలనలరా ౮౧

వ॥ ఇవ్విధంబున నలంకరించుట విని పెండ్లికొడుకు నలంకరించుఁడని నియోగించిన నర్మసఖులుగడంగి ౮౨

సీ॥ సంపంగ నూనచే ♦ సవరించి యొక్కతె
శిరసంటెనమ్మహీ ♦ వరసుతునకు
మలయజపరిమళ ♦ మర్దితంబైనట్టి
నలుగిడె నొకతెమ ♦ విలసితునకు
నామోద యుక్తమౌ ♦ నటకలి నొనరించె
నొకముద్దుగుమ్మయా ♦ యుర్వీపతికి

సన్నుత జలకమే ♦ ర్పరచె నొక్క లతాంగి
సాహస బిరుదాంక ♦ సంయుతునకు

గీ॥ మిసిమిబంగరు కోకచే ♦ మేనునంటి
నట్టి తడియొత్తె నొకలేమ ♦ యధికమతిని
దివ్యవసనంబు గట్టించెఁ ♦ దెరవయొకతె
సకల జనసమ్మోద ప్రద ♦ జనవరునకు

సీ॥ రంగుబంగరుశాలు ♦ రింగులువారంగఁ
గప్పి మేనునసిరి ♦ గందములఁది
కురులలోఁ బువ్వులు ♦ దురిమి క్రొమ్ముడివేసి
హైమ మణి మకుటంబుఁ ♦ బదిలపరచి
కళలీను మకరకుం ♦ డలములు శ్రవణసం
గతములుగాఁ జేసి ♦ కరములందుఁ
గంకణంబులునిల్పి ♦ ఘనదోర్యుగమునందుఁ
గేయూర వరములు ♦ గీలుకొల్పి

గీ॥ వక్షమునఁ బతక మొనర్చి ♦ వజ్రరశ్మిఁ
గట్టిపట్టీ సవరించి డా ♦ కాలబిరుద
సారమై తగుగండపెం ♦ డారముంచి
పడఁతులీరీతి వరుఁ బెండ్లి ♦ కొడుకుఁ జేసి ౪౪

చ॥ కళలు వెలుంగు నెన్నుదుటఁ ♦ గస్తురినామము దిద్ది సొంపుగాఁ
గలయఁగఁ గంఠసీమసిరి ♦ గందముబూసి సరుల్ ఘటింపుచుం
బాలుపుగఁ బుష్పరంపుమడ ♦ పుల్ దగనోటికొసంగుచుం సఖుల్
నిలువగు దర్పణంబెదుట ♦ నిల్పినఁ జూచెద దోచితస్థితిన్ ౪౫

వ॥ ఇవ్విధంబునఁ జూచి భద్రాయున భంగమంగళ స్నానానంతరంబున ససాధన ప్రసాధికాలంకృతులంగైకొని నిర్జితసంక్రందన నందనుండు నిర్భర్త్సిత రాజ

రాజతనూజుండు నిందిత వసంతుండునై నిరుపమాన మానాతీత నూతన శృంగారరస విశేషుండు తన్మహోత్సవాగతానంద కందళిత దరహాస సుందర వదనారవిందుండునై యుండుటవిని ౭౮

చ॥ అలరు మనంబుతోడ వసు • ధాధిపుఁ డొప్పులఁ బుత్రమిత్రమం
త్రులఁ దగుబంధులంగనిపు • రోహిత నిశ్చిత చంద్రతారకా
బలయుత లగ్ననిర్ణయము • బర్విన వేడుకతోప నాయెడన్
గలిత వివాహవేళయని • కైకొనుఁడందఱు సంభ్రమంబునన్ ౭౯

వ• అని పెండ్లికొమరుని కభ్యుదయిక స్థితి నొనరించి గోదాన భూదాన హిరణ్యాది దానంబులు నిర్వహించి బహుమణిగణాగణిత భూషావిశేష భూషితులును బంధురసుగంధ మాల్యాలంకృతులును, బరిమళ మిళిత గంధలేపన శరీరులును బాంధవుల వరునివారలై వచ్చుట కిచ్చగించి భేరీపటహాఢక్కాడిండి మమర్దల తాళకాహళ ముఖవాద్యానవద్యధ్వనులును వారనారీవిలాస కుండలిదండ లాసక ప్రేరణాది నృత్తావధాన విధాన చమత్క్రియా చంచలమణి శ్లాఘ్య మేఖలా మంజుసింజాన మంజీర విలసిత వలయకింకిణీ విలాప సంభూతారావ సంఘాతంబులు తర్కద్వయ సాంఖ్యయోగమీమాంసాయుగ భాట్టప్రాభాకర నాటకాలంకారాక్షీణలక్షణ గంధసందర్భ దుర్భర వ్యాఖ్యాన ప్రఖ్యాతి ధౌరంధర్య ధుర్యావనీసుర క్షేమంక రాశీర్వాద భేదంబులు వందిమాగధ జయజయ శబ్దంబులు మాధురీధురీణతాన మానషడ్జ మధ్యమ గాంధారబంధుర గ్రామకరానూన గానన సంధాన గాయక వీణావేణు ముఖనిస్వనంబు లేకీభవింప నిజాజ్ఞావశవర్తి సమాగతాంగ వంగకళింగ కాంభోజాది దేశాధీశ్వర సల్లాపంబులు చెలంగనిజమనోరథంబులగు రథంబులును, సంతత గాంభీర్య నిర్జిత సింధువులగు సింధురంబులును, జవనదూరీకృత గంధర్వంబులగు గంధర్వంబులును, నిరంతర బాహుబలోద్భటులగు భటులును దనర భద్రాయు భద్రగజంబు నెక్కించి మండలాధిపతులను సామంతుల నతనివెంబడి రానియమించి సాంద్రచంద్ర చంద్రికా ప్రభాసుర వివిక్త మౌక్తికాతపత్రంబులు ధ్వజాలవట్టి కావ్య జనాదులు సంఘటింపఁ బరఖుగడా ప్రాసతో మరభిండివాల మండలా

గ్రాది సాధనంబులుగాని కొల్చలంబునే తేరఁ గనత్కనకమణిమయ వేత్రహస్తులు పలుదెసల బరాబరులు సేయ బంగరు పళ్ళెరంబుల సాకృత మృగమద సంకుమద ఘనసార గంధసార కుంకుమ చంపకతైల హిమోదకాది గంధిల ద్రవ్యంబుల గొనుచు బుణ్యస్త్రీలు నిజకర సరసిజ పరిస్ఫురన్మంగళారాత్రికలు వెలుంగ రత్నసందోహ పాత్రంబులు నవీన దుకూలంబులు మనోహరంబులు ఫలంబులు కుసుమంబులు గొనుచు కనకమణిమయ రాజద్రాజమార్గంబునఁ జనుదెంచు సమయంబున ౪౯

గీ॥ అమ్మహాత్మునిఁ గనువేడ్క • నతివ యొకర్తు
హొంగవల్లులు మొలనూళ్ళఁ • గారెచించి
కంకణంబుల నలకాళ్ళ • కడియములుగఁ
జేసి చనుదెంచె విభ్రమ • స్థితిఁ దలిర్ప

క॥ స్నానంబు చేయుచో నొక। మానిని రవణముల దాల్చ • మరచి జగద్ర
క్షానిపుణత్వము గలిగిన। యాదవపతి సుతునిఁ జూడ • నల్లన వచ్చెన్ ౫౦

ఉ॥ చేడియ యొకర్తు గల్లకుచ • సీమల ప్పై మకరీ కలాపముల్
వేడుకతో వహించకర • వేసలి దూలఁగ వేగ మొప్పఁ దూ
గాడెడు హేమధామ వస • నాంచల మిట్టటుఁ జేసి కొంచు త
న్గూడిన ప్రేమ నవ్వగను • గోరిక దీరఁగ వచ్చెఁ జెచ్చెరన్ ౫౧

మ॥ పొలఁతి యొకర్తు నెచ్చెలుత • పుష్పాడిచీర ధరించి మేడలో
పలఁగల యంగఁ జూచితన • ప్రాణసఖుండు రతిప్రసంగముల్
దలపఁగ వల్దువల్దనుచుఁ • దద్వ్యసనిం గనవచ్చెఁ జెచ్చెరన్
బిలువని పేరటంబనుచుఁ • బెక్కు తెఱంగుల ప్రేణిసేయఁగన్ ౫౨

ఉ॥ రామ యొకర్తు వచ్చి యల • రాజకుమారునిఁ గాంచి కాంచికా
దామము పుష్పదామముగ • ధాత్రమ యోగమునొందనందమా

మోమునసాదు బొట్టమర ♦ ముంగురులల్లన నాడఁజూచు, భా
మామణులెల్ల నవ్వగను ♦ మారవికారము జెందిరున్నగన్ ౫౩

శా॥ ద్వారాసక్తదృగబ్జముల్ దనరనిం ♦ ద్రప్రస్థ రాంగారశృం
గారోదార విహారముల్ మరచిభూ ♦ కాంతాత్మజుండల్లదే
తా రేరా రె యటంచుఁబిల్చి కొనుచున్ ♦ రామామణుల్ వచ్చిరో
య్యారంబేర్పడఁ జూడవీఁడు గలవా ♦ రాబాల గోపాలమున్ ౫౪

వ॥ ఇటుల సకలజనంబులు ఘనంబులగు నుపహారంబులుగొని యవ్వరునికి సమర్పించి వెంటరానయ్యెడ ౫౫

గీ॥ మలయుచు పకెంర నక్షత్ర ♦ మాలదనర
కుజను లడరంగగఁ విబుధ ♦ గురువులలరఁ
గలసిచూచు చకోరాక్షు • లెలమిఁజెంద
సత్పథంబున నారాజు ♦ సంభ్రమించె ౫౬

వ॥ మఱియు నీరాజన భాజన కరసరసిజాగణ్య పుణ్యాంగన లుప్పొంగుచు మంగళపాఠంబులు పాడ దేదీప్యమాన కరదీపికా నేకంబులు వెలుంగ సాంద్రచంద్రజ్యోతిస్సంచయంబులు ప్రకాశింప శుభమువైవాహిక బలంబు లెదుర్కొను నెడ ముందుముందుగ నందంబుగ నందఱు గ్రందుకొని గంధవహులు పిడికిళ్లకొలఁదిగుప్పునం బరవఁదత్సుగంధ బంధుర పరాగంబు నల్దెసలఁ బ్రసరింపుచుండ నిర్నిద్రభద్ర చతుర్దంతకాంత దంతావళంబులనుండి యామహీపతి కుమారుండు మగసాలందిగి యున్నండ మండలాధిపతులు కైదండ లొసంగ సాకల్యకల్యాణావహావివాహవేదికకే తెంచి ప్రచుర రచిత రూత్నరత్న పాటకు పీఠంబునం దధివసించి యుండునంత మహోత్సవంబున జంద్రాంగదునను మఱివడసి యత్తఱి ౫౭

భద్రాయువు కీర్తిమాలిని వివాహమాడుట

గీ॥ పాలఁతుకలుపొంగి సింగార ♦ మొలుకఁదళుకు
బెళుకుచూపుల నద్దెసల్ ♦ వెలుఁగ గలికిఁ
దళుకుగుబ్బలు మోహంబు ♦ దెలుప మెఱుపు
మొలకనఁగఁ గీర్తిమాలిని ♦ నిలుపనపుడు ౫౯

క॥ తెరఁబట్టిరి తెలివకుఁ దెర । తెరవమైలజ్జోదయంబు ♦ దీసివరాన
త్తెరఁ గెఱఁగలేక జనమే । తెరపైపైఁ గదియుభాగ ♦ ధేయక్ష్మాధార్యుల్ గాఁ

చ॥ వెలయఁగ సావధానయని ♦ వేదవిదుల్ బలుకంగ రాజున
త్పలకిరవిశ్రుతశ్రుతిని ♦ ధ్యానగతిన్ మధుపర్కమాదిగా
గలుగు విశేషకార్యములఁ ♦ గౌశలమేర్పడఁ జేసి కామినుల్
బలుమరు మంగళార్థగతిఁ ♦ బాటలుపాడుచు సంభ్రమింపఁగన్ ౬౦

క॥ జలజాక్షి గళమునను మం । గళసూత్రముఁ గట్టెవరుఁడు ♦ కౌతుక మొదవన్
జలజాస్త్రు గెలిచి తత్పురిఁ । గలువల తోరణము గట్టు ♦ కైవడి దోపన్ ౬౧

క॥ నలువొందనప్పుడంజలిఁ । దెలిముత్తియముల ఘటించి ♦ తెరవ తురుమునన్
నిలుపన వియజ్జీమూతము । వలనన్ జలజలనఁ దొరఁగు ♦ వైపెసఁగించెన్ ౬౨

ఆ॥ వనితయప్పుడంజ ♦ లిని వెల్లిముత్యముల్
వరుని శిరము మీఁద ♦ విరివిఁ జేయఁ
బరగెఁ నింద్రుశిరము ♦ పై శచీదేవిక
ల్పకసుమంబులుంచు ♦ పాటిదనరె

వ॥ ఇత్తెరంగున ౬౩

సీ॥ ముత్యాల బాసికం ♦ బులు ఫాలతలములఁ
బొలుపొందు కాంతులఁ ♦ బొదలుచుండ
సప్తర్షి దివ్యతే ♦ జస్స్ఫూర్తి గలవాఁడ
కనిపల్కుబడి ముందు ♦ ననువుఁదోప

సప్తపదంబుల ♦ సనకల్లునం జేర్చి ♦
ప్రకృతి పురుషులెడఁ ♦ బాయరనెడు
నుడువుఁ దోఁపగఁబన్ని ♦ ముడిని వెలుంగుచుఁ
జెంగటనుపొంగి ♦ తొంగలించు

ఆ॥ వేడఁదగినకులము ♦ వేల్పులగురువగు ♦
తపసితేనిరాణి ♦ దర్శనంబు
చేసి పెండ్లిజగతిఁ ♦ డాసివీథంబుపై
పొలచి రవ్వధూవ ♦ రులుకడంగి॥ ౬౮

సీ॥ నిజమైనపెనువీఁడు ♦ నెలవైనదేవర
ఘూటలోఁదిరిగిన ♦ మధురవాణి
తేజరిల్లుచునుండు ♦ జేజేలరాయెదిఁ
బాయక నిలచిన ♦ పంకజాక్షి
బత్తులంబ్రోవఁగ ♦ సత్తెంబుగలదొర
కరగాంచిలంగిన ♦ పరమసాధ్వి
తరుచుగాసుఖయించు ♦ తెరగన్నులలరిన
పెనిమిటితోఁగూడు ♦ పువ్వుఁబోఁడి॥

గీ॥ గావలయునీవెలఁది యని ♦ కాంచుజనము
పొగడుచుండంగ నారాచ♦బాలతిఁమిన్న
మగనితోఁగూడి ♦ దేదీప్య♦మానయగుచు
మూర్తివిస్ఫూర్తిగను ♦ పట్టెమోదమలరా॥ ౬౯

క॥ సరసవృత్తులనవ్వధూ ♦ వరులువేద
ఫణితమార్గస్థితులనేరు ♦ పరచితెలుప

---

* కీర్తిమాలిని జూపట్టెమూర్తిదసర- తా-ప్ర

నిత్యకర్తవ్య సంగతుల్ ♦ నెరపిరపుడు
బ్రాహ్మణాశీర్వచనములు ♦ బలసియుండ॥

చ॥ మునుకొని నేలవేలుపుల ♦ మూకలువీకను దానమాడి భో
జనము సకిచ్చగించఁగర ♦ సాతలనాథుఁడ భీప్సితంబుగా
నను వుపడంగమద్రసన ♦ మంచితమైన పదార్థమెల్లమున్
బనివడ వడ్డనల్ సలిపి ♦ బంతులవెంబడి సంచరింపుచున్॥

సీ॥ అన్నముష్ణంనస ♦ మంచితంశాకహా
కత్వంనభవతీహ ♦ ఘనశలాటు
సంఘటితోపదం ♦ శవిశేష బహుళతా
నాస్తిరసాథ్యప్ర ♦ శస్తపక్వ
ఫలసౌష్ఠవంనాస్తి ♦ బహుకృతభక్ష్యాది
క సమీాత్యనితాంత ♦ కరుణయాప్ర
కటశీతలోదక ♦ పటుతాంనపరమాన్న
మస్తినాస్త్రక్షప ♦ న్యస్తవస్తు

గీ॥ సంచయోనాస్తిలవణంచిం ♦ చాఫలరస
కలిత మోదనమోవభో ♦ క్తవ్యమత్ర
మదపరాధవిచార్యత్ర ♦ మస్వమనుచు
విభుఁడుభోక్తలనందఱి ♦ నభినుతించె

వ॥ క్రమ్మరనమ్మహీమండలాఖండనుండ దభ్రసితాభ్ర ప్రశస్తకస్తూరికాకుం
కుమ సంకుమద మృగమద హిమాంబు పరిమళ పరిమిళిత సుగంధబంధు రచ
ర్చల వలనను గంబూరంబు వేడబంబుగల తాంబూలంబుల వలననుంబవా
సిధవాసనానాసప్రఫుల్లసత్ఫుల్ల హల్లకమల్లికాదికుసుమ విసరంబుల వలనను
సౌరవార నారీవిహార వారపౌర వారసార సాక్షీకృత తౌర్యత్రికచమత్కృ
యలవలనవిభావాను భావాద్యుల్లసద్రసవిశేష శ్లేషిముఖ సుఖముఖోచ్చార
ణోల్లాస కరపరిహాస కసల్లాప ప్రసంగంబుల వలసను ఇది మొదలగుదైనంది

న బహుమాన కార్యంబుల వలన నంతకంతకు సంతోషంబుల నందం దయం ద
రి కానందంబు నొందించి సొంపుఁ బుట్టించు నిలింప పతి వైభవంబున సంభూ
తోత్సవ ప్రభూత భూతలాధీశ జాలంబులకు జాతరూపస్వరూప చేలంబులొ
సంగి ధరామర వరుల కపరిమిత రత్న సువర్ణ దుర్వర్ణ నిర్ణిద్రముద్రికలొసంగి
సుజన నేతయగు జామాతకుఁ బదివేల మొదవుల కదుపుల నంతకిమ్మడి తురం
గంబుల నంతకు జమిలి బలుగొమ్మల మొకమ్ముల నంతకు రెట్టి రథంబుల నం
తకినుమ్మడి యూడిగపు చేడియల నంత కెక్కువ విడిముడి నంతకన్న మిగుల
రతనంబులనివి మొదలగు హారణంబుల నాగమోక్త ప్రకారంబుల సవినయం
బుగా నిచ్చి మణిపుత్రి యనందగు తనపుత్రిం జూచి.

సీ॥ అత్తమామల యాన • నాగాదనక వారి
మనసురా మెలఁగుమీ • మంజువాణి
పతిమాట జవదాట • కతనికింపగు వేళ
నెదురాడఁ బోకుమీ • యిందువదన
తోడికోడండ్రతోఁ • గూడి వారలకెల్ల
హితమాచరింపుమీ • యిగురుఁబోడి
చుట్టాల యెడ యేనిఁ • గొట్టుమిట్టాడక
కరుణ రానమువుమీ • కంబుకం

గీ॥ సేవలొనరించు దాసదా • సీజనముల
దయఁ దలంపుచుఁ బ్రోవుమీ • తరళనయన
యెన్నికత్తెంటికిని బుట్టి • నింటికెప్పుడు
వాసి రాగఁ జరింపుమీ • భానుకాంగి ౭౦

ఆ॥ ఎల్లజనుల యెడలఁ • దల్లితల్లి యనంగ
మెలఁగ వలయు బుధులు • మేలనంగ
బావమరుదులందు • నావంతయైనను
గడుసుతనము వలదు • కమల నయనా ౭౧

క॥ మునుదాదులు ప్రమదాదులు। నినదాదులు నెరవఁబుట్టి • నెనరట్టిపడన్
ఘనజాలకవినుతాలక। చనజాల కయున్నగన్న ♦ జనకుండంతన్ ౭౨

చ॥ కరములుచాచి యెత్తుకొని ♦ కౌఁగిట నొప్పఁగ నప్పళించుచున్
శిరముప యింగనుంగవను ♦ జెందిన యశ్రువులుంచె నెట్లనన్
సిరిజనియించువేళఁల ♦ క్షీరసరిత్పతి తచ్ఛిరంబునఁ
దరగలుచాచి శీ ంరకదం♦ బములందగఁ జల్లెనోయనన్ ౭౩

వ॥ ఇవ్విధంబున గారవించి ౭౪

క॥ అమ్మా, అత్తింటికిఁబో। వమ్మా తడవేలచేసె ♦ దమ్మా; సీతో ♦ డమ్మా;
యి తటవచ్చెద। మమ్మాయీ జాలిమాన ♦ వమ్మా గొమ్మా ౭౫

ఆ॥ అనుచుజాలిమాన్చి • యంపకె మొనరింప
మగుడి మగుడిచూచె ♦ జిగురుఁబోఁడి
చెలఁగిపెనిమిటెంత ♦ సిరిగలవాఁడైన
నతివపుట్టినింటి • కాసపడును. ౭౬

క॥ అంతట నవోఢతోసా ♦ మంతహితప్ప రోహితాను ♦ మతితత్పరతు
ధ్ధాంగ ప్రదేశముధ • కాంతుండానరించె జనముకౌతుకమందన్ ౭౭

వ॥ అంత శుద్ధాంత ప్రవేశా నంతరంబునఁ జొక్కమగు నొక్కసమయంబున

ఉ॥ చంపకగంధి యోర్తురథ ♦ సంబునరాజకుమారుఁజేరినా
కెంపుపసిండి గిండియును • నిండిన సంపెగనూనె బూసెని
ద్దంపుకురుల్ నటింపఁగను ॥ దమ్మలు పెంపెసలారఁచన్గవన్
సొంపులుజూపఁగంకణరు ♦ చుల్గను పట్టవలగ్న మూఁగగన్ ౭౮

క॥ శిరసంటి వదనకమలము • చిరుచెమ్మట గ్రుమ్మరింప శీతోదకసం
భరితమగు నటకలిడిచె చ్చెరమజ్జనశాల కడకుఁ, జేర్చిప్రియమునన్ ౭౯

సీ॥ మంజువాణి యొకర్తు • మజ్జనంబొనరింప
శ్వేతవస్త్రములొకర్తె • చెలియఁగట్టె
మదవతి యొకర్తె • మణిభూషలనొసంగె
శిరమునను నొకర్తె • విరులుదురిమె
కంజాక్షి యొకర్తె • కనకపీఠము పెట్టెఁ
గలికియొకర్తె మేన • గంధమలఁదె
అగరుధూపమునొకర్తె • యతివ సమర్పించె
లలనయొకర్తె పాదు • కలనమర్చె

గీ॥ నాతియొకర్తె నీరాజ•నంబుజూపెఁ
బడఁతియొకర్తె సురటిచేఁ •బట్టి విసరె
బాలయొకర్తె రత్నద • ర్పణముఁజూపె
రామయొకర్తె ఘనచామ • రంబు బూనె॥ ౫౧

క॥ వనజాస్యయొకతె మోలన్ । గనకపు పళ్లెరము పెట్టె • గలికియొకతె వా
సన దొలుకు జలములలరిన । కనకాలుకనుంచె వేడ్క • కల్జనియింపన్॥ ౫౨

మ॥ సమరస్యంబయికించి దుష్టమగునా • శాల్యన్నమున్ దుగ్ధమా
జ్యముపచ్చళ్ళునపూపముల్ వడియముల్ • శాకంబులున్ సూపము
త్తమలేహ్యంబు రసాయనంబులు ప్రమో•దంబొప్ప వడ్డించిరా
రమణుల్ కంకణకింకిణీకటకజా • రావంబు తోరంబుగాన్॥ ౫౩

గీ॥ ఇటుల వడ్డింపనవియెల్ల • నింపులేక
పెరుగు పరమాన్నములరుచు • లెఱుఁగలేక
కూరగాయలు చవియని • కోరరాక
వలసివల్లమిసాపాటు • సలిపెనపుడు॥ ౫౪

క॥ అంగనయొకర్తె ముంగల । బంగరు పావలుల గించ బదములఁదొడియా
భృంగారు జలముచేను । ప్పొంగుచుఁజేవార్చి రాజపుంగవుఁడంతన్॥ ౫౫

క॥ జాంబూనదవిదితములౌ । గంబూరపు ఠాగములను ♦ గ్రైరావళులన్
బింబోష్ఠియొకతియుందియుఁ । దాంబూలము వేసికొనియె ♦ ధావిధిదోపన్॥ ౮౬

సీ॥ పంజరసింజాన ♦ బహుకీరశారికా
ఫణితమన్మథతంత్ర ♦ బంధురంబు
జాలాగతారవ ♦ స్పర్శవీణారవా
కర్ణనోత్సుకపటు ♦ కలరవంబు
సుఖకృద్రతిరహస్య ♦ లిఖితబంధవిశేష
సంయుతయవనికా ♦ సంచయంబు
నవరత్నకీలిత ♦ నవ్యోపచారస
జీవపాంచాలికా ♦ సేవ్యతలము

గీ॥ సారఘనసార వరగంధ ♦ సారచారు
మసృణఘుసృణవిదిత సంకు ♦ మదమృగమద
ముఖరతి సుఖకరద్రవ్య ♦ ముఖ్యమగుచు
నలరుచుండిన కేళికా ♦ నిలయమునను॥ ౮౭

చ॥ అరుదొనరించు కుందనపు ♦ టందలముల్ దగుతూగుటుయ్యెలల్
విరివిరిచప్పరంబులును ♦ వింతగుకాంతులఁ జెందు చందువల్
వరలెడు దర్పణస్ఫటిక ♦ వాటములుఁ మగరాలదేహళుల్
తరళగ వాతురత్నములు ♦ తద్గృహదీపములై కనంబడున్॥ ౮౮

క॥ మగరాలకురుచలును నిగ । నిగమను మరకతపుమణులు ♦ నిడుపులు కోడుల్
ధగధగను పద్మరాగము । లుగనొనరినశయనమున్న ♦ లోపలి దెసకున్॥ ౮౯

ఉ॥ మూలలనీలముల్ తుదల ♦ ముత్తెపుగుత్తులు సందుసందులన్
జాలగు పచ్చలున్నడుమ ♦ చక్కనిఁ గెంపుల జొంపమద్దులన్
మేలగుస్ఫాటి కాంకములు ♦ మించులసంచుల మించుపట్టెయున్
నేలుగఁగల్గి వెల్గుటకుఁ ♦ జిత్తము రంజిలి సెమ్మదంబునన్॥ ౯౦

కం॥ ఆరీతి మదినిఁబొదలుచు । నారాజసుతుఁడు పరిక్రమ్మి ♦ యాంచితలీలా
గారాంతర శయ్యావయిఁ । గూరిమితో నధివసించి ♦ కోరిక దీరన్ ౧

ఉ॥ ఎప్పుడువచ్చునో చెలియ ♦ యెప్పుడు ప్రేమను గారవించునో
యెప్పుడు కౌఁగలించుకొను ♦ నెప్పుడు వాతెర గ్రోలనిచ్చునో
యెప్పుడు కేళి సల్పుదొకొ ♦ యెప్పుడు నేసల మారుగెల్తునో
యెప్పటికెప్పుడంచు హృద ♦ యేశ్వరిరాక మదిన్ దలంపుచున్॥ ౨

ఆ॥ చంచలాక్షులాల ♦ సించఁగారఁ బేము
కాఁ సుధాంశు నెండ ♦ కాకలకును
మరునిధాకలకును ♦ మదతిరాకలకునేఁ
దాళలేనటంచుఁ ♦ దలఁకితలఁకి ౩

వ॥ ఇవ్విధంబున నెదురుచూచు చున్నంత ౪

సీ॥ కురులుచక్కఁగదువ్వి ♦ విరులచేరులఁజుట్టి
విరివిగా మురిపెంపు ♦ తురుమొనర్చి
సిరులీనవజ్రంపు ♦ చేర్చుక్క నవరించి
కస్తూరికాచిత్ర ♦ కంబునిలిపి
వీనుల మణిగణా ♦ న్వితకుండలములుంచి
యరుత ముత్తెపుపట్ట ♦ నిరవుగొల్పి
నిబ్బరంబానరించు ♦ గబ్బిగుబ్బలమీఁద
గంబురాగలసిరి ♦ గంధమలఁది

గీ॥ కరములను గంకణంబులు ♦ మెరయనుంచి
తలుకుతళుకుల హారంబట్టు ♦ చీరఁగట్టి
యడుగులను విడువక ప్రేమాయు ♦ సందియలును
నొవరపరచిరి ముగుదకుఁ ♦ నెపురుఁబోండ్లు ౫

వ. మఱియుఁ గర్బురాభంబులైన కుంభికుంభ సంభవంబులు రక్తసిత వర్ణంబు
లైన వంశజంబులు జ్యోతి ప్రభంబులగు జలద జననంబులు హారిద్రాభంబు
లైన యిక్షు సంభూతంబులు నీల కాంతిగల ఫణిఫణోద్భవంబులు శుద్ధస్ఫ
టిక సంకాశంబులగు శంఖ జాతంబులు కృష్ణలోహితచ్ఛవిగల వరాహదం
ష్ట్రోదితంబులు పాటల ప్ర శంబులగు శుక్తి జన్మంబులు గజల హారంబులు
ముక్తావళులు దేవచ్ఛందంబులు గుత్సంబులు గుత్సార్ధంబులు గోస్తనంబులు
మాణవకంబులు నేకావళులు నక్షత్రమాలికలు ననుహార విశేషంబులు సవ
రించి రత్నమయంబులగు భూషణంబులు శ్రీగంధాది పరిమళ లేపంబులు
నానావిధ కుసుమ మాల్యంబులు మొదలగు చతుర్విధ శృంగారంబుల నలం
కరించి యించు బోడులలోఁ బ్రోడయగు నొక్కచేడియ యాపూఁబోఁడి కిట్లని
నియె॥ ౯౭

శా. ఓ నారీమణి చెల్వునింగదిసి నీ । యుల్లాసముల్ జూపి నీ
వానింగానొనరించు మించుక విన్నే । వాకౌఁగిటన్జేర్చుచున్
సూనాస్త్రింగెలిపించి నేరుపులచే ♦ సాక్షించి సోలించితే
నీనాస్నేహమెఱుంగవచ్చు నిపుడో ♦ నీరేజ పత్రేక్షణా॥ ౯౮

గీ॥ అనుగులొత్తి పందు ♦ టాకుల సొగసైన
మడుపులొసఁగి రతుల ♦ జడుపులేక
సరసరతులవిభుని ♦ గరగించి తేనియు
నేడు తెలియుసీదు ♦ నిపుణతయును॥ ౯౯

క॥ వినుముద్దుగులుకు పలుకుల । వినఁదలఁచి వినుండుగోరి ♦ వేఁడిపలుకరిం
చిన సిగ్గుఁబడుచు లోభం । బూనరఁగ వినివినని పగిది ♦ నుండెదుసుదతీ॥ ౯

చ॥ అనిచతురోక్తి సూక్తులగ । యాళితనంబునఁ బల్కునా సఖుల్
దనువిడనాడి యొక్కెడఁ దొ ♦ లంగుదురోయని వారిపయ్యెదల్
బెనఁగొని వెన్కముందడుగు ♦ బెట్టుచు నందెలు ఘల్లుఘల్లనన్
గినుకఁదొలంగు చూపులన ♦ ళీక్షతిఁదూరుచు వచ్చెనయ్యెడన్ ౧౦౦

దొంచి ౧౦౧

అతివమణిమయకేళి గృ ♦ హాంతరాళ
రమ్యశయనంబు వసియించు ♦ రమణునెదుట
నిలిచి భయకంపవిస్మయో ♦ త్కలికపులక
ముఖ్యసాత్వికదశలచేఁ ♦ బొలిచియపుడు ౧౦౨

చెలియత్తద్దేవ దేహళీ ♦ సీమఁజెంది
వెనుకముందైన యడుగులఁ ♦ దనరెలజ్జ
యనెడు చెలివెన్క కొసఁగించ ♦ నలరుప్రేమ
యనెడు చెలిముంపరికిఁ ద్రోచు ♦ ననువుఁదోప ౧౦౩

న విభుని ప్రోల నిలిచిన చిత్స్తుతులమ్మనోహరాంగు నింజూచి
౧౦౪

నేరుపరికాఁడవన్నిఁట ♦ నృపతనూజ
బాలఁజూచినఁగడు ముద్దు ♦ రాలుగాని
ప్రోఢతన మేమియుంగదు ♦ బుజ్జగించి
తీరఁగడఁగాఁగ మెల్లన ♦ దిద్దుకొమ్ము॥ ౧౦౫

జ్జయై పెనఁగ ♦ నేరదుమూఁకని కేళిలోపలఁ
మెలంగఁ జొరఁ బారదు కౌఁగిటి కానఁజేసిన
ంచి ముంగలికిఁ ♦ జేరదు శ్రీధరణీశ పుత్రమా
తలీపెరుగ ♦ వా వివరింపఁబనేమి మాకికన్ ౧౦౬

॥ అనుచుఁబల్కైన నగుచు భ ♦ ద్రాయువపుడు
మందు ఘనసారసహిత తాం ♦ బూలములను
లలిత మణిభూషణాంబరా ♦ దుల నొసంగి
యెని పెనచ్చెడి యలనేరు ♦ పలరుచుండ॥ ౧౦౭

౧౦౮

వ॥ అతులంబనిపిన॥

సీ॥ శ్రీగంధమే దెత్తు • శ్రీగంధగజయాన
చంద్రంబునే దెత్తు • చంద్రవదన
సుమజాలమే దెత్తు • సుమనోరథావాప్తి
ఫలములే దెత్తుజం • భలదురోజ
సారసంబే దెత్తు • సారసాంచితవాణి
పాటలంబే దెత్తు • పాటలోష్ఠి
పరిమళంబే దెత్తుఁ బరిమళోత్సవవాంఛ
సరసినే దెత్తుఁ గే • సరిసుమధ్య॥

ఆ॥ యనుచు నొక్కొక్కరయ్యింతి • ననుఁగుఁ జెలులు
కార్యమిపమునఁ గేళికా • గారమెడలిఁ
చిఱునగవు నెమ్మనమ్ములఁ • జెంగలింప
వచ్చిరయ్యెడ సిగ్గను • వనితదక్క ౧౦౯

౧౧౦

వ॥ అట్టియెడ॥

క॥ సతియపుడు స్థాయిభావం • బతిరయమునఁ దోఁచ • భావహావాదికముల్
నితిలేక మెలఁగెఁ బ్రేమస్ • సతిమోమున దృష్టినిలిపి • సరభసవృత్తిన్

చ॥ చరణతలంబులెంచికర • సారసముల్ బరికించి పెందొడల్
మురియుచుఁ గాంచి చిన్నసను • మున్ వివరించి చెలంగుచున్న మో
మరసివచించి పేరురము • నందుఁ బ్రియంబున మించియున్న భూ
వరునయనాంతముల్ మగుడ • నెనులాతుణికత్వ మువ్వఁగన్

౧౧౧

వ॥ అప్పుడు

సీ॥ సమ్మోదమునసల • సంబులై యంతలోఁ
గ్రమ్మరవళితప • కారమొంది

ప్రేమచే నార్ద్రింబులై • మాటిమాటికి
ముకుళీకృతంబులై • మోహమునను
క్షణమాత్రమాభిను • ఖ్యస్ఫీతివిజసిల్లి
లజ్జాప్తిచేఁ జంచ •లంబులగుచు
గడుని మేమపరాఙ్ము • ఖంబులైవ్యాదయభా
వా కూపములనుబ • యల్పడంగఁ

గీ॥ జేయుచూపులచేఁబ్రియు • జెంతఁజేరి
యిందిరాసు తుపట్టంపు • చేఁగనగఁ
నలరువిల్తుని నవమోహ • నాస్త్రమనఁగ
నిలుచునయ్యంఁ తిఁగనుఁగొని • నృపవరుండు ౧౧౩

సీ॥ ముందుగానేనయ్యె • నుంచలించినఁపల్క
నలుగునోకలుగునో • తెలియరాదు
సూచితప్రేమచేఁ జూచితినా • వెన్క
కేగునోలోగునో • యెఱుగరాదు
వీడమిమ్మనిచేరఁ • బిలచినవింతగాఁ
జేరునోమీరునో • చెప్పరాదు
పైతాపటంబుచేఁ •బట్టెదనంటినా
వెగచునోపరచునో • దెరవుగాదు

గీ॥ ఏమిసేయుదు నేమందు • నేయుపాయ
మీగతినియీవిరాళిని • నెటులనోర్తు
ననుచుశిరమూచుఁజేఁజూచు • నెనయఁజూచు
నేసుకేర్పడ కన్పడా • నృపవరుండు ౧౧౪

కుందలింతునిపు • డిందుముఖిదృష్టి తూపసంబు
[illegible]రంతులజ్జలెవి • లాసకళాకుశలాత్మనిష్ఠ జే

బాగుగ గూడువాఁడసుమ! బాణశరంబులఁ జిక్కి స్రుక్కినే
వేగగలేనటంచు మదివిశ్వవిభుండు దలంకి చింతిలెన్ ౧౧౫

వ॥ ఇట్లు చింతించి. ౧౧౬

గీ॥ నేరుపునగాని కరగదీ నెలఁతమనసు
ప్రోఢ తనమేరు పరచంగఁ బొసఁగదనుచుఁ
జాటుకారప్రకార వాచావిచార
మమర ధరణీధవుండిట్టు లనియెనపుడు ౧౧౭

క॥ ఓరాజీవాక్షీ రోమరు! బారింబడియున్న ననుఁ గృపారసధారా
వారిం దేలించుటకై రారాదా యిందుముందు రాకేందుముఖీ

గీ॥ కొమ్మ యీ మదుపులనుజే కొమ్మనీదు
మధుధురాధర రససుధా మధురభాష
కొమ్మ లలరంగ మణిభూష కొమ్మలిపుడు
గనికరమ్మునఁ గై కొమ్మ కనికరమున ౧౧౮

సీ॥ పలుకవే తేనియల్ జిలుకంగముంగల
నబ్బుసిబ్బెపు గబ్బి గుబ్బలాడి
చూడవే వేడుకల్ తోడనేకూడంగఁ
గన్నారి నెమ్మోము చిన్నెలాడి
నిలుకవే పాయంబు గులుకులు తళుకొత్త
మేలైన పువ్వుల మేనులాడి
చెలఁగవే యొయ్యారి మొలుకసమ్మదమున
మించుసంచులమించు మెరుఁగుఁబోడి

గీ॥ సోలమున మేలమేటికి వాలుగంటి
సుదుట కేతెంచవేటికే యిందువదన

జాలిఁ జెలించనేటికే • సారసాక్షి
కేళి నేలంగ రాదెయో • కీరవాణి ౧౨౦

సీ॥ ఏకాంతమున నను నీ • వెన్నఁడు వీక్షింతునో
యని తల్చుకొనఁగొన్ని • దినములతీఁగ
సరసరాత్రిందివ • జాగ్రదవస్థచేఁ
జరియించఁ గొన్నివా • సరములతీఁగఁ
మదనవేదనధూయా • మానమానసతనా
రంభించఁ గొన్నివా • రంబులతీఁగఁ
కుశలవాంఛితభవ • ద్గురుజనాజ్ఞప్తికై
వసియించఁ గొన్నిది • వంబులతీఁగ

గీ॥ నిముసమొకపూట పూటొక్క • నెలయు నెలయు
హాయనము హాయనముగల్ప • మగుచునుండఁ
గరుణఁ జేయుట యెప్పుడో • గారవించు
టెప్పుడో కాని తెలియదే • యిందువదన ౧౨౧

సీ॥ ఇంపుగా నగుమొగం • బెత్తి కన్గొనకున్న
దాఁగలరాయనినెట్లుఁ • దెగఁడు వాఁడెఁ
దేనెజాల్లుగ్గవా • తెరఁగ్రోల నీకున్న
మధువిజృంభణమెట్లు • మరచువాఁడెఁ
గలికామృతములొల్క • పలుకఁ బల్కకయున్నఁ
గీరాదికము నెట్లు • గెలచువాఁడ
సురతసౌఖ్యంబునఁ • జొక్కించకున్నను
దర్పకు నేనెట్లుఁ • దరుమువాఁడ

గీ॥ గబ్బి చనుగుబ్బ లొరయంగఁ • గౌఁగలింపఁ
జేయకున్నను బైవచ్చు • శీతలాని

లుని హాసించంగ నేనెట్లు ♦ పెనఁగువాఁడ
వింతసేయంగ నేటికే ♦ విభ్రమాక్షి అ-౨

సీ॥ అతివరో మన్మథుం ♦ డనుసూత్రధారుండు
తద్దేహలావణ్య ♦ ధన్యకళలఁ
బాత్రముల్ జేసినే ♦ పత్యాఖ్య యవనికాం
తరములోపల స్థాపి ♦ తముగఁజేయు
నవియు బాహ్యభ్యాంత ♦ రావాప్తిఁ జెన్నొందఁ
గనుగొంటి గానిమి ♦ కుట్టముగాఁగ
దారయులజ్జాత్తిర ♦ స్కరిణిలోపలనుండి
విలసిల్లు నీమనో ♦ వృత్తినటిని

గీ॥ వెడల నీవయ్యె నీకృపా ♦ నీ(స్వ)తదృష్టి
ననుఁ గనుంగొంటి వేన్నిఁద ♦ న్నాట్యవిధముఁ
జూచి సమ్మోద మొందుదో ♦ సుందరాంగి ౧౨౨
మనవిఁ గైకొను మికనైనఁ ♦ జనువుమీర

వ॥ అని విప్రలంభ శృంగారంబున నొక్కింత సరసవచన రచనల నెఱపి సంభోగ ౧౨౪
శృంగారంబున కొడఁబాటించి

చ॥ నడుమసియాడఁ గంకణని ♦ నాదము లుప్పతిలన్బదాబ్జముల్
తడఁబడ ఘల్లుఘల్లని ముద్దంబున నందెలు మ్రోయుచుండసాం
పడరెడు మాటుకేతనప ♦ టాంచలమై తగ్గిపైటజారన ౧౨౫
వ్వడఁతి కరాంబుజంబ్దడసి ♦ పట్టినృపాలవతంసుఁ డయ్యెడన్

వ॥ ఇవ్విధంబున బట్టినఁ గిలికించిత భావంబున సంచలించు చంచలాక్షిని హంస ౧౨౬
తూలికాతల్పంబునం జేర్చి

సీ॥ తరళాన్వితంబులై ♦ విరళప్రవాళహా
స్తాంచితంబులు కంచు ♦ కాంతరంబు

చొక్కాలంసంబుల ♦ నొక్కి వట్టి
యురముపైఁ గరయుగ్మ ♦ మొనరించ గన్గొని
బిగిచనుల్ గరమునఁ ♦ బిగియఁబట్టి
సాహసకేళిఁ జెలించు ♦ నరువునిరీక్షించి
కెందొండ లందందఁ ♦ బెనఁగి జీసి

గీ॥ పరగుకటిసీమ నుత్పల ♦ పత్రములను
నఖరపై ఖరులుంచు న ♦ న్నాహమొత్తఁగి
సీత్కృతంబొనరించుచు ♦ సిగ్గునొంది
విముఖత వహించు చెలిఁగూడె ♦ విభుఁడు మొదల ౧౨౯

వ॥ మఱియు సామోక్తులఁ బ్రార్థనాది శేషంబుల రతిప్రేమఁ బుట్టించి వెందంబు గందనీయక కందర్ప కేళినొందించి ౧౩౦

సీ॥ తొంగమున విరివిగాఁ ♦ దురిమిన పూనరుల్
చెదరి వన్నెలుదీరి ♦ చిక్కువడఁగ
నురముపై నిరవొంది ♦ సిరులకింపైనము
క్తాహారములు జారి ♦ కన్పడంగ
లీలాకపోలపా ♦ ళికసన్మరీకక
లాపముల్ శ్వేతాంబు ♦ లనుగరంగఁ
మేననిండనలందు ♦ మిసిమిశ్రీగంధాధి
పరిమళంబులు పలు ♦ పల్చగాఁగ

ఆ॥ గమ్మ తెమ్మరలకు సరి ♦ సాఁజరించు
నూర్పుగమిదోఁచఁ బెనుమోహ ♦ మొప్పచుండఁ
జిరుత ముత్తియములరీతిఁ ♦ జెమటచిన్కు
లలికమునఁ దోఁచఁదత్కూట ♦ మమరెనప్పుడు ౧౩౧

వ॥ మఱియును ౧౩౨

సీ॥ సునుగప్పు కొ ప్పుము ♦ నూ్మ్రపునగదియంగఁ
జన్గొండ లురమున ♦ సంఘటిల్లఁ
జిక్కన్న మెఱుఁగెక్కు ♦ చెక్కుచెక్కుట నుండఁ
దావిచేఁ దగుమోవి ♦ మోవిపైనఁగ
సరసకటీతటిఁ ♦ జరణాబ్జము జెలంగఁ
బొలుపొందు కరముప్పీ ♦ పునఁబొసంగ
నలయుక తనరుచు ♦ నుల నొక్కటిగఁజేసి
రతిపారవశ్యసం ♦ రంభ మొంది

గీ॥ సుందరీమణి గూడియా ♦ సూనబాణుఁ
డనఁగఁదగినట్టి భద్రాయు ♦ వతివినోద
సమ్యగమృతాంబు నిధియందు ♦ శయిత్తుఁడైన
నీరజాక్షుఁడవల సుఖ ♦ నిద్రఁజెందె ౧౩౮

వ॥ అట్టియెడ ౧౩౯

గీ॥ అంతకన్నమున్న ♦ మానీరజాతాక్షి
లేచి కేళిల్లక ♦ ణోచితముల
మరుఁగుపడ విలాస ♦ మందిరంబెడఁబాసి
వచ్చి సిగ్గుపడిన ♦ వనితలపుడు ౧౪౦

గీ॥ చెలియ యీరేయి విభుఁడేమి ♦ జేసెనతని
క్లిష్టవర్తనమేరీతి ♦ నీవుసలిపి
తింతయు వచింపుమిపుడునీ ♦ చెంతనరుగు
వారలముగాని సఖిలాతి ♦ వారమట్టవె ౧౪౧

క॥ అనవిని విననట్టులనా। నన శామరసంబువంచు ♦ ననఘోడినిచ
య్యనఁ గదిసిసరీరంభా। బుసఁజేర్చిప్రేమోక్తులొప్పఁ ♦ బొదలించిసగః । ౧౪౨

క॥ మానినీమణి నీవునీ ◆ మగడు నూన
శరుని కేళిలో నైక్యులై ◆ సరసమార్గ
మునఁ జరించిన యావంతి ◆ జనుల కెల్ల
గొప్పదంబగుచుండు నా ◆ సంతతంబు ౧౩౯

సీ॥ సరసపుంస్కోకిలా ◆ స్వాదితంబై యెప్పు
డరుణపల్లవము శోం ◆ పలరుచుండ
రాజహంసనఖాళి ◆ రాయుచుంబుల్లెమించి
యుజ్జ్వలశంఖులో ◆ యొయ్యారమెసఁగ
బున్నాగ సంపర్క ◆ మునమాధవీలతా
యసియాడఁ బొడఁగ హా ◆ యమరఁ జెలంగ
హితమహీన విలాస ◆ మీక్షించి పదముల
ననురాగము వహించి ◆ హర్షమెసఁగ

గీ॥ ననుచుఁ దత్సఖులు సలజ్జ ◆ యైన చలినిఁ
గనుచు సాధ్వ్యవసానల ◆ క్షణఁ దలంచి
పలుకనించు కస్మితముచే ◆ నలుకదోలుక
నులుకుచుండంగ నప్పుడ ◆ ప్పొలఁతు లెనసి ౧౪౦

ంబున నర్మనరోక్తి నర్మగర్భ నర్మహాసంబు నర్మస్ఫోటంబులగు భా
స్మితంబును హసితంబును విహసితంబును పహసితంబు నపహసితంబు
సితంబు స్మితహసితంబులను నుత్తమస్థానంబుల విహసితోపహసితంబు
ధ్యములయెడ నపహసితాతి హాసితంబుల థమపత్రంబులు నివి మొదలగు
ర్యంబులు గరపిరసాభిజ్ఞాన యోగ్యంబగు భావంబీషద్వ్యక్త వికారభావం
హావంబు సువ్యక్త విక్రియాభావంబుగల హేలయు భూషణాభావంబై
హారంబై తోచు మాధుర్యంబు శీలాద్యలంఘనంబై కనుపట్టు ధైర్యంబు
యానుకరణ సరస వాక్యగత్యాది చేష్టితంబుగల లీలయు, మనోరమము
క్షణంబులగు విలాసంబులు స్వల్పభూషణాతి రమ్యంబై తగువిచ్ఛిత్తియు

భూషణస్థానవి పర్యాంబున నగు విభ్రమంబును, దోషాశ్రుమార్ణచీత్యాది సాంక ర్యంబున నొప్పు కిలికించి తంబును ఇష్టకథాది సంభవ సంభావనా సూచకం బులగు మోట్టాయితంబును రతిసమ్మర్ద సుఖాధిక్యంబగు కుట్టమితంబు విలాస జనితంబగు బిబ్బోకంబు నిరంతర సౌందర్యంబున దగులలితంబు మనోజ్ఞదృష్టి చపలత్వంబుగల కుతూహలంబు భయసంభ్రమంబులందగు చకితంబు వాక్యా వివరణంబుగలవి హృతంబును విశ్రుతివస్తు సంజాతంబై తోచు హాసంబు నివి మొదలగు యష్టాదశ శృంగార చేష్టలెల్లఁగఁజేసి స్థాయీ భావంబులఁ పరస్ప రావ లోకన సంభాషణాలింగన చుంబనాద్యనేకవిధవ్యాపారంబులుగ అలశృం గార రసంబునకు నుత్సాహంబు బుట్టించి నగుచుఁ బ్రియునివలనఁ బ్రతిదినాభ్య స్తరతిగతు లెఱింగి యుక్యాంతారత్నంబు ౧౮౫

సీ॥ పర్వేందు ఖండప్ర ♦ భాఫాలతలమున
నునుకుంతలములు న ♦ ర్తనముసలుప
నురుచిర భాస్వన్మ ♦ కురుకపోలస్థల
ములమణి తాటంక ♦ ములునటింప
విలసిత శ్రమజలం ♦ బులచేత నించుక
తొలఁగిన మౌక్తిక ♦ తిలక మలరఁ
గుచకుంభములమీఁదఁ ♦ బ్రచురంబులగు తార
హారముల్ డోలా వి ♦ హార మొంద

గీ॥ జఘునఘన మేఖ లారావ ♦ చరణనూపు
రస్వరంబులు గళరవ ♦ సుస్వరములు
కంకణనినాదములు నొక్క ♦ గతిచెలంగఁ
బడతిపీ యుత న న ♦ ప్పతిఁ గలంచె ౧౮౬

వ॥ అట్టియెడ ౧౮౭

సీ॥ మౌక్తికంబుల చంద్ర ♦ మండలంబు జెలంగె
విరళతారలవ్యో మ ♦ వీధిదనరె
జంచలత్వము మానె ♦ స్మారచాపము దోఁచె

గలరవంబులు మానె • గలరవములు
నించుక ముకుళించె • నిందీవరంబులు
కమ్మ తెమ్మెరలు ని • ల్కడలఁ జెంద
నచలితస్తబకమై • యలరె జంపకవల్లి
చిగురు వెన్నెల గల్గి • చిగురునిగుడ

గీ॥ మెఱుపులొందిన మేఘంబు • విరివిదూచె
నేమిచిత్రంబొ కాని యా • భామయనుచు
సరస వచసరచనలన తె • రుణిగరఁగఁ
జేసిసంతోషవారిధిఁ • జెందెనృపుఁడు ౧౪౮

బున సరోజాక్షి ... గర్భనర్మ స్ఫోటనర్మస్వాంజ్ఞమధురిలనుధురీణంబగు
ఆతఁ ప్రతిదినంబు సమస్త సురతవిశేషంబులఁ ప్రౌఢనాయక నానరించ
నవతి స్వాధీనపతికాది లక్షణ లక్షితయై సరస సల్లాపహావభావ విలా
సాదులఁ గొన్నిదినంబులు దనర్చ ౧౪౯

గీ॥ అంతక తకుఁ ప్రౌఢిమ • నలరికీర్తి
మాలినీకాంత కాంతుని • మనసుఁగరఁగఁ
జేసిచంద్రాంగ దాజ్ఞప్తి • శిశిరవిలస
దుపవని చరించెఁ బ్రియునితో • నుత్సహించి ౧౫౦

గీ॥ ... రయునితఁ సుద • శార్ణ దేశాధిరాజ్య
పూజ్యుఁడగువజ్రబాహుని • పుత్రుఁడగుటఁ
దద్విషయమున కాధిప • త్యమువహింపఁ
జేయవలెనని సంతోష • చిత్తుఁడగుచు ౧౫౧

సమస్త్రి నొక్కని । జేరితదధ్యక్షుఁడటుకఁ • జేసి నుపాయ —
సంబొసర్గింపుము । ఘోరయుమున నేగి యనిన • యతఁడిట్లనుచుఁ ౧౫౨

సీ॥ దాశార్ణదేశప్ర ♦ ధానపూరధివాస
దానసోల్లాసిరయ ♦ వ్యాఘ్రబాహు
కాత్మాగతంబుచం ♦ ద్రాంగదప్రేషిత
త్వంబని ముందుగాఁ ♦ దగవచించి
మీరువిచ్చేయుట ♦ మేలుసిద్ధించునీ
మొదలను సమ్మోద ♦ మలరుచుండ
హాస్త్యశ్వరథపదా ♦ త్యాప్తభృత్యామాత్య
హితపురోహితసమ ♦ న్వితుఁడవగుచు

తే॥ తొలుత గిరిసరిదుపవన ♦ ములనుమార్గ
దుర్గమస్థానములనెల్ల ♦ నిర్గమించి
ధన్యచంద్రాంగదప్రసి ♦ ద్ధప్రధాన
నగరిఁజూడంగ జనిన న ♦ జ్జగతివిభుఁడు ౧౫౩

క॥ చతురంగ బలముగొలువఁగ॥ నతిరయమున నెదురుకొనుచు ♦ నన్యోన్యసమ
ర్పిత కలితాలింగనముల। జతురవచన రచన లెనయ ♦ నల్పుచు ప్రేమన్ ౧౫౪

క॥ నవరత్న మయశుభోద్యా। నావిధసవిధ వివిధమణి ♦ సమన్వితముసభా
భవనమున కలరుచు దశా। ర్ణవిభుండో తెంచిమణిక ♦ నకపీఠము నన్ ౧౫౫

క॥ వినయమునఁ జేర్పసింహా। సనమున నూతనలతాంతశరుఁ ♦ డనఁదగు రా
ట్తనయునిఁగనుఁగొని నిజజీ। వనదునిఁ గాఁదలచనతఁడ ♦ వారణభక్తిన్ ౧౫౬

సీ॥ పాదకంజములకుఁ ♦ బ్రణమిల్లి కవినవే
గంబుగాఢాలింగ ♦ నంబొనర్చి
యితఁడు మత్ప్రాణదుం ♦ డితఁడు మద్బాంధవుం
డితఁడు మచ్ఛత్రుసం ♦ హారిహారుండు
సీతని యన్వయం ♦ బితని సౌందర్య
మీతని విక్రమం ♦ బెల్లసేన

వానిదివ్యాకార • వంతునిగాఁ జేసి
యారాజపుత్రుని • కతిముదమున
శత్రువధంబుతో • శంఖఖడ్గములిచ్చి
యొనసిద్వాదశ సహ • స్రేభబలము

గీ॥ నొసఁగి సకలార్థశాస్త్ర సం • యుక్తుఁ జేసె
గానతఁడు సమర్థుండు • ఘనవిచారం
రాజవదనుని బుత్రుని • రాజధాని
కిపుడు దోడ్కొని పొమ్ము మ • హీశతిలక ౧౬౨

క॥ అని సర్వంబువచించిన। వినివిస్మయ మందికుంది. వెనుకనుదాఁజే
సినదుర్నయమును దెగడుచు।జననాథుఁడుసమ్మదమున•సత్వరుఁడగుచున్ ౧౬౩

క॥ ఆయుగ్రభార్యతనయుని। ఛాయవిమోహంబుతోడ•పతిరంభములన్
జాయం జేయుచు సమ్మో। దాయత్తమనంబుదోప • నధివతియచటన్ ౧౬౪

వ॥ కొన్నిదినంబు లధివసించి తదిష్టగోష్ఠితో నుండునెడ

క॥ ఘనై మధుండుబహుబహు। మానంబొనరింపనగ •మహిపతినిసుతునిం ౧౬౫
నానావిధమణినికర।స్యానరథంబులనువిడుక • చయ్యనవచ్చెన్ ౧౬౬

క॥ వచ్చినిజరాజధానిక। విచ్చలవిడి యచ్చరాలి • వెరగందంగన్
సచ్చరితుఁ దైనపుత్రుని। జెచ్చెరసింహాసనస్థు • జేసెముదమునన్ ౧౬౭

వ॥ ఇట్లుచేసిన ౧౬౮

గీ॥ సకలజనుల సదానంద • జలధిఁ దేల్చి
దేవగురువిప్ర పూజ • విధేయవృత్తిఁ
బ్రాజ్యతరపూజ్య సామ్రాజ్య • భారమూని
చెలిబల భద్రాయు వేంద్రవా. • భవముదోప

గీ॥ మగధదేశాధినాథుఁ డేఁ ♦ మరఘుముందుఁ
బుత్రమిత్రకళత్రప ♦ భూతభూతి
నొందఁజేయుచు నిడచియా ♦ నందమహిమ
సకల పృథ్వీభరంబున ♦ సంభ్రమించె ౧౭౦

చ॥ శివకవచప్రభావము ప్ర ♦ సిద్ధతరర్ష భయోగిదత్తఖ
డ్గవరదరప్రతాపమున ♦ ఖండపరాక్రమ విక్రమంబు ప్రా
భవముఁ జెలంగుచుండఁ బరి ♦ పంథివిదారణ మాట చిత్రమా
యనిరళద్దానధర్మ పరఁజొటకుఁ ♦ జోద్యమె యెన్నిభంగులన్ ౧౭౧

వ॥ అని యివ్విధంబున సకలవర్ణంబులవారు వినుతింప సామ్రాజ్య ధురంధరుండ
యియుండెనని సూతుండు శౌనకాది మునీంద్రులకు నీ పుణ్యకథా శ్రవణంబు
నఁ జతుర్విధ పురుషార్థంబులు సిద్ధించునని వివరించి యైతిహ్య పురాణంబుల
వినోదంబు సల్పుచుండె. ౧౭౨

శా॥ అండేజధ్వజకాండకాండ కకటా ♦ హాప్రాంచదుద్యద్యశ
స్తండప్రక్రమ దక్షదక్షసవన ♦ ధ్వంసక్రియాహంక్రియా
ఖండప్రాభవ చిత్తచిత్తజ మహా ♦ గర్వాభ్రజంఝానిలో
ద్దండస్థైర్య విహారహారశరదు ♦ ద్యద్వారిభృద్విగ్రహా ౧౭౩

క॥ సురధరణీధరశాసన। సరసారధితో దనత్ర్ప ♦ ణవజపక్మద్దా
శరధి హితకరణ ధీరత। శరధీకృత శరధిశైల ♦ శయభూమిరథ ౧౭౪

పృథ్వీవృత్తము

నియుద్ధ సమయోద్యమ ♦ నిజభుజార్గళాస్త్ర త్రుటు
ద్వియత్[illegible]థుపదాపత ♦ ద్విమతతుండ చండోత్తమా
భయభ్రమద[illegible]గా ♦ భయకర [illegible] చకీభవ
త్స్వయోదయశ[illegible]సనా ♦ తతసమ[illegible]త్రికోత్సనా ౧౭౫

మ॥ ఇది శ్రీవేములవాడ పట్టణనివా • సేశానసంప్రాప్తశ
శ్వదయప్రాభవ కామినేనికుల రా • జారెడ్డి దేశాయిన
మ్మదలక్ష్మీనృపతి పండితోదితను • ధీమందార భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధమురుచిం • పున్పంచమోల్లాసమై ౧౭౬

## గద్య

ఇది శ్రీ భద్రామారెడ్డిపేట రాజరాజేశ్వర కరుణాకటాక్షేక్షణ ప్రసాద
ప్రాప్తోభయ భాషావిశేష సామ్రాజ్యపూజ్య రాచుళ్ల గోత్రపాత్ర
కామినేని వంశపయః పారావార రాకాసుధాకర రాజన్న
దేశాయి సార్వభౌమాజ్ఞాపితాంధ్రగీర్వాణకవిత్వ
చాతుర్యధుర్య పరాశరగోత్ర రాపాకలింగ
నార్యపుత్ర లక్ష్మీనృపతి ప్రణీతంబైన
భద్రాయురభ్యుదయంబు
సందు సర్వము
పంచమోల్లాసము



# అచ్చు చెడిపోయిన శబ్దముల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౭ | దాతృయజేత్యు | దాతృయజేత్యుక్తి | ౮౪ | ౪ | సత్యాది | సత్వాది |
| ,, | ౧౨ | భాషి | భాషిత | ౮౭ | ౨౫ | న్వాంత | స్వాంత |
| ౯ | ౨౦ | జలంబున్బడ్డి | జలంబునబ్బడి | ౮౬ | ౧౮ | జెలగుచుదురు, | జలఁగుచుందురు |
| ౧౧ | ౧౩ | పద్మరాయుగ తోపరి | పద్మ రాగయు తోపరి | ౬౩ | ౧౮ | డెతియ | డెలియ |
| ౧౩ | ౧౪ | సుప్తాంగ | సుప్తాంగజ | ౬౯ | ౨౧ | ప్రతితోగ | ప్రతితోగ్ర |
| ౧౭ | ౨౩ | నైదిఘంటిక | నైఘంటిక | ౯౧ | ౧౭ | సతతంచాక్షరీ | సతత పంచాక్షరీ |
| ౨౦ | ౧౪ | నిర్వ్హాణ | నిర్వాణ | ౯౨ | ౧౨ | యామునిరాజ | మునుపారాజ |
| ౨౩ | ౨౬ | పజకీలిత | వజకీలిత | ౧౦౧ | ౨౪ | సహనతాహిస | సహనతాహింసల |
| ౨౪ | ౧౭ | భాగ్యాంగ్లాద | భాగ్యసగరాధ | ౧౦౭ | ౨౮ | మంత్రరాజమా | వరమంత్రరాజమా |
| ౨౫ | ౧౦ | శోకుఁడు | శ్లోకుఁడు | ౧౧౧ | ౪ | రామమహేశా | రాజమహేశా |
| ౮౫ | ౧౮ | నదతి | సుదతి | ౧౨౨ | ౩ | విసు | విష్ణు |
| ౪౬ | ౯ | నిత్యస్వ | నిత్యసత్య | ౧౨౩ | ౧౪ | సక్తి | సక్థి |
| ౫౨ | ౧౬ | కొన్యము | కౌలిన్యము | ౧౨౬ | ౮ | వ్రడనాభుని | వ్రజనాభుని |
| ౫౫ | ౨౧ | శిరంగ | శ్రీరంగ | ,, | ౧౬ | సమ్మతంబు | సమ్మతంబు |
| ౭౧ | ౫ | షష్యంతములు | పష్ఠ్యంతము లు | ,, | ౨౩ | శరత్పర్జ్యాన్యగ్జ | శరత్పర్జన్యగర్జా |
| ౭౯ | ౮ | మహారోగము | మహారోగము | ౧౩౩ | ౨౬ | మిని | భూమిని |
| ౧౩౪ | ౨౬ | సల | స్థల | ౧౮౭ | ౩ | మలియ | మల్లియ |
| ౧౪౭ | ౨౭ | సంకిస్థితి | సంక్షిప్తస్థితి | ,, | ౧౪ | తిలిలాక | తెలివాక |
| ౧౫౩ | ౧౫ | డగ | దగ | ౧౬౨ | ౮ | యేమనజ | యేమనన్ |
| ౧౫౫ | ౧ | గైకొని | గైకొని | ౨౦౩ | ౧౭ | మలి | దెమలి |
| ౧౫౮ | ౧౨౩ | జేయఁగా | జేయఁగా | ౨౦౧ | ౮ | వీణాదన | వీణావాదన |
| ౧౫౬ | ౧౦ | నొందించె | నొందించె | ౨౧౨ | ౧ | చండాలులర | చండాలులను |
| ౧౮౧ | ౪ | లసదువ | లసదుప | ౨౧౫ | ౧౧ | రజోపతి | రజోవృత్తి |